

# అరుణతార

సాహిత్య, సాంస్కృతిక మాసపత్రిక 314

సంపుటి: 38 సంచిక: 7 మే, 2015

పేజీలు: 52 వెల: రు. 15

ఎందుకంటే నేను మీ
స్వేచ్ఛను విస్తరించాలనుకున్నాను
నా స్వేచ్ఛకు ఇనుపతెర బిగుసుకుంది
ఎందుకంటే నేను స్వేచ్ఛాలయాన్ని
నిర్మించాలనుకున్నాను
మీ అందరి కోసం నేను క్రూరమైన జైలు గదుల్లోకి
తోయబడ్డాను...
నేను సత్యానికి స్వరాన్నివ్వాలనుకున్నందుకే
నా స్వరపేటిక నులిమివేయబడ్డది...
ఇదేదో నాకు సంబంధించిన
గొడవ అని మీకనిపించవచ్చు
కానీ ఇది అందరిదీ!

## మే 9న హైదరాబాదులోని ఇందిరాపార్కు వద్ద ప్రొఫెసర్ జి.ఎన్. సాయిబాబా, మొత్తంగా రాజకీయ ఖైదీల విడుదలకై జరిగిన ధర్నా దృశ్యాలు



























3




(314)




సంపాదకుడు
**చలసాని ప్రసాద్**
వర్కింగ్ ఎడిటర్
**డి.వి. రామక్రిష్ణారావు**
ఎం.ఐ.జి. - 14, ఎ.పి.ఐ.ఐ.సి. కాలనీ,
కార్బైడ్ కంపెనీ ఎదురుగా,
మౌలాలి, హైదరాబాద్ - 500 040.
* కేవలం పోస్ట్, బుక్‌పోస్ట్ ల ద్వారా
రచనలు పై చిరునామాకూ,
ఇ-మెయిల్ ద్వారా
**arunatara1977@gmail.com** కూ
పంపవచ్చు
సంపాదకవర్గం :
**ఉజ్వల్, బాసిత్, కూర్మనాథ్**

**చందాలు పంపాల్సిన చిరునామా**
మేనేజర్
**వలేటి అరవింద్ కుమార్**
భీమ్‌సేన్‌రావు, 1-9-52/ఎఫ్/2,
ఈ-సేవ దగ్గర, మదర్ హైస్కూల్ ఎదురుగా,
రామ్‌నగర్, హైదరాబాద్ - 500020.
**సెల్ : 8142200711**
**(ఫోన్ చేయాల్సిన సమయం**
**ఉ.10 గంటల నుండి మ. 1 గంట వరకు)**

**విరసం కార్యదర్శి చిరునామా**
**పి. వరలక్ష్మి**
5-1820, గీతాశ్రమం వీధి,
ప్రొద్దుటూరు, కడప జిల్లా - 516 360.
**డి.టి.పి. అండ్ లే అవుట్**
**ఆర్. భాగ్యలక్ష్మి**
**మొదటి అట్టమీది వాక్యాలు**
**కార్ల్ మార్క్స్**
వ్యక్తీకరించిన ఒక కార్మికుడి మాటలు
**నాల్గవ కవర్ పై**
**చిత్త ప్రసాద్**
శతజయంతి సందర్భంలో ఆయన వేసిన బొమ్మలు
**2వ కవర్ ఫొటోలు : క్రాంతి**
**2-3 కవర్ డిజైన్ : ఆర్. భాగ్యలక్ష్మి**

Like Page://arunatara viplava rachayitala sangham

Virasam website : *www.virasam.in*

**ఈ సంచిక వెల : రు. 15/-**

సంపుటి : 38 ◆ సంచిక : 7 ◆ మే, 2015

**సంపాదక లేఖ...**

విప్లవ ప్రజాస్వామ్య వేదిక జాతీయ సహాయ కార్యదర్శి కామ్రేడ్ జిఎన్ సాయిబాబాను పోలీసులు అరెస్టు చేసి ఈ ఏడాది మే 9కి సంవత్సరమవుతోంది. నాగపూర్ కేంద్ర కారాగారంలో ఆయన దుర్భర నిర్బంధాన్ని అనుభవిస్తున్నారు. శారీరక వైకల్యంతో, ఒంటరిగా, తీవ్ర అనారోగ్యంతో ఉన్నారు. ప్రతిష్టాత్మక ఢిల్లీ విశ్వవిద్యాలయ అధ్యాపకుడు సాయిబాబా మీద పోలీసులు పెట్టిన అక్రమ కేసుల్లో ఇప్పటికీ విచారణ మొదలు కాలేదు. బెయిలు ఇవ్వలేదు. బెయిలు ఇవ్వజాలని అత్యంత ప్రమాదకరమైన వ్యక్తిగా న్యాయస్థానం ఆయన్ను చూస్తోంది.

నిజమే కావచ్చు. ఆయన మన పాలకులు చెప్పే ప్రజాస్వామ్యాన్ని విశ్వసించి ఉంటే ఏ ఇబ్బందీ ఉండేది కాదు. సునాయాసంగా బెయిలు వచ్చేది. అసలు అరెస్టు చేసే వాళ్లే కాదు. కానీ సాయిబాబా ఒక కార్యకర్తగా, బుద్ధిజీవిగా, అధ్యాపకుడిగా ఎదిగే క్రమంలో విప్లవ ప్రజాస్వామ్యాన్ని అర్థం చేసుకొని, దాన్ని సాధించే పనిలో తలమునకలయ్యారు. వర్గ సమాజంలో ప్రజాస్వామ్యమంటే బూర్జువా ప్రజాస్వామ్యమే. ఉత్పత్తి సాధనాల మీద పెత్తనం ఉన్న, అదనపు విలువను దోచకుంటున్న బూర్జువా వర్గం కోసమే ఈ ప్రజాస్వామ్యం ఉంది. ఇది అమలులోకి రావడానికి కూడా శ్రామిక, కార్మిక పోరాటాలే కీలకం. కానీ ఒకసారి బూర్జువా ప్రజాస్వామ్యం ఉనికిలోకి వచ్చాక దాని అంగాలన్నీ దోపిడీ వర్గం కోసమే పని చేస్తుంటాయి. అది వాటి విధి. అప్పుడప్పుడు ప్రజలను మాయ చేయడానికి 'మంచి' చట్టాలు, 'మంచి' తీర్పులు వస్తుంటాయి.

సాయిబాబాలాంటి వాళ్లకు సహజంగానే ఈ ప్రజాస్వామ్యం నచ్చదు. విప్లవకర ప్రజాస్వామ్యం కావాలనుకుంటారు. బూర్జువా ప్రజాస్వామ్యం ఎలాంటిదంటే .. దాని పరిధిలో ఏమైనా మాట్లాడవచ్చు. కానీ సాయిబాబాలాంటి వాళ్లు అసలు ఈ ప్రజాస్వామ్యాన్నే తిరస్కరించి, దీన్ని రద్దు చేసే పోరాటాల్లో పాల్గొని విప్లవ ప్రజాస్వామ్యాన్ని నిర్మిస్తాం.. అంటారు. అందుకే సాయిబాబా అత్యంత ప్రమాదకరమైన మనిషిగా పోలీసులకు, న్యాయస్థానానికి అగుపించారు. ఆయనకు బెయిలు ఇచ్చేస్తే విప్లవ ప్రజాస్వామ్యం గురించి మళ్లీ బహిరంగంగా మాట్లాడతారు. రాస్తారు. ప్రభుత్వానికి ఇది గిట్టదు. మామూలుగా చాలా మంది... న్యాయస్థానానికి ఒక రకమైన పవిత్రత ఆపాదించి, నడుం, శిరస్సు, ఆలోచనలు దాని ముందు పూర్తిగా వంచి విధేయంగా ఉంటారు. పోలీసులను, రాజకీయ నాయకులను విమర్శించే వారు సహితం న్యాయస్థానాలను ఆరాధిస్తూ ఉంటారు.

కానీ సాయిబాబా విషయంలో న్యాయస్థానాలకు కూడా పాలకవర్గాల వలెనే విప్లవ ప్రజాస్వామ్యమంటే భయం. ఈ వ్యవస్థ గుండుగుత్తగా బూర్జువా ప్రజాస్వామ్యమనే పేరుతో అధికారాన్ని కట్టబెట్టినా సరే న్యాయస్థానాలకు సైతం విప్లవ ప్రజాస్వామ్యమంటే వెన్నులో చలి పుట్టుకొస్తోంది. విప్లవ ప్రజాస్వామ్యం ఎలా ఉంటుందో దండకారణ్యం గురించి మోదీతోపాటు న్యాయమూర్తులూ ఎంతో కొంత వినే ఉంటారు. దాని గురించి మాట్లాడేవాళ్లను, పని చేసేవాళ్లను దేశవ్యాప్తంగా అక్రమంగా అరెస్టు చేస్తోంది. జెయిలే తప్ప బెయిలు ఊసే లేకుండా చూస్తోంది.

అయితే విప్లవ ప్రజాస్వామ్యాన్ని విశ్వసించే వాళ్లంతా సాయిబాబాను విడుదల చేయాలని కోరుతున్నారు. సుప్రసిద్ధ రచయితలు, మేధావులు, సుదీర్ఘ ప్రజా జీవితం కలవారు, ప్రజాందోళనాకారులు సాయిబాబా పక్షాన నిలబడ్డారు. ఇలాంటి అక్రమ అరెస్టులు గతంలో ఎన్నో జరిగాయి. మోదీ పాలనలో మరింత ఎక్కువయ్యాయి. సాయిబాబా అరెస్టు బూర్జువా ప్రజాస్వామ్యానికి, విప్లవ ప్రజాస్వామ్యానికి మధ్య జరుగుతున్న సంఘర్షణను సూచిస్తోంది. ఏ రాజకీయ, తాత్విక విశ్వాసాలతోనైనా సరే బూర్జువా ప్రజాస్వామ్యాన్ని విమర్శించే వారంతా సాయిబాబా పక్షాన నిలబడాలని కోరుతున్నాం. ఆయన విడుదల కోసం ముందుకు రావాలని విజ్ఞప్తి చేస్తున్నాం. విప్లవ ప్రజాస్వామ్యాన్ని నిజం చేయడానికి చేయి చేయి కలపాలని ఆహ్వానిస్తున్నాం.



4

## సంచిక - 314



**అరుణతార చందాదారులకు విజ్ఞప్తి !**
ఏ కారణం చేతనైనా మీకు అరుణతార అందకపోతే పిన్‌కోడ్‌తో సహా మీ చిరునామాను మరోసారి **8500809250** మొబైల్ నంబర్‌కు మెసేజ్ పెట్టగలరు. గమనిక : ఈ నెంబర్ కేవలం మెసేజ్‌ల కొరకు మాత్రమే! - సం.

విరసం కరపత్రాలను, స్టేట్‌మెంట్లను, అరుణతార పత్రికలను, విరసం ప్రచురణలను **www.virasam.in** వెబ్‌సైట్‌లో చూడవచ్చు. సాఫ్ట్‌కాపీలు డౌన్‌లోడ్ చేసుకోవచ్చు.
అలాగే వివిధ సాహిత్య పత్రికల బ్లాగులు, సైట్‌ల లింకులను కూడా చూడవచ్చు.

అరుణతార చదవండి!
చదివించండి!
చందాదారులు కండి!

చందాలు, బకాయిలు మనియార్డర్, డి.డి.ల రూపంలో మేనేజర్‌కు పంపించండి.
డి.డి.లను **వలేటి అరవింద్ కుమార్, హైదరాబాద్** పేర తీయండి.
విడి సంచిక వెల - రు. 15; సంవత్సర చందా - రు. 180;
రెండు సంవత్సరాల చందా - రు. 350; మూడు సంవత్సరాల చందా - రు. 500;
ఐదు సంవత్సరాల చందా - రు. 800; దశాబ్ది చందా - రు. 1600/-

# నేరస్తులకు బెయిళ్ళు, న్యాయం అడిగే వారికి జైళ్ళు

- పి.వరలక్ష్మి

జెయిళ్ల సీజన్ పోయి బెయిళ్ల సీజన్ వచ్చిందని ఈ మధ్య ఒక పత్రిక రాసింది. ఒక కాలమంతా కోట్లకు కోట్లు ప్రజా ధనం కాజేశారని దేశంలో బడా రాజకీయ నాయకుల్ని జైలుకి పంపి మన న్యాయ వ్యవస్థ ప్రజలకు తన మీద నమ్మకాన్ని, అవతల ఎంతటి వారున్నా న్యాయం జరగవచ్చు అనే ఆశల్ని సామాన్యులకు పెంచింది. ఇప్పుడు మళ్ళీ వరుసగా పెద్దలందరికీ బెయిలిచ్చి విడుదల చేయడం, కేసులు కొట్టివేయడం మీడియాలో తాజా తాజా వార్తల వద్దన అయింది. బహుశా బెయిలు చరిత్రలో ఒక శిక్ష పడ్డ ఖైదీకి అత్యంత వేగంగా కొన్ని గంటల్లోనే పై కోర్టు బెయిలు మంజూరు చేయడం, ఆయన ఇంటివద్ద గుమికూడిన వందల మంది హర్షధ్వానాలు, ట్వీట్‌లు, చర్చలు, వివాదాలు వెరసి సినిమా గ్లామర్ లో మీడియా తడిసి ముద్దయింది. సల్మాన్ ఖాన్ పేదల మీదికి కారు నడిపిన కేసుకన్నా ఆయన జైలుకు పోతే సినిమా పరిశ్రమకు ఎన్ని కోట్ల నష్టం వస్తుందనే కాసుల లెక్కలు మీడియానే కాదు, న్యాయవాదులనూ, కోర్టులనూ పరిగెత్తించి ఉంటాయి. సరిగ్గా ఇది జరిగిన మరుసటి రోజు మే 9న ఏడాదిగా జైల్లో ఉన్న ఢిల్లీ యూనివర్సిటీ ఆధ్యాపకుడు, విప్లవ ప్రజాస్వామిక వేదిక సహాయ కార్యదర్శి డా. సాయిబాబాను విడుదల చేయాలని హైదరాబాదు ఇందిరా పార్కులో, డిల్లీ యూనివర్సిటీ ప్రాంగణంలో ఆందోళన చేస్తున్న కొన్ని వందల మంది ప్రజాసంఘాల కార్యకర్తల బాధ మీడియాకు పెద్దగా పట్టలేదు కానీ అనివార్యంగా వచ్చే ఈ రెండు కేసుల పోలిక న్యాయ వ్యవస్థకున్న వర్గ స్వభావాన్ని గురించి మాట్లాడేలా చేస్తోంది. ఇదే వరుసలో తమిళనాడు మాజీ ముఖ్యమంత్రి జయలలిత విడుదలను ఆమె అభిమానులు పండుగ చేసుకున్నారు. దేశంలోనే అతిపెద్ద కార్పొరేట్ నేరంలో శిక్షను అభవిస్తున్న సత్యం రాజు గారు బెయిల్ పై బైటికొచ్చారు. ఇక సంఘ పరివార్ నేరస్తుల గురించి చెప్పనక్కర్లేదు. మత అల్లర్లు, బాంబు పేలుళ్ళ కేసులో శిక్షలు పడిన వాళ్ళు కూడా విడుదలైనారు. ఇప్పుడు పదవులూ అనుభవిస్తున్నారు. సాయిబాబా ఏమో నాగపూరు కోర్టు బెయిల్ మంజూరు చేయలేని ప్రమాదకర వ్యక్తి అయ్యాడు.

మే 9, 2014న కాలేజీ నుండి విద్యార్థుల జవాబు పత్రాలు దిద్ది వస్తున్న సమయంలో దారికడ్డంపడి కళ్ళకు గంతలు కట్టి డా.సాయిబాబాను ఎత్తుకుపోయి ఏడాది గడిచింది. నాగపూర్ కేంద్ర కారాగారంలో అండా సెల్ అనబడే గాలీ వెలుతురు సోకని ఇరుకు గదిలో మనిషి తోడు కూడా లేకుండా ఆయనను నిర్బంధించారు. ఆయన కాళ్ళు పనిచేయవు కాబట్టి మరుగుదొడ్డికి పోవాలన్నా నేలమీద పాకుతూ పోవాలి. ఆయనను బలవంతంగా ఎత్తుకు వచ్చే క్రమంలో ఆయన చక్రాల కుర్చీ విరిగింది. వెన్నెముక మీద వత్తిడి పడి వంగిపోతోంది. ఎడమ చేయి పైకెత్తలేక అవస్థ పడుతున్నారు. బి.పి., గుండె జబ్బులకు ఆయన క్రమం తప్పకుండా మందులు వేసుకోవలసి ఉంటుంది. ఏ ఒక్క దానికీ ఆయనకు చికిత్స అందడంలేదు. బైటి నుండి కుటుంబ సభ్యులు, మిత్రులు మందులు, పళ్ళు పంపించినా నిరాకరిస్తున్నారు. ఆయన ప్రత్యేక పరిస్థితిని దృష్టిలో పెట్టుకునైనా బెయిల్ ఇవ్వమని న్యాయవాదులు పలుమార్లు చేసిన విజ్ఞప్తిని ప్రభుత్వం, పోలీసుల ఒత్తిడి వల్ల హైకోర్టు కూడా నిరాకరించింది. బెయిల్ దరఖాస్తు విచారణలో ఉన్నప్పుడు ఆయనకు జైలు అధికారులు ప్రత్యేక ఆహారం అందించడం, వైద్య పరీక్షలకు పంపడం చేస్తారు. బెయిల్ తిరస్కరించగానే వెంటనే వాటిని తొలగిస్తారు. చివరికి ఆరోగ్యం దిగజారుతున్న స్థితిలో సాయిబాబా, ఆయనకు చట్టపరంగా అందవలసిన కనీస సౌకర్యాలు, మందులు, వైద్యం కోసం ఏప్రిల్ 11న జైల్లోనే నిరాహార దీక్ష మొదలుపెట్టాడు. 14నాటికి రెండు సార్లు స్పృహ కోల్పోయాడు. చివరికి 16వ తేదీ రాత్రి 11 గంటలకు మళ్ళీ స్పృహ కోల్పోయి పరిస్థితి దిగజారుతున్నప్పుడు ఆయనకు బలవంతంగా సెలైన్ ఎక్కించి భారీ బందోబస్తు నడుమ నాగపూర్ వైద్య కళాశాల ఆసుపత్రికి పంపించారు. ఆయన గురించి కుటుంబసభ్యులు, ప్రజా సంఘాలు ఆందోళన వ్యక్తం చేస్తూ నిరాహార దీక్ష విరమించమని విజ్ఞప్తి చేశాయి. కోర్టు ఆయనకు మెరుగైన వైద్య సౌకర్యాలు అందించాలని ఆదేశించింది. ఏప్రిల్ 17న ఆసుపత్రిలో దీక్ష విరమించాక ఒక్క రోజు తిరక్కుండానే మళ్ళీ ఆయన్ని అండా సెల్ లో నిర్బంధించారు.

ఇంతకూ సాయిబాబా చేసిన నేరం ఏమిటి? చక్రాల కుర్చీలో తప్ప కదలని మనిషి కేవలం తన ఆలోచనలతో కదలికలు పుట్టించేవాడు కావడమే తప్ప మరొకటి కాదు. ఆయనపై పెట్టిన సెక్షన్లు రాజకీయ విశ్వాసాలను, అసమ్మతిని నేరంగా పరిగణిస్తాయి. తీవ్రవాదులకు సహకరిస్తున్నారని అనుమానం వచ్చినా, ఆయన ప్రచారం చేసే భావాలు ప్రభుత్వం దృష్టిలో ప్రమాదకరం అనిపించినా చట్ట వ్యతిరేక కార్యకలాపాల నిరోధక చట్టం ప్రకారం ఆయన శిక్షార్హుడు. నేరం నిరూపించి ముద్దాయికి శిక్ష నిర్ణయించడం కాకుండా, నేరం ఆరోపించబడిన వ్యక్తే నిర్దోషినని నిరూపించుకునేవరకూ ఆ శిక్షను అమలుచేయవచ్చు. ముంబై పేలుళ్ళ నేపథ్యంలో వచ్చిన ఈ చట్టం అత్యధికంగా ముస్లింలపైనా, మార్క్సిస్టు-లెనినిస్టు- మావోయిస్టు సైద్ధాంతిక విశ్వాసాలు గల వారిపైనే ప్రయోగిస్తున్నారు. వివిధ రాష్ట్రాల్లో ప్రజా సంఘాల నాయకులు, అందులోనూ ఎక్కువగా విప్లవ ప్రజాస్వామిక వేదిక (ఆర్.డి.ఎఫ్) బాధ్యులు ఈ చట్టం కింద నిర్బంధించబడుతున్నారు. తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ లలో ప్రస్తుతం ఆర్.డి.ఎఫ్ పై నిషేధం కూడా అమలులో

ఉంది. దీనికి నేపథ్యం ఆపరేషన్ గ్రీన్ హంట్ అని పేరు పెట్టుకున్న ప్రజలపై యుద్ధం. ఈ యుద్ధాన్ని వ్యతిరేకిస్తూ బుద్ధిజీవులు కలిసి మాట్లాడే వేదికలు ఏర్పరచడం ప్రభుత్వానికి భరించలేనిదైంది. ఆదివాసుల పోరాటంపై కనీ వినీ ఎరుగని సంఖ్యలో 4లక్షల సైన్యాన్ని ప్రయోగిస్తుండటాన్ని ప్రచారం చేస్తే ఉన్న పరువు పోతుందని సభలూ, సమావేశాలూ, చివరికి ప్రెస్ మీట్ లు కూడా ప్రభుత్వాలు అడ్డుకుంటున్నాయి. సాయిబాబా వివిధ సందర్భాల్లో అనేక ప్రజా ఉద్యమ వేదికల్లో, పౌరహక్కుల ఉద్యమాల్లో పోషించిన పాత్రయే గ్రీన్ హంట్ వ్యతిరేక ఐక్య సంఘటనల్లోనూ పోషించడమే ఆయన నేరం. రెండేళ్ల క్రితం కామ్రేడ్ గంటి ప్రసాదం హత్యకు గురైనట్లుగానే ఇప్పుడు సాయిబాబాను జైల్లోనే అంతం చేయదలచుకున్నారా అని ప్రజాసంఘాలు ఆందోళన చెందుతున్నాయి. ఎందుకంటే ఆయనను ముట్టుకోకుండానే ఆయన శారీరక స్థితి అంతకంతకూ దిగజారేలా చేయవచ్చు.

సాయిబాబా పోరాటం మాత్రం అయిదేళ్ళ వయసు నుండే మొదలయ్యింది. ఈ దేశంలో కోట్లాది మందిలాగా ఆయనదీ పేద రైతు కుటుంబమే. పోలియో తన శరీరం పై దాడి చేసి ఆయన నడుము కింది భాగమంతా చచ్చుబడేలా చేసింది. పోలియో తనకు విధించాలనుకున్న పరిధుల్ని అతిక్రమించాడు. అమలాపురం దగ్గర పల్లెటూరులో మట్టి రోడ్లపై తన రెండు చేతులతో దేహాన్ని ఈడ్చుకుంటూ మొదలు పెట్టిన ప్రయాణం కాలేజీ చదువు నాటికి మలుపు తిరిగింది. తన ఆరోగ్యం తనకు పరిమితుల్ని విధించినట్లుగానే దేశానికున్న రుగ్మతలు అసంఖ్యాక జన సమూహాల్ని సాంఘికంగా, ఆర్థికంగా అణచివేస్తున్నాయని గ్రహించాడు. తన శారీరక అనారోగ్యం కన్నా దేశాన్ని పట్టి పీడించే దోపిడీ అసమానతలు ఎన్నో రెట్లు తీవ్రమైనవని అర్థం చేసుకున్నందుకే ఆయన తన చక్రాల కుర్చీలో దేశమంతా పీడితుల వెంట తిరిగాడు. అప్రజాస్వామిక రాజ్యాన్ని ప్రశ్నించకుండా ఎప్పుడూ ఆయన విశ్రమించింది లేదు. ఆలిండియా పీపుల్స్ రెసిస్టెన్స్ ఫోరం ఆంధ్రప్రదేశ్ కమిటీ కార్యదర్శిగా ఆ తర్వాత జాతీయ కార్యదర్శిగా సామ్రాజవాద ప్రపంచీకరణ విధానాలకు వ్యతిరేకంగా అవిశ్రాంతంగా పనిచేశాడు. వివిధ ప్రజాసంఘాల ఐక్య వేదిక నిర్మాణాలలో కృషి చేశాడు. అంతర్జాతీయ వేదికల్లో పోరాడే ప్రజలకు బాసటగా నిలిచాడు. ఢిల్లీ యూనివర్సిటీ టీచర్స్ అసోసియేషన్ లో ఆయన క్రియాశీలకంగా పనిచేస్తూ అధ్యాపక, విద్యార్థి ఉద్యమాలకు బాసటగా ఉన్నారు. ఢిల్లీ విద్యార్థుల, అధ్యాపకుల బలమైన మద్దతు ఆయనకు ఉండడం వల్లనే ఆయనను నేరుగా అరెస్టు చేయకుండా దొంగచాటుగా ఎత్తుకుపోయారు. అంతకు రెండు సార్లు ఆయన ఇంటి మీదికి పోలీసులు వచ్చినప్పుడు, ఆయనని ఇంటరాగేట్ చేసినప్పుడు పెద్ద ఎత్తున నిరసన వచ్చింది. శారీరక వైకల్యంతోనూ ఆయన కష్టాలను లెక్క చేయకపోవడం, నిర్బంధాలకు వెరవక పోవడం బహుశా రాజ్యాన్ని మరింత అసహనానికి గురిచేసి ఉండవచ్చు. ఆ చక్రాల కుర్చీని చూసి బంగారపు కుర్చీ భయపడుతోందని ఒక హిందీ కవి రాశాడు. అసలు వైకల్యం ఉన్నది ఈ వ్యవస్థకు, దీనిని పరిరక్షిస్తున్న ప్రభుత్వాలకు కాదా? అది ప్రజాస్వామిక చూపు లేని వైకల్యం. సొంత వనరులపై, స్వావలంబనపై నిలబడలేని వైకల్యం. సామ్రాజ్యవాద రాజకీయార్థిక, భావదాస్యం తప్ప మరో ఆలోచన లేని వైకల్యం.

ఏడాదైనా సాయిబాబా కేసు విచారణ ప్రారంభం కాలేదు. ఈ లోగా మూడు సార్లు ఆయన బెయిల్ పిటిషన్ కొట్టి వేశారు. అక్రమ అరెస్టు, తప్పుడు కేసులు మోపడమే కాక విచారణ ఖైదీగా ఉన్న మనిషి పట్ల, అదీ తీవ్రమైన అనారోగ్యమూ, శారీరక వైకల్యమూ ఉన్న మనిషి పట్ల చట్టాలనూ, కోర్టు ఆదేశాలనూ ఉల్లంఘించి, హింసకు గురి చేస్తున్న రాజ్య దుర్మార్గాన్ని ఖండిస్తూ, ఆయన విడుదల కోసం ప్రజాసంఘాలు డా.జి.ఎన్.సాయిబాబా విడుదల పోరాట కమిటీగా ఏర్పడి ఆందోళన చేస్తున్నాయి. పౌరహక్కులకు గ్యారెంటీ ఇచ్చిన చంద్రశేఖరరావు బంగారు తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం మే 9న జరుప తలపెట్టిన ర్యాలీకి అనుమతి నిరాకరించింది. చివరికి ఇందిరా పార్క్ వద్ద పరిమిత ప్రజాస్వామ్యం అనుమతించబడింది.

డా.సాయిబాబా మీడియా దృష్టిలో సెలబ్రిటీ కాదు. కాబట్టి ఆయన ఆరోగ్య పరిస్థితి గురించి గంట గంటకూ బులెటిన్లు కాదు కదా కనీసం ప్రస్తావన కూడా ఉండదు. ఏడాది క్రితం మావోయిస్టు సంబంధాలున్న యూనివర్సిటీ ప్రొఫెసర్ అన్న సంచలన వార్త తర్వాత జైలులో ఆయన చేస్తున్న న్యాయ పోరాటం గాని ఆయన పట్ల మానవీయ స్పందనగానీ వ్యక్తపరిచే సున్నితత్వం ఇప్పుడు ప్రచార మాధ్యమాలకు లేదు. బూటకపు ఎన్కౌంటర్లకు సమర్థనలు, రాష్ట్ర,దేశాధినేతల భక్తి ప్రచార పరమావధి ఉన్న పత్రికల నుండి ఆశించగలిగేదేమీ ఉండదు. వినాయక్ సేన్, జీతన్ మరాండీలను ప్రజాపోరాటాలే విడిపించాయి. అట్లాగే సాయిబాబా విడుదల కోసం ఐక్య పోరాటం చేయాల్సిన అవసరం ఉంది. ఒక్క సాయిబాబాయే కాదు ఊపా, రాజద్రోహం వంటి చట్టాల కింద, రాజకీయ విశ్వాసాల కోసం జైల్లలో నిర్బంధించబడిన ఎంతోమంది రాజకీయ ఖైదీలకోసం, ఆదివాసులకోసం బుద్ధిజీవులు మాట్లాడాలి. ముందే చెప్పినట్లు సాయిబాబాను జైల్లోనే అంతం చేసే కుట్ర జరుగుతోందని అనుమానం ప్రజాసంఘాలకు కలుగుతోంది. అదే జరిగితే ప్రభుత్వం ఎట్లాగు ప్రధాన దోషి అవుతుంది, అయితే ఆ పాపంలో ప్రశ్నించని సభ్య సామాజానిదీ భాగస్వామ్యం ఉండదా?



# నిషేధం గురించే మాట్లాడు

- బాల సుధాకరమౌళి

కవికి
కవిత్వానికి
నిషేధాలుండకూడదంటాను

నీడ కురిపించే చెట్ల మధ్యో
ఎండ కాసే వీధుల్లోనో
గోళీలాడుకుంటున్న పిల్లాణ్ణి బంధించి
చేతులు వెనక్కి విరిచి
కణతలపై గురిచూసి తుపాకీ
కాల్చకూడదంటాను

కవీ
పసిబాలుడే -
చెరువు కాణా మీద కూర్చుని
ఇష్టంగా చెరుగ్గెడ తీపిని
గొంతులోకి మింగుతున్నట్టు -
రాత్రి వెన్నెట్లో
వెన్నుల తీరాల్లో
ఇసుక గూళ్ళు కట్టుకున్నట్టు -
కుట్రలేని 'కవిత్వం' కలగంటాడు

దేశంలో కల్లోలముంటుంది
ఆయుధం నకిలీ రాజ్యాంగాన్ని నడుపుతుంది
అరణ్యం పూల వాసన
ఈశాన్యం కొండల్లోంచి
నైరుతి దిశగా
దేశం దేశమంతా
వీస్తుంది
కల్లోల కాలపు ఎదురు గాలి
వంచన గాలి
రక్తాన్ని ఏ కొంచెమైనా కదిలించకపోతే
రక్త తంత్రులను ఏ కొసనైనా మీటకపోతే
ఎవరైనా
అసలు మనిషే కాదంటాను

మనిషి మీద నమ్మకం ఉన్న వాణ్ణి నేను
ఒళ్ళంతా మట్టి అంటించుకుని
మట్టి మీదే పొర్లాడే
అతి సాధారణ మనిషైనా
నిషేధం గురించే మాట్లాడాలంటాను -

ఆ చేతులకు ప్రాణముంది!

యోటెంటరె
తీగె అల్లుకుంటున్నట్టు
చేతులు
నల్లబల్లని అల్లుకుంటాయి
నల్లబల్లంతా
వలయాలు వలయాలుగా చేతులే
చేతుల తీగెలే -
వదిలితే
పొదల్లోకి పారిపోయేట్టుండే
కుందేటి కూపల్లాంటి బొమ్మలు -
అప్పుడప్పుడూ చేతుల్లోంచి ఎగురుతూ ఒచ్చి
పావురమో
నెమలో
రెక్కలున్న ఏ విచిత్ర జాగిలమో
నల్లబల్ల మీద వాలుతుంది -

ఆకాశం
నేల
ఆ చేతుల మీంచే ఎదిగివస్తున్నాయా !
ఒక పిల్లాడు
ఛెంగున తరగతి గదిలోంచి దూకి
ఆ చేతుల ముందు వాలుతాడు
చేతులు సహజస్థావరాలవుతాయి

సహజస్థావరాల్లాంటి ఆ చేతులు
ఏ మట్టి నుంచి మొలుచుకొచ్చాయో!
ఛిద్రమైన పగుళ్ళ నేలలోంచి
ఎదిగొచ్చిన కాంతి స్తంభాల్లా
రేపటి భవిష్యత్తును
ఎందుకనో కళ్ళ ముందు సాక్షాత్కరింపజేస్తున్నాయి

ఆ చేతులు
బొమ్మలతో నాట్యం చేయిస్తాయి
కొండల్ని, కోనల్ని, కొబ్బరిచెట్లనూ
సజీవ చిత్రాల్లా మలుస్తాయి
కాయాకష్టం చేసుకునే మామూలు మనుషుల్నే
కత్తిడాలు పట్టుకుని
సమరానికి సిద్ధం చేస్తాయి

ఆ చేతులే
పిల్లల డ్రాయింగ్ బుక్ ల మీద
చిట్టిపొట్టి బొమ్మలై
ముద్దగా అలంకరించబడతాయి

ఎన్నాళ్ళైనా
ప్రాణవంతమైన ఆ పిల్లల చేతుల్లోనే
ఆ చేతులు బతుకుతాయనిపిస్తున్నాయి -

# గాబ్రియేల్ గార్షియా మార్క్వెజ్

- వెంకటకృష్ణ

నీ కథన మార్మికవాదం
దక్షిణ అమెరికా మట్టి మనుషులు
ఎదుర్కొన్న కఠోర వాస్తవం

నీ రచనా వాస్తవికత
లాటిన్ అమెరికా జానపదం నుంచి
రూపుదిద్దుకున్న మాయా పరిమళం

నీ సాహితీ విన్యాసం
కరేబియన్ సంక్షుభితం నుంచి
అల్లుకున్న తంత్ర మంత్రజాలం

నువ్వు సృష్టించిన 'మకాండో'
ఒక కావ్యభూమి
ఒక వీరభూమి
ఆదిమ జాతులు ప్రవర్తిల్లే ఇష్టభూమి
ఒక మరుభూమి

నువ్వు రూపొందించిన 'జోస్‌ఆర్కిడియో బుండియా'
పట్టువదలని ఆదిమ యోధుడు
ఆ జగమొండికి జత చేసిన 'ఉర్సులా'
నేలంత ఓరిమి గల తల్లి

* * *

ఒక బాదామి చెట్టుకు బంధింపబడ్డ యోధుడి
అవసాన ప్రేలాపనలో
అతడి ఏడు తరాల ఆవలి వారసుడు
చీమలకు ఆహారమయ్యే కథనం
నిజమయ్యే జోస్యం- ఎంత విషాదం
అది ఆ వంశం అందుకున్న విఘాతం
నువ్వు రూపు కట్టిన శాపజాతిది
నూరేళ్ల ఏకాంత వాసం

తెగలుగా విడివడ్డ జాతి
తెగలని క్రూరంగా అణచివేసిన
ఐరోపా ఆధునికత నీడలోనే ఎదిగింది
అమెరికా అత్యాశలకు నలిగింది

కన్నీరు ఘనీభవించిన దారిద్ర్యం
కడుపుల్ని మాడ్చేసిన దేశ సౌభాగ్యం
అరటి తోటలుగా వ్యాపించిన దురాక్రమణ
అమెరికా అకృత్యాలు శవాల బోగీలై
కన్నీటి సముద్రాలు చేరింది

బొందితో ఆకాశానికెగిరి
అదృశ్యమైపోయిన సుకుమార సౌందర్యాలు
చూపును కోల్పోయి శరీరం శుష్కించి శుష్కించి
గుడ్డి గువ్వగా మిగిలి మాయమైన మాతృత్వాలు
నిషిద్ధ ప్రేమలతో వెంపర్లాడే విఫల జీవితాలు
కట్లు తెగి నర్తించే ఆదిమతనాలు
ప్రకృతి ఒడిలో ప్రవర్ధిల్లిన
నాగలి దున్నిన నేలలు-
యూరోప్ ఆక్రమణల వొరిపిడిలో
వొదిగిపోయిన పవిత్ర కన్యలు
వలస యాయసోకి, మూర్ఖత్వాల వొరవడిలో
కమిలిన కుమిలిన వంశావళులు

* * *

పూలు పూసిన నేల
విధ్వంసాన్నెదుర్కొంది
ఫలాల్ని అందివ్వాల్సిన నేల
గొడ్డలి పెట్లను పొందింది
యోధుల్ని ప్రసవించిన నేల రక్తాన్ని చిందింది
బాదామి చెట్ల కొమ్మలకు
ప్రతిఘటనల ఊయల ఊగింది
నూరేళ్లు గడ్డకట్టిన శ్మశాన నిశ్శబ్దం తర్వాత
ఎరుపెక్కిన గడ్డన ఆధునికత పొడిచింది
మార్క్వెజ్! నీ సాహిత్యం నుంచి
లాటిన్ అమెరికా రక్తమాంసాలతో రూపుకడుతుంది

అర కటికలో పుట్టిన గాబ్రియేల్ !
కొలంబియా కఠిన వాస్తవాల్లో కళ్లు తెరిచి
నూరేళ్ల ఏకాంతంలో కరిగి
విశ్వ సాహిత్యం ముందు
రెప రెపలాడిన లాటిన్ అమెరికా జెండావి

'చే' మాత్రమే తెలిసిన మాకు
'ఛావెజ్' దాకా సామ్యవాద కలకు
ఆకృతినిచ్చిన కలం యోధుడివి.

# అనితర సాధ్యుడు

- అన్వేషి

చెరగని చిరునవ్వు
మరిచిపోలేని వాత్సల్యం
ఉన్నత వ్యక్తిత్వం

మా హృదయాల్లో సుస్థిర స్థానం

నీ జ్ఞాపకాల చిరస్మరణీయమే
ఉత్తర తెలంగాణ ఉద్యమానికి దన్ను

మిలటరీ వ్యూహం
ప్రజలతో ఆత్మీయ చెలిమి
నీ కార్యదీక్షత, దృఢ సంకల్పం
నీ నిబద్ధతే మాకు చెదరని విశ్వాసం

ఆకలి, అలసట మరిచి
సాహసోపేతమైన అనితర సాధ్యమం నీ ఆచరణ
అనుభవాల గనిలోంచి పోటెత్తే విప్లవ తరంగానివి నీవు
శాఖమూరీ.. నీ త్యాగమే ఉద్యమాలకు నిరంతర ఊపిరి.

## వారికి అదే ఇష్టం

**- హుస్సేన్**

వారికి ప్రైవేటీకరణతోనే లాభం
ప్రభుత్వ సంస్థల ద్వారా వచ్చే ఆదాయంలో
చాటుమాటుగా సంపాదించే అవినీతికన్నా
గుండు గుత్తగా ప్రతిదీ కొల్లగొట్టుకోగలిగే ప్రైవేటీకరణే మేలు

అభివృద్ధి పేరుతో
ప్రకృతి వనరులను విచ్చలవిడిగా కొల్లగొట్టుకోవచ్చు
విద్యనూ, వైద్యాన్నీ సైతం అమ్ముకుంటూ
శవాలకూ చికిత్సలు జరిపినట్టు నటిస్తూ
అనవసరపు పరీక్షలు చేసి
కోటానుకోట్లు కొల్లగొట్టుకోనూ వచ్చు

ప్రజాస్వామ్యం పతనమైతేనేం
ప్రజల బతుకులు బుగ్గి అయితేనేం
మానవ విలువలు మట్టిలో కలిస్తేనేం
ఎడ్లు ఏట్లోబోతేనేం-గడ్డి గంగలో కలిస్తేనేం
ఎవరు ఏమంటేనేం-ఏది ఏమైతేనేం
ప్రైవేటీకరణే వారికి పసందైన లాభం
అడ్డగోలు దోపిడీ వారికి అత్యధిక లాభం

మరైతే-మన సంగతేంది?
దోపిడీ పీడనలు, ఆకలి, దప్పులు
అనారోగ్యాలతో చచ్చేకన్నా
సంఘటిత సమరంలో
తెగించి పోరాడుతూ చావడమే మిన్న.

## నిబద్ధుడు

**- కెసరీ**

స్వచ్ఛత అనే మాట
నిత్యం పరిహాసమవుతున్న చోట
స్వేచ్ఛను పల్లవించే గొంతుకలే లక్ష్యమవుతాయి
కోర్టులు, చట్టాలు, జైళ్లు బొంగురు గొంతుకల్లో వంత పాడతాయి

అవని గర్భాన్ని చీల్చే కుతంత్రం
అడవి గుండెల్ని పిండుతున్న విధ్వంసం
వివరం చెప్పి చెప్పిన మేధావి హత్యకు
పథకం సిద్ధమవుతుంది జైల్లోనే

అక్రమ నిర్బంధం, అంగవైకల్యం, అనారోగ్యాలకు లొంగని నిబద్ధత
జన స్వప్నానికి అదనపు పరిమళం అద్దుతుంది
కేవలం జ్వలిత చైతన్యం మాత్రమే
అతని శరీరాన్ని సజీవంగా నిలుపుతుంది

## విప్లవాగ్ని

**- ఆచార్య పి.ఎల్. శ్రీనివాసరెడ్డి**

నీకిష్టమైన గుణమేది అంటే
నిరాడంబరత అంటాడు నిండు కుండలా

నీ ప్రధానమైన లక్షణమేమిటని ప్రశ్నిస్తే
నిష్కర్షగా అంటాడు నిష్కపటమైన ప్రయత్నమని

సంతోషమంటే ఏమిటి నీ ఉద్దేశంలో అంటే
సంతత సాహసోపేతమైన పోరాటమంటాడు

దేన్ని అంటావు నీవు దౌర్భాగ్యమని అంటే
దేన్ని అంటాను నేను దీనత్వాన్ని తప్ప అంటాడు ఈసడింపుగా

నీవు అసహ్యించుకునే దుర్మార్గాతి దుర్మార్గమైన విషయమేమిటని అడిగితే
నిజంగా ముమ్మాటికీ భయంకరమైన బానిసత్వమంటాడు

నీకత్యంత ఆసక్తికరమైన వృత్తి ఏమిటని అడిగితే
నిత్యం పుస్తకాల పురుగుగా ఉండిపోవడమంటాడు

ఏది ఏది నీకు మహా ప్రీతిపాత్రమైన రంగు అంటే
ఎదనిండా గాలి పీల్చి, ఎత్తిన పిడికిలి బిగించి అంటాడు రక్త సదృశ్యమైన
ఎరుపు అని

ఎవరతడు?
ఇంకెవరు ?
అతడే
కలకాలం కణకణమండే విప్లవాగ్ని కార్ల్‌మార్క్స్



# గల్పికలు-అల్పికలు

- బమ్మిడి జగదీశ్వరరావు

## ఏపీని తెలంగాణాలో కలిపెయ్యాలి

వాళ్లందరూ ఒక్కచోట చేరారు. ఏం చేద్దామంటే మేం చేద్దాం?' అనుకున్నారు. నిరసన దీక్షకు లేదన్నారు. నిరాహార దీక్షకు కాదన్నారు. రైలు రోకో రాస్తారోకోలకు దారి లేదన్నారు. అసెంబ్లీ ముట్టడికి అసలే వీలు కాదన్నారు.

'ఎందుకు కాదు? ఎందుకు కూడదు?' కొత్త గొంతు నిలదీసింది.

'అవన్నీ ప్రజలకి...మనకి కాదు...మనం ప్రజా ప్రతినిధులం' ముసలి గొంతు ముద్దగా అంది.

'హు.. ప్రజా ప్రతినిధులం..నిధుల్లేని ప్రజా ప్రతినిధులం' నిట్టూర్పులు విడిచారు కొందరు.

'రాజధానికే నిధుల్లేవు, మన కొచ్చిందా?' ఓదార్పులు విడిచారు మరి కొందరు.

'తొంభై రెండు వేల ఐదొందలు పెరిగింది మా కేడర్ జీతం' జిల్లా పరిషత్ చైర్మన్ గింజుకున్నాడు.

'మాకు ముప్పై ఆరు వేలు పెరిగింది' అన్నాడు కార్పొరేషన్ మేయర్.

'పదిహేడు వేలు పెరిగింది...నెలకి' డిప్యూటీ మేయర్‌కు ఏడుపొకటే తక్కువ.

'మాది ఏడు వేల ఏడొందల యాభై' ముక్కు చీదుకున్నాడు జడ్పీటీసి సభ్యుడు.

'అక్కడయితే మాకు ఎనిమిది వేల అయిదొందలెక్కువ వచ్చేది' మండల పరిషత్ అధ్యక్షుడు మండ కొరుక్కున్నాడు.

'మాది నాలుగువేల రెండొందల యాభై' ఎంపీటీసి సభ్యుడు ఎక్కిళ్లు పెట్టాడు.

'అక్కడ అయిదువేలు.. ఇక్కడ వెయ్యా పదేనొందలే' సర్పంచులు సర్వాల్లా లేచారు.

కార్పొరేటర్లూ మున్సిపల్ చైర్మెన్లూ వైస్ చైర్మన్లూ కౌన్సిలర్లూ వార్డు మెంబర్లూ ఎవరి ఏడుపు వాళ్ళు ఏడ్చారు.

'తెలంగాణ స్థానిక ప్రజా ప్రతినిధులు చేసుకున్న అదృష్టమేమిటి? మనం చేసుకున్న దురదృష్టమేమిటి?' అందరిదీ ఒకే మాట. 'గౌరవ వేతనాలు మనకొద్దా?' అందరిదీ అదే బాట.

'మనం ఉద్యమించడానికి లేదు, పోనీ రాజీనామాలు చేస్తే' మాట పూర్తి కాకుండానే ఆ మనిషిని అవతల కీడ్చేసారు.

'అన్ని రాష్ట్రాలకన్నా ముందుంటాం...ముందుంటాం అంటారు కదా...మరి జీతాల్లోనూ ముందుండాలి కదా?' గుంపులో గోవిందయ్యలా అన్నారెవరో.

'జీతాలివ్వడానికే డబ్బుల్లేవంటున్నాడే?!' గొణుగుడు.

'ఉద్యోగస్తులకి అక్కడ ఫార్టీ త్రీ పర్సెంటు ఫిట్‌మెంటు ఇస్తే ఇక్కడా ఇచ్చారు కదేటి?' సణుగుడు

'ప్రభుత్వ పథకాలు ప్రజల్లోకి తీసికెళ్ళేదే మనం' ఉస్సురుమన్నాడో ప్రతినిధి.

'రాష్ట్ర ఆర్థిక పరిస్థితి రీత్యా ఎవరి జీతాలు వారే సంపాదించు కోవాలి' గుర్తుచేసిందో గొంతు.

'ఇప్పటి వరకూ చేస్తున్నదదే కదా?' అనేసి, నాలుక్కరుచుకొని 'లేకపోతే ఈ జీతాలతోనా మనం ఇంతలా రాణించింది?' చిర్రెత్తుకొచ్చినా తమాయించుకున్నాడో అనుభవశాలి.

'సరే, నిరసనకి లేదు, నిరాహారదీక్షకి లేదు, రైలు రోకోకి లేదు, రాస్తారోకోకి లేదు, అసెంబ్లీ ముట్టడికి లేదు, అడగడానికి లేదు మరి మనకి దారేముంది?' తలలు పట్టుకొని జుట్టు పీక్కున్నారు.

'సాటి తెలుగు స్థానిక ప్రజా ప్రతినిధుల దగ్గర ఎంతవమానం. ఎంతవమానం. బాబుకి పట్టదా?' బాధపడ్డ ప్రతినిధిని 'లేదు. జీతాలు పెంచినా- ఆ క్రెడిట్ కేసీఆర్‌కే దక్కుతుంది. మొన్న ఏపీ ఎంప్లాయిస్ కేసీఆర్‌కే ధన్యవాదాలూ కృతజ్ఞతలూ అన్నీ చెప్పారని బాబు గారు బాగా ఫీలయ్యారు. అంచేత మనకా అవకాశమే లేదు' అసలు సంగతి కుండ బద్దలు కొట్టినట్టు చెప్పాడో వృద్ధ ప్రతినిధి.

ఆఖరికి స్థానిక ప్రజాప్రతినిధులంతా ఒక నిర్ణయానికి, తీర్మానానికీ వచ్చారట

'ఏపీని తెలంగాణలో కలిపెయ్యాలి' అని.

## పబ్లిక్ డిమాండ్

ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీ సమావేశాలు వాడీ వేడిగా జరుగుతూ ఉన్నాయి. టీవీ ఛానెళ్ళలో 'లైవ్' ప్రసారాలు పోటీపడి ప్రసారం చేస్తున్నారు.

'అసెంబ్లీ ముట్టడి' అంటూ జనం గగ్గోలు పెడుతూ ముందుకొచ్చారు.

'అంగన్‌వాడీ వాళ్ళని ఎక్కడికక్కడ ఇళ్ళలోనూ ఆఫీసుల్లోనూ రోడ్డు మీద అరెస్టు చేసేసాం కదా? లాఠీఛార్జి కూడా చేసామే...వీళ్ళెవరు?' ఇంటలిజెన్స్ వాళ్ళు ఊహించని పరిణామానికి ఉలిక్కిపడ్డారు.

'యస్సీ వర్గీకరణేమో...అయినా క్రిష్ణ మాదిగనీ కార్యకర్తలనీ అరెస్టు చేసేసాం కదా?' పోలీసధికారులకి బోధ పడలేదు.

అలవాటుగా అరెస్టు చెయ్యబోతే జనం అభ్యర్థన పత్రం ఇచ్చారు!

వారి ప్రధాన డిమాండ్లు:

ఒకటి:- అసెంబ్లీ ప్రసారాలను లైవ్ టెలికాస్ట్ చేయరాదు!

రెండు:- అసెంబ్లీ సమావేశాల వార్తా ప్రసారాలకు గాను సెన్సారు బోర్డును ఏర్పాటు చేయాలి!

మూడు:- అసెంబ్లీ సమావేశాలకు 'ఎ' సర్టిఫికెటు ఇచ్చి ప్రసారం చేయాలి!

గమనిక:- అర్ధరాత్రి ప్రసారాలకు అభ్యంతరం లేదు!



# భిల్లు వీరుడు

- ఏంజెలా సోంటక్కే
అనువాదం: బి. అనూరాధ

తాంత్యా భిల్లు పొడుగైన భారీ విగ్రహం కలవాడు. నల్లని దేహం కల మహాకాయుడు. పట్టుకొంటే జారిపోతాడు. అతని శరీరాన్ని తాకితే తుపాకి గుళ్ళైనా సరే జారిపోవాల్సిందే. అతనిది మెరుపు వేగం. అతను చెట్లను మహావేగంగా ఎక్కగలడు. వెదురు పొదలను సైతం అవలీలగా ఎక్కగలడు. అతను మహా ఎత్తులకి ఎగరగలడు. ఒక చెట్టుపై నుండి మరొక చెట్టుపైకి వానరుడి లాగా గెంతగలడు.

అతనికీ విశేష శక్తులన్నీ ఉండటానికి కారణం, అతనొక అరుదైన వెదురు మొలకని తినడమే. చంద్రపూర్ నగరానికి దగ్గర్లోని దట్టమైన తాడోబా అడవిలో ఉన్న తాడోబా సరస్సు మధ్యలో పెరిగిన ఒక అరుదైన వెదురుకూపుల్లో పూసిన 'వెదురు పువ్వు'ని అతను ఆరగించాడు. మామూలు మనుషుల్లో కానరాని ఎన్నో వింత శక్తులని ఆ వెదురు పువ్వు అతనికి ప్రసాదించింది.

ఆ వెదురు పొదని చేరుకోవడానికి దారిలో ఎదురైన ఎన్నో అడ్డంకుల్ని అధిగమించి అతను సరస్సు మధ్యకు చేరుకొన్నాడు. ఆ సరస్సులో తిష్టవేసిన దుష్టశక్తులతోనూ, ప్రాణాంతకమైన మొసళ్ళతోనూ అతను పోరాడాడు. ఆ శక్తులని సాధించడానికి అతను తనను తాను వీరుడిగా నిరూపించుకొన్నాడు.

బ్రిటిష్ రాజ్యం అతనితో పోరాడలేకపోయింది. బ్రిటిష్ రాజ్యం అతన్ని పట్టుకోలేకపోయింది. అతను బ్రిటిష్ రాజ్యంతో పోరాడాడు. అతను పేద ప్రజలను ప్రేమించాడు. పోలీసులు అతనిని 'దొంగ'గా నమోదు చేశారు. ప్రజలకి మాత్రం అతనొక వీరుడు. ఆంగ్లేయ ప్రభుత్వం అతన్ని కాల్చివేసింది.

అతనెలా చనిపోగలడు? అతని శవం ఎన్నడూ దొరకలేదు. వెదురు పువ్వు ఇచ్చిన మాంత్రిక శక్తులు హరించుకుపోవడంతో అతని శరీరం అంతర్ధానమయ్యింది. అతను రెండోసారి ఆ 'మంత్ర పుష్పా'న్ని ఆరగించవలసి ఉంది. అనేక సంవత్సరాల అనంతరం సరస్సు మధ్యలోని వెదురు పొద పుష్పించింది. విశేషరాత్రిలో కేవలం కొన్ని గంటలు మాత్రమే ఆ పుష్పం మనగలుగుతుంది. నిజంగా జ్ఞానులైన వారికి మాత్రమే ఆ 'సరియైన సమయం' గురించి తెలుస్తుంది. గాలి ఆ పుష్ప సౌరభాన్ని మోసుక తిరుగుతుంది. ఆ పరిమళం మాత్రం శత్రువు నాసికల్ని అదరగొట్టింది.

అదొక పున్నమి రాత్రి. ధవళ కాంతులతో తళతళ మెరిసిపోతున్న నీళ్ళలో తమ సోయగాల్ని చూసుకొని తారలు మురిసి పోతున్నాయి. ఆ మంత్ర పుష్పం మీద ప్రకాశించడానికి ప్రత్యేక హక్కులు కలిగి ఉన్న చంద్రుడు మన భిల్లు వీరుడికి దారి చూపుతున్నాడు.

పోలీసులు కూడా ఎదురుచూస్తున్నారు. ఒక అందమైన వస్త్రం మీద మాసికలాగా అగుపిస్తున్నారు వాళ్ళు. ఒక తెల్లని సౌందర్య రాశి బుగ్గమీద చిన్న నల్లటి పుట్టుమచ్చలా ఉన్నాడు మన మహా వీరుడు!

ప్రకృతి వర్ణ చిత్రాన్ని అలంకరిస్తూ....

అతను వచ్చాడు...!!! ఆకులు గలగలమన్నాయి. ఊపిరి బిగబట్టారు పోలీసులు. ఊపిరి వదిలిన సవ్వడి సైతం మన మహావీరుడిని అప్రమత్తం చేయగలదు మరి.

ఒక అద్భుత క్రీడాకారుడిలా...

అతను వచ్చాడు.

మెరుపులా కదులుతూ అతడు ఒడ్డు వరకూ చేరుకొన్నాడు. అతని ప్రతి కండరమూ బిగుసుకొంది. అతని ప్రతి కండరమూ ఉప్పొంగింది. అతని ప్రతి కండరమూ యుద్ధానికి సన్నద్ధమైంది. అతను దూకబోతున్నాడు...!!

అతని నల్లని అందమైన శరీరం తళతళ మెరిసింది. అతని శత్రువుకి అతని ఉనికి తెలిసిపోయింది.

తాంతియాని రక్షించేందుకు మబ్బులను చాటు చేసుకొందామని విశ్వప్రయత్నం చేశాడు చంద్రుడు. మబ్బులు వేగాతి వేగంగా చంద్రుడి వైపు పరిగెట్టాయి. మబ్బులని వేగంగా పరిగెత్తమని ఉసిగొల్పుతూ గాలి తీవ్రాతి తీవ్రంగా వీచింది.

అందరూ సంఘటితంగా ప్రయత్నిస్తున్నారు.

అందరూ ఒక అనుసంధానంలో ఉండి పనిచేస్తున్నారు. ఒకే ఒక్క సెకను వారు వెనుకబడ్డారు. అంధకారం అలుముకొనే లోపు మనిషి కనిపెట్టిన ఇరవై నాలుగు దిక్కులా తుపాకులు గర్జించాయి.

అతను దూకడానికి ఎగురుతూ గాలిలో ఉన్నాడు. అతను అలాగే అదృశ్యమైపోయాడు!!! ఎప్పటికీ!!!

అతని బాల్య స్నేహితులు ఒక గాఢ సుషుప్తి నుంచి ఉలిక్కిపడి లేచారు. పక్షులు దెబ్బతిన్నట్టు రెక్కలల్లార్చాయి. వేళ్ళు మెడలు సాచి ఆ శబ్దాలకి దూరంగా పరుగెట్టాయి. తమకన్నా శక్తివంతమైన వారిని అప్రమత్తం చేసేందుకు. నక్కలు ఊళ వేశాయి, పులులు గర్జించాయి! ఎలుగులు గొంతెత్తి అరిచాయి.

ఒడ్డున ఉన్న చెట్ల కొమ్మలు వంగాయి, అతని నుదుటిని స్పృశించడానికి. ఆ వనాలలోని దేవుళ్ళు, దేవతలు అతని శరీరాన్ని మోయడానికి చెట్లు దిగి వచ్చారు. అతను వాళ్ళతో వెళ్ళిపోయాడు. అతను వాళ్ళతో ఉండిపోయాడు. ఒక చెట్టు అతనికి ఆవాసమయ్యింది. ఒక సింహాసనమయ్యింది. అతను కూడా ఎక్కడో ఉంటాడు. అందరి దేవుళ్ళలాగే.

ఆ చెట్టు ఉనికి ఒక రహస్యం. తెలిస్తే బ్రిటిష్ రాజ్యం ఆ పవిత్రమైన చెట్టుని కూడా ఉండనివ్వదు. కేవలం ఎంపిక చేసిన కొంత మందికే ఆ రహస్యం తెలుసు. తాంతియా ఉనికిని గురించిన రహస్యం అలా ఒకరినించి ఒకరికి తరతరాలుగా రహస్యాలు కాపాడగలిగిన దృఢమైన వారి చెవులకి మాత్రమే రహస్యంగా చేరింది. రహస్యాన్ని చావుతో పాటు కాటికి మోసుకుపోగలిగిన దృఢమైన వారికి!! రహస్యాల కోసం బజారులో అమ్ముడు పోని వారికి!!!

శత్రువుకు అతని శవం జాడ కావాలి. దానిని నాశనం చేయాలి. అతనికి ఆపాదిస్తున్న గొప్పతనాన్ని ధ్వంసం చేయాలి. వాళ్ళు రోజుల

కథ

# ఉత్తమ ఉపాధ్యాయుడు

- పి. వీరబ్రహ్మచారి

'హా...య్! తాతాయ్...' పేపరందుకొని మధ్య హాల్‌లోని కురికింది వాణి.

"ఏందే?! ఏంది? అంత సంబరం" ముందు గదిలో నుండి ఉరికి గెంతుతూ వచ్చిన మనవరాలివైపు తలెత్తి చూసింది కూరగాయలు కోస్తున్న సరస్వతమ్మ.

"జెర మొస దీస్కోని చెప్పు".

"తాతయ్య జిల్లా ఉత్తమ ఉపాధ్యాయుడిగా ఎంపికయ్యిండు. ఎల్లుండి టీచర్స్‌డే నాడు కలెక్టర్ చేతుల మీదుగా అవార్డిస్తరట." విషయం చెప్పి పేపర్లో నుండి తల తిప్పి నానమ్మ దిక్కు చూసింది. అది వరకే తలదించి తన పని చేసుకుంటున్న నానమ్మ తీరును గమనించీ గమనించనట్లు "అమ్మా అమ్ మ్మా' అంటూ వంటింట్లోని కురికింది.

స్నానం ముగించి లుంగీ చుట్టుకొని ఇంటి వెనకనుండి వస్తున్న సదాశివరావుకు వాణి చెబుతున్న మాటలు చెవిన బడ్డాయి. కించిత్ గర్వంగా మధ్య హాల్‌లోనికి ప్రవేశిస్తూ కూరగాయలు కోస్తున్న భార్యవైపు ఓరకంట చూస్తూ పడగ్గదిలోనికి వెళ్ళాడు. దుస్తులు వేసుకొని వచ్చి ముందు గదిలోనికి వెళుతూ, "వాణీ కాఫీ తీస్కరావే" అని కేకవేసి టీపాయ్ వద్ద కుర్చీలో కూచున్నాడు.

"నాన్నా! కాఫీ అదో మీముందే ఉంది" తండ్రికి చెబుతూ ఆదరాబాదరాగా డ్యూటీకి బయల్దేరాడు సశిరా కొడుకు.

టీపాయ్ మీదున్న కాఫీ కప్పు వైపు చూస్తూ "ఎప్పుడో చేసి అక్కడ పెట్టి పని అయ్యిందనిపించుకున్నది" అనుకుంటూ అందుకున్నాడు.

'తనకంతగా సంతోషాన్నీ ఆశ్చర్యాన్నీ కల్గించిన వార్త నాన్నమ్మ నేమాత్రం కదిలించక పోగా, అమ్మా నాన్నలు కూడా మొక్కుబడిగానే సంతోషించారెందుకబ్బా' అనుకుంటూ మళ్ళీ నాన్నమ్మ వద్దకు చేరింది వాణి.

తలెత్తకుండానే మనవరాలిని గమనించిన సరస్వతమ్మ "తర్వాత దినమంతా సంతోష సరస్సులో ఈదులాడుదువుగాని స్కూల్ టైం ఐతుంది. స్నానాల గదిలోనికెళ్ళి జెల్ది తడువు. నీ తర్వాత నేనూ" అంటూ కూరగాయల కోసం ఎడం పక్కనున్న చేటలోకి చేయి సాచింది.

భుజం మీదున్న కండువాను మెడచుట్టూ తిప్పి మెడల వరకున్న కురులను సవరించుకుంటూ అసహనంగా గబుక్కున లేచి చెప్పులు తొడుకున్నాడు సశిరా.

"హహ్ హ్హహ్హ నానమ్మా.. చేట ఖాళీ" ఎడం చేత్తో చేటను తడుముతున్న నానమ్మ పరధ్యానంలో ఉందని గమనించి పరాచికమాడింది వాణి.

"సరేలే, స్నానానికి నడవమన్నానా?" మనవరాలికి తన స్థితి తెలిసిపోయిందని గారాభంగా కోపగించుకుంటూ, 'ఔను వార్త విన్నాక తన మనసు మనసులో లేదు. గిట్లాటోళ్ళే ఉత్తమ ఉపాధ్యాయులైతే ఉత్తమ ఉపాధ్యాయులు కానోళ్ళెవరు? చాలా మందే ఉత్తమోత్తమ ఉపాధ్యాయులు కావాలి మరి' అనుకుంటూ కోడలికి కోసిన కూరగాయాలనందించింది.

"మామయ్యా టిఫిన్ చేయరా!" మెట్లు దిగుతున్న సశిరాను చూస్తూ.

"ఘర్కా ముర్గీకంటే కమ్మనైన గడ్డి ఆయనకు మస్తుగనే దొర్కుతది లేమ్మా" బండి తీస్తున్న సశిరాకు కోడలు, భార్య మాటలు విన్పిస్తుండగా వీలైనంత తొందరగా బైటపడాలని బండి స్టార్ట్ చేశాడు.

* * *

భుజానికి కణతకి నడుమగల ఫోన్ ద్వారా అభినందనల నందుకుంటూ ఒయ్యారాలు బోతున్న సశిరా బండి గేటు దాటుతున్న చప్పుడు విని, చెట్టుకింద ఆడుకుంటున్న పిల్లలు 'గుడ్ మార్నింగ్ సార్' మర్యాదకంటే అట్లా ఆంగ్లంలో చెప్పగల తమ నైపుణ్యానికి మురిసిపోయారు.

---

తరబడి, నెలల తరబడి ఆ సరస్సులోని ప్రతి బిందువునూ గాలించారు. ప్రతి నాచు మొక్కనీ పీకారు. ప్రతి చెట్టూ కంపించింది. కానీ రక్తం చుక్క కూడా కనబడలేదు.

సరస్సు మధ్యనున్న వెదురు పొద ఇంకెప్పుడూ కనిపించలేదు. అది అంతర్థానమైపోయింది - నిరసనగా!!

బ్రిటిష్ వాళ్ళు ఆ పొదని తామే నరికేశామని గొప్పలు పోయారు. వాళ్ళని ఎవ్వరూ నమ్మలేదు. వారు ఆ 'మాయ'ని బద్దలు కొట్టాలనుకొన్నారు. ఘోరంగా విఫలమయ్యారు.

ఇప్పటికీ ఆ రహస్య చెట్టు మీద... కథల్లోనూ... తాంతియా భిల్లు మాత్రం సజీవంగానే ఉన్నాడు.

(కళ్ళు పెద్దవి చేస్కుని ఇలాంటి కథల కోసం అర్రులు సాచే బాల్యంలో మా తాతయ్య నాకీ కథ చెప్పాడు. ఆ కథ నా జ్ఞాపకాల్లో ఇంకా తాజాగా ఉన్న కాలంలోనే దీనిని నేను రికార్డు చేయనందుకు చింతిస్తున్నాను. ఇంకా ఈ కథకి సంబంధించిన ఎన్నో ముఖ్యమైన వివరాలు మరుగుపడిపోయి ఉండొచ్చు. చరిత్రలో ఈ వీరుని గురించిన వివరాలను పరిశోధించే అవకాశం నాకు దొరకలేదు.

మౌఖిక సాంప్రదాయ తరానికి వారుసుడిగా మా తాత ఈ కథని లిఖిత సాంప్రదాయ తరానికి అందించి తన కర్తవ్యాన్ని నెరవేర్చాడు. నా వంతు బాధ్యతగా లిఖిత సాంప్రదాయం తరపున ఈ కథని - 'అంతర్జాల తరానికి' (ఆన్‌లైన్ జనరేషన్) అందిస్తున్నాను. - రచయిత)

(రచయిత ఏంజెలా సోంటక్కే ముంబయిలోని జిల్లా మహిళా జైలు - బైకులాలో మావోయిస్టు రాజకీయ ఖైదిగా 5 ఏళ్ళ నుండి ఉన్నారు.)



ఎడంచేయి పైకెత్తి అంతే మురిపెంగా పిల్లల విషస్ స్వీకరిస్తూ చెట్టు కింద బండి పార్క్ చేసి వరండా ముందుగల వేదిక గద్దె నెక్కుతుండగా ఇంటర్‌వెల్ గంట మోగింది.

వరండాలోనున్న ఇద్దరు పాధ్యాయులు తరగతుల నుండి బైటకు వచ్చిన ముగ్గురు మేడమ్‌లు మరో విద్యా వలంటీర్, అందరూ, 'కంగ్రాచులేషన్స్' చెబుతూ విష్ చేస్తుండగా ఎత్తిన ఎడంచేయి దించకుండా తలవంచి, ఇంకో ముఖం ఏదన్నట్లు వల్లబారిన తన ఫోటోసన్ కళ్ళద్దాల గుండా ఆరవ తరగతి గదివైపు చూస్తూ ఆఫీసు రూంలోనికి నడిచాడు. సశిరా.

వెంటే అనుసరించిన ఉపాధ్యాయబృందం. అక్కడక్కడున్న కుర్చీలను పిల్లలు తెస్తుండగా ప్రధానోపాధ్యాయుని చుట్టూ బైఠాయించారు. అటెండర్ సమ్మయ్య చాయ్‌లకు బైటకెళ్ళాడు. ఇంటర్‌వెల్ సమయం ముగుస్తుండగా పిల్లల్ను బైటకు వదిలి తరగతి గది నుండి బైటకు వచ్చిన ఉప్పలయ్య తను పూర్తి చేసిన ఆరవ తరగతి సీసీఈ రిపోర్ట్‌ను ప్రధానోపాధ్యాయుని ముందుంచాడు. 'కూచోండ'ని సహోపాధ్యాయులు మొహమాట పెడుతుండగా 'ఫరవాలేదు' అంటూ బైటపడ్డాడు. తిరిగొచ్చిన సమ్మయ్యను, 'ఇంటర్‌వెల్ సమయం ఐపోయినట్లుంది' గంటకొట్టమన్నట్లు ఉప్పలయ్య గుర్తు చేశాడు. గబగబా చాయ్ తాగి ఆఫీస్ రూం ర్యాక్‌లో పుస్తకాలందుకొని నడుస్తుండగా చాయ్ పోయడం పూర్తయినాక సమ్మయ్య గంటమోగించాడు. ఉప్పలయ్య వైఖరి ఒకరిద్దర్కి ఒకందుకు బాగుందనిపిస్తుండగా ప్రధానోపాధ్యాయుని ముఖంలోనికి పరిశీలనగా చూపులు మరల్చారు.

"జయ జయహే తెలం..." ఫోన్ మోగడంలో 'హలో' అంటూ అటెండెన్స్ రిజిస్టర్ తెరుస్తూ, 'నమస్తే సర్, థేంక్యూ సర్ థేంక్యూ థేంక్యూ' అభినందనలకు స్పందిస్తూ తను రాని నాల్గు రోజుల్లో సంతకాలు పూర్తి చేశాడు సశిరా. ఫోన్ పెట్టేసి ఎమ్మీవో ఫోన్ చేసిండు. సీసీఈ రిపోర్ట్‌లు రేపటి వరకు పూర్తి చేసి నా సంతకాలు తీస్కోండి సార్' అసిస్టెంట్లను ఆదేశించాడు. వాళ్లు 'మంచిది సార్' అంటూ అందరూ తరగతి గదులకు కదిలారు.

* * *

క్రితం రోజు బహుమతినందుకొని వచ్చిన సశిరా ముందు గదిలో కూచోని తను ఏరి కోరి వేయించుకొన్న జిల్లా స్పెషల్‌లోని ఫొటోలవైపు చూస్తుండగా, పక్కన ఫిలిప్ బహదూర్ రేడియో నుంచుకొని నడుమ గదిలోనున్న సరస్వతమ్మ 'చదువు రాని వాడవనీ దిగులు చెందకూ' పాట వినబడి సౌండ్ పెంచింది.

"నానమ్మా 'విద్యలేని వాడు వింత పశువు' అనిగదా తరగతి గదిలో రాసి ఉంది. మరి ఈ పాటేంది ఇట్లా. పైగా ఈ పాటంటే నీకెందుకంత ఇష్టం!?" అని వాణి అడిగింది.

"అన్ని సామెతలు అన్ని స్థలకాలాల్లో వర్తించవు నాన్నా..." సౌండ్ బాగా తగ్గించి, "చదువు నేర్వడమే కాదు, పాండిత్యం నేర్చిన పశువులూ ఉంటయ్" బిగ్గరగా కసిగా అన్నది.

ఆ తర్వాత "మంచిగ కూచోని పాట మొత్తం విను" మునిగాళ్ళమీద కూచున్న వాణిని సరిగ్గా కూచోబెట్టి సౌండ్ మళ్ళీ పెంచింది.

టీ పాయ్ మీద టప్‌మన్న పేపర్ చప్పుడు విని అటు చూసిన వాణికి లేచిన సశిరా కన్పించాడు. తల తిప్పి నాన్నమ్మ ముఖంలోనికి చూసింది. 'ఎందుకు నానమ్మ తాతయ్య మాట్లాడుకోరు? ఎన్నడూ కొట్లాడుకోగా చూళ్ళేదు...' ఎన్నోసార్లు అనుకున్నదే మళ్ళా అనుకున్నది. 'ఈ రోజు తప్పకుండా నాన్నమ్మను అడుగుత' గట్టిగా అనుకున్నది. బయట సశిరా నిష్క్రమిస్తున్న చెప్పుల చప్పుడు విన్పించింది.

* * *

చాలా దినాల తర్వాత ప్రార్థనా సమావేశంలో ఉప్పలయ్య సార్ విద్యా వలంటీర్‌తో పాటు పెద్ద సార్ ఉండడాన్ని ఆశ్చర్యంగా చూస్తున్నారు పిల్లలు. ఉప్పలయ్య కాషన్స్ ఇచ్చి ప్రేయర్ విజిల్ ఇవ్వబోతుండగా గేటు వద్ద కన్పించిన లేడీ టీచర్‌ను చూసి ఆగి, ఆవిడ వేదిక మీదకు రాగానే విజిల్ ఇచ్చాడు.

రాని ఉపాధ్యాయుల తరగతుల పిల్లలను ఆఫీసులో కూచో బెట్టుకొని అన్యమనస్కంగా ఉన్నాడు సశిరా. రెండవ పీరియడ్ గంట మోగుతుండగా ఒకరు ఆ తర్వాత పది నిమిషాలకు మరొకరు, అట్లా ఒక్కొక్కరుగా మిగిలిన వాళ్ళందరూ వచ్చారు. 'ఇంతా తొందరగా నచ్చారేమబ్బా ఇవ్వాళ పెద్దసార్!' ఆశ్చర్యపోతూ, 'సారీ సార్ ఆటో లేటయ్యింది', 'బండి ట్రబులిచ్చింది', తలా ఓ కారణాన్ని అడగకుండానే అప్పగించారు.

"ఈ రోజు సీసీఈ రిపోర్ట్‌లు సిద్ధ గావాలె సార్" పెద్ద సార్ స్వరంలోని గారవపు నిష్టురానికి "మంచిది సార్" వినయాన్ని నటిస్తూ తరగతులకు కదిలారు.

* * *

వరండాలో వేదిక మీద పిల్లల్ను కూచోబెట్టుకొని వాళ్ళ బాధ్యతను క్లాస్ లీడర్లకు అప్పగించి కంటిన్యువస్ క్యుములేటివ్ ఎవాల్యుయేషన్‌తో తలమున్కలవుతున్న ఉపాధ్యాయులు బండి శబ్దం విని తలెత్తి చూసి నిలబడ్డారు. బండి పార్క్ చేసి వస్తున్న ఇద్దరికీ 'నమస్తే సార్' అంటూ కొద్దిగా వంగారు.

సార్ల కదలికలు గమనిస్తూ 'పెద్ద సార్‌కే పెద్ద సార్ లెక్కున్న రెవరో' అనుకుంటూ "గూడ్ మార్నింగ్ సార్" గట్టిగా దీర్ఘం తీశారు పిల్లలు.

'మార్నింగ్.. మార్నింగ్ కూచోండి' ఇది మాత్రం బాగానే ఉంటది అన్న అసహనాన్ని పసిగట్టి వచ్చిన సార్లను నిశ్శబ్దంగా చూస్తూ కూచున్నరు. 'ఆ చల్లని సముద్రగర్భం దాచిన బడ బానలమెంతో...' శ్రావ్యంగా విన్పిస్తున్న స్వరం వైపు దృష్టి మళ్ళించి ఏడవ తరగతిలో పాఠం చెబుతున్న సార్ బోధించడంలో లీనమైన తీరుకు ఒకింత ఆశ్చర్యపోయారు ఎమ్మీఓ. అంతలోనే 'నా రాకను లెక్క చేస్తలేడు దేశాన్నంతా ఈయనే ఉద్ధరించేటట్లు ఉన్నడు...' దర్వాజా కెదురుగా బ్లాక్‌బోర్డ్ వద్ద నిలబడి పాఠం చెబుతున్న ఉప్పలయ్యను చూస్తూ అనుకున్నాడు సహనంగా.

తనూ చూడనట్లే ఉండాలె అనుకొని తామెంత మర్యాదస్తులమో అనిపించేటట్లు తనవైపు చూస్తున్న సార్లతో "పెద్దసార్ లేడా" అన్నాడు ఎమ్మీఓ. "ఉన్నడు సార్ ఇంతకు ముందే ఎటో పోయినట్లున్నడు" అసిస్టెంట్ సర్దుతుండగా "టటల్ దనమ్మింట్లున్నడు సార్. లంచ్ బెల్ అప్పుడు బైటకు పోయినప్పుడు కన్పిచ్చిండు" ముందు వరుసలోని అబ్బాయి అందించాడు. "ఏయ్ నిన్నెవడడ్గిండురా" కసురుకున్నాడో అసిస్టెంట్. వెంటనే "పో పిల్సుకరాపో ఎమ్మీఓ సారొచ్చిండు" అని చెప్పు అని ఆదేశించాడు. మహాభాగ్యం అన్నట్లుగా పరుగు పందెంలోలాగా వెళ్ళాడు వాడు.

'నమస్తే సార్' బండి మీదుండే గేట్ దాటుతూ పలకరించాడు సశిరా. బండి స్టాండ్ వేసి సమీపిస్తూ "గింతకు ముందే ఒక పేషెంట్‌ను కలుద్దమని పోయిన "ఎంత సేపైంది సార్ ఒచ్చి".

"మీరే అన్నరుగద గింతకుముందే వెళ్ళానని. మీరటు నేనిటు అంతే".

"సమ్మయ్యా బిస్కెట్లు చాయ్‌లు తీస్కరా" ఆజ్ఞాపించాడు సశిరా.

"అవన్నీ ఐనయ్ గాని సీసీఈ రిపోర్ట్‌లు తయారైతే ఇవ్వండి" అంటూ సూటిగా చూసిన చూపులకు ఇబ్బంది పడుతుండగా, 'జయ జయహే...' ఫోన్ ఆన్ చేసి, 'హలో హలో హ...లో' అంటూ పైకి లేచాడు సశిరా. దూరంగా అడుగులేస్తూ 'నమస్తే - చెప్పండి - మంచిది. అది నాకు మీరిచ్చే గౌరవప్రదమైన అవకాశం. తప్పకుండా - అదిరిపోయేటట్లు చేదం - ఏందీ - మండలాఫీసుకాడనా - ఐదు గంటలకా - మంచిది. ఇగో మా ఎమ్మీఓ సాబ్ - ఇక్కడే ఉన్నడు. మాట్లాడ్తరా - ఇగో ఇస్తున్న'.

'ఇదో తెల్వి. నన్ను సల్లబర్చే తెల్వి' అనుకుంటూ ఫోన్ అందుకున్నాడు ఎమ్మీఓ.

ఎమ్మీఓ మాట్లాడి అందించిన ఫోన్ అందుకుంటూ అసిస్టెంట్లవైపు తిరిగి "ఏం సార్ రెడీ ఐనయా సంతకాలు చెయ్యాల్నా" అసహనాధికారం ఒలికించాడు సశిరా.

"సర్ సర్ ఇయ్యాళ ఎంత పొద్దయినా చేసే కదుల్తం" అని ఎమ్మీఓ వైపు తిరిగి.

"రేపు ఉదయం మేమే వచ్చి మీ ఆఫీసులో అందజేస్తం సార్" ఆలస్యానికి తప్పంతా తమదే అన్నట్లుగా లేచి మరింత వంగి బాధ్యతను భుజానికెత్తుకున్నడు యూనియన్ లీడరైన ఓ అసిస్టెంట్.

ఈ రోజు కావని నిర్ధారించుకున్నాక కక్కలేక మింగలేక పుల్లని తేన్పు వచ్చిన మొహంతో లేచాడు ఎమ్మీఓ. "మీ ఒక్కరిదే మిగిలింది. లేటుకు నేను దొబ్బులవడాలె" అంటూ కదిలాడు.

'అన్నార్తులు అనాథలుండని... అదెంత దూరమో - కాలాలెపుడో - లావా ఎంతో - భవితవ్యం ఎంతో - కావ్యాలెన్నో. ఈ విధంగా పాట పాదాల చివర మో-డో-తో-న్నో అనే ఒక విధమైన అచ్చు ధ్వనులు రావడం గేయంలో కవిత్వంలో ఒక రకమైన అందం అలంకారం. ఇటువంటి అలంకారాలు చాలా ఉంటయ్ సాహిత్యంలో...' ఏడో తరగతిలో ఉప్పలయ్య బోధన విన పడుతుండగా, ఇటువంటి సార్లుండ వట్టే బళ్ళున్నయ్. పంతుళ్ళ నౌకర్లున్నయ్' మనసులోని మాటను బైటకు తనకు అనే అనుకున్నట్లుంటూ ఎమ్మీఓ ఎమ్మార్వీతో కలిసి.

సాయంత్రం ఐదు గంటలకన్న జెడ్‌సీటీసి 6-30 గంటలకు వచ్చాడు పరివారంతో కలిసి. వచ్చినవారి వెంట బార్‌లోనికి చొరబడ్డారు సశిరా, ఎమ్మీఓలు.

టేబుల్ చుట్టూ కుర్చీల్లో సర్దుకున్న తర్వాత కొత్త ఏయీని అందర్కీ పరిచయం చేశాడు. అంతలో ఎమ్మీపీ వచ్చాడు. అందరూ లేచి నిలబడి అతను కూచున్నక 'చెప్పండి ఏయీ సాబ్ ఈయాల మా కొత్త అతిథి మీరు మీదే చాయిస్' ఎమ్మీపీ.

'సార్ కొత్త గద సిగ్గుపడతాండు. పెద్ద సార్ ఇయ్యాల మీ ఇష్టం మీద కానిద్దాం. మీ మనసు పూర సంతృప్తి చెందితేనే మంచి పాటొస్తది. రెండోసారి గూడ మంచి మెజార్టితోనే గెల్సిండు, ఎమ్మెల్యే సాబ్. అందుట్ల మన కొత్త రాష్ట్రం. మన ఎమ్మెల్యే సాబ్‌కు మినిస్టర్ బెర్త్ గ్యారంటీ.'

మీకు రాష్ట్ర ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్యారంటీ జెడ్‌పీటీసీ మాటకు స్థానిక సర్పంచ్ జోడించాడు.

"విజయోత్సవ సభ అదిరిపోవాలె. ఆంకరింగ్ నిర్వహణ అంత మీ బాధ్యతే, మా పెద్దసార్ సదాశివరావుసార్ మంచి మంచి పాటలు రాస్తడు. సార్ పాటలన్నీ పేద జనం పీడిత జనం పాటలే. ఏ ఉద్యమ వేదికయినా అందుల సార్ పాట ఒకటి తప్పకుండ ఇన్పిస్తది." అంటూ ఏయీకి పరిచయం చేశాడు ప్రెసిడెంట్.

రాత్రి సుమారు పన్నెండు గంటలకు తలుపు చప్పుడు విని, తలుపు తీయడానికి వెళుతున్న కోడలితో, "లలితా నువు లోపలికెళ్ళు" ఆజ్ఞాపించింది మధ్య హాల్‌లో పడుకున్న సరస్వతమ్మ.

అత్త కంఠంలోని కటువుకు చేసేది లేక వెళ్ళి పడుకున్నది లలిత.

నాన్నమ్మా పక్కలో మరింత దగ్గరకు జరిగి, "తాతయ్య నీ-వు-ఎండ్‌కు మాట్లాడుకోరు" కాలు చేయి నాన్నమ్మ మీద వేస్తూ మగతలో గారాలు పోయింది వాణి.

"ఉదయం చెబుతాలే, పడుకో" అంతే గారాభంగా ఆజ్ఞాపించింది.

తలుపు తట్టి తట్టి ఇక లాభం లేదని గ్రహించిన సశిరా "తమ్మీ నేను బండి తోలేటట్లు లేను. జెర మర్రిపల్లిం ఇడ్సిపెట్టిరావా" ముద్ద ముద్దగా తోడొచ్చిన ప్రెసిడెంట్ పంపిన మనిషితో అన్నడు.

"గీరాత్రి గాడ్కి వోయి యాదవండుతదు - బల్లెనా" అనుకుంటూ ప్రెసిడెంట్ బాస్‌కు ఫోన్ చేశాడు పర్మిషన్ కోసం.

"సరే పో... ఇగో రమేశ్‌గాన్ని గుడదీస్కబో. ఆయన్ను నద్మేసుకొని తీస్కపోండి. ఆరు కిలోమీటర్లే గద, అడో సిన్నిల్లుంటది పడగొట్టిరాండి".

"పున్నేన్కొస్తె ఫినాయిలయినా పుల్లుగ బోస్తరు పంతుల్లు' విసుక్కుంటూ 'సరే ఎక్కుండి" అంటూ బండి స్టార్ట్ చేశాడు తోడు మనిషి.

* * *

"రాజన్నకివే మా రంగవల్లుల స్వాగతం
రంగులలరు గులాబీల తోరణాల స్వాగతం ॥
తెలంగాణ దివిటీతో వచ్చెనే రాజన్న తొలిసారి
వెలిగించే ఉద్యమ దివిటీలు వేలాది
మన రాష్ట్రం మనకాయె ఆడండి జేకొట్టి
పేదోల్ల పాలిట పెన్నిధే రాజన్న - వలస దొరల గుండెలదిరెనే
అన్నన్న..."

రెండోసారి గెలిచిన ఎమ్మెల్యే విజయోత్సవ సభలో సశిరా ప్రజల్ను పరవశింప జేస్తున్నడు.

* * *

" 'మర్రిపల్లి పౌరులు' చివరకు ఉగాని లకారం వచ్చే ఉపదబంధం వెతకండి."

"మల్లెపూలు" ఒకమ్మాయి అందించింది.

"గుడ్. ఐతే మంచి మల్లెపూవులూ అందం మరింత అందంగా ఉంటది". బడిలో ఏడవ తరగతిలో పిల్లల భాగస్వామ్యంతో పాట రాయిస్తున్నాడు ఉప్పలయ్య. కల్ల కపటమెరుగనీ / చెవెటోడ్చే జీవులు.

"బతుకూ బతికించమనే" ఇపుడేమందాం.

"స్వయం పోషకాలు వాళ్లు" మరొకడందించాడు.

"హాయ్! వెరీ గుడ్".

"మర్రిపల్లి పిల్లలూ" – మిమ్మల్నేమందాం చెప్పండి".

"సన్న జాజిమల్లెలూ" అందించాడు లావుగానున్న మొదటి అబ్బాయి.

"అబ్బో ఎంత సన్నగున్నడురా వీడు" పిల్లలంతా ఘొల్లుమన్నరు. ఐనా బాగా చెప్పాడు ఫైన్ చక్కగా సరిపోయింది.

* * *

సభానంతరం మామూలుగానే మందు విందులలో మునిగి మర్రిపల్లికి బైల్దేరాడు సశిరా.

* * *

"బాలోత్సవ్ సందర్భంగా డివిజన్ కేంద్రంలో టీచర్స్ యూనియన్ రాష్ట్ర ఉపాధ్యక్షుడు రాష్ట్ర ఉత్తమ ఉపాధ్యాయ గ్రహీత సశిరా, అదే పాఠశాల నుండి రాష్ట్ర ఉత్తమ ఉపాధ్యాయ అవార్డుకు ఎంపికైన కిరణ్‌కుమార్‌గార్లకు సన్మానం" పేపర్‌లోని వార్త బిగ్గరగా చదువుతూ "వార్త చూసినవా నానమ్మా" ముందు గదిలో నుండే కేక వేసింది, వాణి.

"ఆఁ... ఆఁ... చూసినగాని ఇట్రా.."

"చెప్పు" వచ్చి ముందు నిలబడింది.

"మనం పోదామా"

"నిజంగానేనా నానమ్మా!" ఊహించని మాటతో ఆశ్చర్యంగా.

"ఆశ్చర్యపోవల్సిందేమీ లేదు. అప్పుడంటే జిల్లా స్థాయి అవార్డే గద అని పట్టించుకోలేదంతే. తాతయ్య రాష్ట్రస్థాయి ఉత్తమ ఉపాధ్యాయుడిపుడు. మనమూ మన వంతు సన్మానం చెయ్యాలి"

"చెప్పు ఏం చేద్దాం" అన్నట్లు పూర్తిగా ఆశ్చర్యం నుండి కోలుకోని వాణిని చేయి బట్టి దగ్గకు తీసుకుంటూ, "నీవో పనిచేస్తావా నాన్నా" గారాబం చేసింది సరస్వతమ్మ.

"నువ్వేం చేయమన్నా చేస్త".

* * *

నవంబర్ 14 రోజున..

'ఆ చిన్న పాఠశాల నుండి ఇరువురు రాష్ట్ర ఉత్తమ ఉపాధ్యాయగ్రహీతలు. ఒకరు ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయులు అనేక ప్రజా పాటల రచయిత సదాశివరావు. మరొకరు తన విజ్ఞానశాస్త్ర జ్ఞాన ప్రతిభా పాటవాలతో ఎస్‌సీఈ ఆర్‌టీలో అకడమిక్ రిసోర్స్‌గైడ్‌గా స్థానం సంపాదించిన కిరణ్‌కుమార్ గార్లకు మన నియోజకవర్గ ప్రజల ప్రియతమ శాసన సభ్యులు నూతన రాష్ట్ర అమాత్యవర్యులు హస్తాలమీదుగా మన డివిజన్ ఉపాధ్యాయుల చేత ఉడతాభక్తి సన్మానం...' అని ఎమ్మార్పీ మాట్లాడుతున్నాడు.

'... మంత్రిగారు ఉపాధ్యాయులను శాలువతో సన్మానిస్తున్నరు. ఇపుడు ఉపాధ్యాయలోకం తరపున ఉడతాభక్తిగా అర తులం సువర్ణ అంగుళీయకాన్ని కవి పండితులు సశిరాగార్కి అలంకరించాలని కోరుతున్నాం.'

'కిరణ్‌కుమార్ గారిని శాలువ జ్ఞాపికలతో సత్కరించవలసిందిగా మా యూనియన్ అధ్యక్షుల వారిని సవినయంగా కోరుతున్నాం'.

బడిల సద్దు జెప్పిందెన్నడూ లేదు. బతుకంతా దోకుడే. ఇద్దరూ ఇద్దరే దొంగ నా కొడుకులు. ఏ పనీ ఒర్గిగా జేపిందిం లేదు. మెదలు వంచి ఐదైదు వందలు వసూలు జేసింర్రు ఈ ఉత్త ఉపాధ్యాయుల సన్మానాన్ని ఊదర నా కొడ్కులు...' వేదిక ముందు కొందరి గుసగుసలు. మరో ఇద్దరి నడుమ, 'మంత్రి సాబ్ తన కొడ్కు రుణాన్ని తీర్చుకున్నడు' జూనియర్ స్నేహితునితో ఓ సీనియర్.

'అదే?!'

'ఓ నాల్గేండ్ల కిందట సశిరా మాష్టారు ఇక విజిలేటర్ సరంగు అవతారమెత్తి అప్పటి ఎమ్మెల్యే కూడా అయిన మంత్రిగారి పుత్రరత్నాన్ని ఇంటర్ మీడియట్ పరీక్షల నదిలో చీటీలో పడవలో ప్రథమ శ్రేణిలో దాటించిరి.' జూనియర్ సందేహం తీరడంతో కండ్లు విప్పారి బొమ్మలు పైకి లేచాయి.

'ఈ సన్మాన కార్యక్రమం ముగించేముందు సశిరాగారి మనవరాలు రెండవ తరగతి చదువుతున్న వాణి తాతకు కానుకగా ఒక పద్యాన్ని విన్పిస్తుందట. చిన్నారిని వేదిక మీదకు కరతాళ ధ్వనులతో ఆహ్వానిద్దాం.'

'పండిత తటాకాన పారిజాతం' వాణి మెట్లెక్కుతుండగా ఆంకర్.

'విద్యచే భూషితుండయి వెలయుచున్న / దొదరి వర్జింపనగు సుమీ దుర్జనుండు చారుమాణిక్య శస్తమస్తకంబయిన / పన్నగము భయంకరముగాదే.' ఒక్కొక్క పద్య పాదాన్ని రెండుసార్లుగా మోహన రాగంలో పూర్తి చేసింది.

వాణి మెట్లు దిగుతుండగా భావం అర్థమై కొందరు కుళ్ళుకుంటూ సంతోషంలో కరతాళాలను ధ్వనింపగా పాడిన నైపుణ్యానికి మరికొందరు చప్పట్లు తప్పెట్లు మోగించారు.

సశిరా నిస్సహాయంగా పెదవులకు సాగదీస్తూ పక్కనే కూచున్న సరస్వతమ్మ వైపు ప్రతీకారం తీర్చుకున్నావుగా అన్నట్లు ఓరకంట చూశాడు. తృప్తిగా ప్రశాంతంగా సభాసదులను కళ్ళు విప్పార్చి అన్ని వైపులా చూస్తున్నది.

'ఇపుడిక మన అనూత్యవర్యులచేత ప్రతిభావంతులైన విద్యార్థులకు బహుమతి ప్రదానం' వ్యాఖ్యాత వెంటనే సందర్భాన్ని మార్చాడు. 'మొదట మన సశిరా కిరణ్‌కుమార్ల పాఠశాలనుండే ఏడవ తరగతి విద్యార్థులు వైజ్ఞానిక ప్రదర్శన ప్రథమ బహుమతి అందుకోడానికి వేదిక మీదకు రావాలి'.

'ఆగండాగండి' బహుమతినందుకొని వేదిక మీదనుండి దిగిపోబోతున్న విద్యార్థులను ఆపాడు వ్యాఖ్యాత.

'బాలోత్సవ్ సాహిత్య సాంస్కృతిక పోటీలలోనూ ప్రథమ బహుమతి ఈ చిన్నారులదే. ఇంత చిన్నప్రాయంలో తమ చిన్న చిన్న కవితాగానాలతో పోటీలకే కళ తెచ్చారు వీళ్ళు. తప్పకుండా సశిరాగారి వారసత్వాన్ని భవిష్యత్తులో నిలబెట్టాలనీ నిలబెడతారనీ ఆశిద్దాం...' అంతలో సరస్వతమ్మ సైగతో చేసిన అభ్యర్థనతో, 'సశిరా గారి ధర్మపత్ని సరస్వతమ్మగారు రెండు మాటలు మాట్లాడతారట. ఒక నిమిషం' ఇవ్వబోయిన మైక్‌ను వెనకకు తీసికుంటూ మేడమ్‌గారు మండల కేంద్రంలోని స్థానిక ప్రైవేట్ పాఠశాలలో తెలుగు బాషోపాధ్యాయురాలు' సభకు పరిచయం చేసి మైక్ అందించాడు.

సశిరాకంతా అయోమయంగా ఉంది. మనవరాలి పద్యం పంచ్ సలుపుతుండగా ఏమైనా జరగనీ అని చేసేదేమీ లేక చూస్తున్నడు.

'పెద్దలందరికీ నమస్కారం...' గొంతు సవరించకున్నాడబ్బాయి.

'సారీ మేడమ్ గారూ! మా చేత ఈ రచనలు సైన్స్ ప్రయోగాలు ఒక్కటి గాదు లెక్కలు ఇంగ్లీష్ సాంఘికం అన్నీ ఉప్పలయ్యసారే. కిరణ్ కుమార్ సార్ గురించి ఆ సార్ ప్రయోగాల గురించీ గుడ ఉప్పలయ్య సారే చెప్పడం చూపియ్యడం జరిగింది. కిరణ్‌కుమార్ గారు గొప్ప సైన్స్ సారంటని డిప్టేషన్ మీద హైద్రాబాద్‌ల పుస్తకాలు రాసే ఆఫీస్‌ల పనిజేస్తరంటని ఉప్పలయ్య సారే జెప్పిండు. ఆ సార్‌ను మేమిప్పుడే ఈడనే చూస్తున్నం. అందుకు సంతోషంగ ఉంది. ఈ పోటీల మేం ప్రైజుల కోసం పాల్గొనలేదు. మాకీ ప్రైజులొద్దు.' అనగానే మిగిలిన పిల్లలు ఇద్దరూ వెనుకకు మళ్ళి తమ చేతిలోని బహుమతులను అతిథుల ముందర టేబుల్ మీదుంచారు.

మంత్రిగారూ ఓఈఓగారూ ఇక్కడున్న పెద్దలారా! మా సార్‌ను నాల్గుదినాల కింద పోలీసోల్లు పట్టుక పోయింద్రు...' గొంతు బొంగురు పోయింది. పెగల్లేదు. మైక్‌ను పక్కనున్న అమ్మాయికందించి ముఖం, తిప్పుకొని దిగిపోయాడు.

"మా సార్‌ను నాల్గుదినాల కింద రాత్రి పోలీసులు పట్టుక పోయారంట. మాకైతే సార్ శాన మంచోడు. సార్ గురించి మీకందర్కి తెల్వనీకనే ఈ పోటీల పాల్గొన్నం'. అమ్మాయి మాట్లాడుతుండగా సభికులతో పాటు ఆశ్చర్యపోవడం సరస్వతమ్మ వంతయ్యింది. తనూహించిన ఆశించిన సంతోషకరమైన పరిణామమే జరుగు తున్నందుకు చిరునవ్వుతూ పక్కకు తిరిగి చూసింది. సశిరా ముఖంలో నెత్తురు చుక్కలేదు. నిర్వికారంగా వెర్రిచూపులు చూస్తున్నడు.

"... మా సార్‌ను తొందరగా విడిపించమని మరీ మరీ మీ అందరికీ మొక్కుతున్నా..." అంటూ మైక్‌ను టేబుల్ మీదుంచబోతుండగా అమ్మాయి స్థితిని గమనించి సరస్వతమ్మ లేచింది. ఏడుస్తూ దిగిపోతోతున్న అమ్మాయికి పొదివి పట్టుకొని మిగిలిన అబ్బాయితో కలిసి వేదిక దిగింది.

సభికుల్లో చాలా మందికి తెలిసిన విషయమే తమకెందుకు లెమ్మని మరిచిపోయినట్లే ఉన్న విషయమే. ఐనా ఇప్పుడు పిల్లలు దాన్ని కదిలించారు. ఆలోచింపక తప్పని పరిస్థితి కల్పించారు. 'ఔ! నిజంగ ఆయన చేసిన తప్పేంది. అసలీ ఏరియాల అన్నల కదలికలే ఎప్పుడూ వినలేదే...'

'నియోజక వర్గ ప్రియమైన ప్రజలకు వేదిక మీదున్న విద్యాశాఖ అధికార్లకు పత్రికా విలేఖర్ల మిత్రులకు...' జనం ఆలోచనలకు అడ్డు తగులుతూ మైక్ అందుకున్నాడు మంత్రి. 'ఆ సారేం జేసిండో పోలీసులెందుకు అరెస్ట్ జేసింద్రో మాట్లాడే సందర్భం కాదిది. నేను తెలుసుకుంట. చట్టం తన పని తాను చేసుకపోతుంది. సభా నిర్వాహకులకూ సార్లకు అందర్కీ అభినందనలు. నేను వేరే కార్యక్రమాలకు హాజరు కావలసి ఉంది. వెళుతున్నా...' చేతులు జోడించి వేదిక దిగాడు.

మంత్రి వెంటే పరివార గణం. ఆ వెంటే సభికులు. ఒక్కొక్కరుగా నిష్క్రమిస్తుండగా మిగిలిన బహుమతులను మొక్కుబడిగా పంచామనిపించి సభను ముగించారు.

సభ తర్వాత అందరూ ఊరి బైట బార్ కం ధాబాలోనికి నడిచారు.

రెండు ఫుల్ రాయల్ ఛాలెంజ్, ఎన్మిది ఈగిల్ బీర్లు ఆరు బిస్లెరీ... వెయిటర్‌కు మండలాధ్యక్షుడు జాబితా చెబుతుండగా సశిరా గుండె గుభిల్లుమన్నది. ఈ రోజు తనే కట్టాలి కనుక.

"అన్నా సభంతా గమ్మతైంది గద? మన ఎమ్మెల్యే మంత్రి సార్ జెప్తే పోలీసులు ఆ సార్‌ను ఇడ్సిపెట్టరా" విషయం తెలియని డివిజన్ మూడో శ్రేణి నాయకుడు ఒకరు మండలాధ్యక్షుని వైపు చూస్తూ అన్నడు.

'ఆ సార్ పేరెత్తితేనే గరమైతాండు సార్. మర్రిపల్లిల నాల్గువేల చిల్లర ఓట్లకు నూడు వందల చిల్లరోట్లే పోలైనయి. సార్ మెజార్టీ తగ్గింది. గింత తక్కువ పోలింగ్‌కు గా మహాత్ముడే కారణం.'

'గాతనేం జేస్తడు పోలింగ్ నాడాయనగూడ డ్యూటీకే బాయె ఊల్లె లేకుండ"

"ఎలక్షన్‌కు నామినేషన్ ఏసిన కాన్నించి ఊల్లే రాత్రి మీటింగులు పెట్టి ఇల్లిల్లు తిరిగి ఎక్కించిండంట. వింత డిమాండ్లు బెట్టిండ్లు ఆ ఊరోల్లు. నిలవడ్డోల్లెవరైతే వాళ్ల పిల్లల్ను స్కూల్ పిల్లలయితే నియోజక వర్గంలోని సర్కార్ స్కూల్లల్ల కాలేజీ పిల్లలయితే సర్కార్ కాలేజీలల్ల వెంటనే చేర్పిస్తరో, వాళ్లకు గాని వాళ్ల ఫామిలి మెంబర్స్‌కెవరికయినా రోగమొచ్చినా నొప్పొచ్చినా నియోజక వర్గం సర్కార్ దవకానలనే వైద్యం ఇప్పిస్తమంటిని విలేకర్ల సమక్షంల స్టాంపు కాయితం మీద రాసిస్తరో వాళ్ళకే ఊరందరం ఓట్లేస్తమంటివి. ఎలక్షన్ లైనంక గెల్చినోల్లను గట్లే పట్టువడడం అంటని ఎంత నచ్చజెప్పినా మననే గాదు అపోజిషన్ పార్టోలకు గుడ సందియ్యలే.'

'అవునా! సిత్రంగనే ఉన్నది. ఎక్కడ ఎప్పుడు జనం ఇట్ల డిమాండ్ బెట్టలే...' అని కొద్దిసేపాగి '... అయినా మంచి డిమాండ్లే బెట్టింద్రు. మనకూ అక్కరకొచ్చేటివే పెద్దసార్ల పిల్లలు జేరితే స్కూల్లు కాలేజీలు అయ్యే మంచిగ నడుస్తయి. అల్ల...'

'అల్లు ఓట్లేస్తే మాత్రం మన పార్టీకీ వద్దయన్న గ్యారంటేంది. పోని తీరాదు' మొదటి మనిషి మాట పూర్తిగాక మునుపే మరో బుడ్డ లీడర్.

'మనకు వద్దా పడుకున్నా ఎవ్వర్కి బడ్డా జెనం ఓట్లల్ల పాల్గొనాలె. లేకుంటే వ్యవస్థకే ప్రమాదం' అన్నడు సార్.

'ఈల్ల తాడుదెంచ.. దొంగ నా కొడ్కులు...' మాటల్తో పాటు ఢ్ఢపమన్న టేబుల్ మీది గ్లాసు శబ్దంలో ముచ్చట్లాపి అందరూ వెనుకకు తిరిగారు.

వెనకే టేబుల్ వద్ద నల్గురు మనుషులు పైకి లేస్తుండడం కన్పించింది.

'ఉత్తోల్లెవరో ఉత్తములెవరో తెల్వింది పొంద్రి' ఒక గొంతు. మసక వెలుతుర్లో మొఖాలు కన్పడడం లేదు. 'మొన్న మా ఓన్కి అకస్మాత్‌గా కడ్పునొప్పొస్తె ఈడ దవకానకు బోతె ఏదో జెర ట్రీట్‌మెంట్ ఇచ్చి అన్మకొండల రోహిణికి దీస్కపొమ్మన్నరు'.

'మా మేనకోడల్కుకు మంచి మార్కొలొచ్చినయని చైతన్య కాలేజీకి హైద్రబాద్‌కు దీస్కపోతే కన్సెషన్ పొంగనే యాభై వేలన్నరు'.

'గా సారెవరో ఆయనకు మొక్కాలె.'

ఆగ్రహంగా వస్తున్న మాటలకు బార్ అంతా నిశ్శబ్దమైంది. కౌంటర్ వద్ద నోట్లు పారేసి చిల్లర కూడా తీస్కోకుండా దర్వాజా దాటాయి నాల్గు ఆకారాలు. అయినా మాటలు వినబడుతున్నయ్. క్రమంగా అస్పష్టమవుతున్నయ్.



వ్యాసం

# రైతాంగ హక్కుల్ని హరించే భూసేకరణ సవరణ చట్టం - 2015

- ఎర్రంరెడ్డి నర్సింహారెడ్డి

వలస పాలన కాలంలో పాలనకు అవసరమైన రహదారులు, భవనాలు, రైలుమార్గాలు వంటి మౌలిక సదుపాయాల కోసం ప్రైవేట్ వ్యక్తుల యాజమాన్యంలోని భూమిని సేకరించడం కోసం 1894లో బ్రిటిష్ ప్రభుత్వం చేసిన భూసేకరణ చట్టమే అధికార మార్పిడి తర్వాత 68 సంవత్సరాలు యథాతథంగా అమలులో ఉన్నది. బ్రిటిష్ సామ్రాజ్యవాదుల చట్టంలో భూసేకరణకు ప్రజల అనుమతి అవసరం లేదు. భారతీయుల మనోభావాలతో కాని, ఆమోదంతో కాని అవసరం లేకుండా భూమిని ప్రజల నుండి సేకరించడానికి బ్రిటిష్ దురాక్రమణ వలసవాదులు భూసేకరణ చట్టాన్ని రూపొందించారు. ఈ భూసేకరణ వల్ల తీవ్రంగా నష్టపోయే బాధితుల జీవనోపాధి, వారి పునరావాసం వంటి విషయాల గురించి పట్టించుకోకుండా చాలా త్వరగా ఎలాంటి ప్రతిఘటన లేకుండా భూమిని స్వాధీనం చేసుకోవాలన్నదే ఈ చట్టం లక్ష్యంగా ఉంది. ప్రజా ప్రయోజనం అనేది ప్రభుత్వం ఏకైక, సంపూర్ణ విశేషాధికారంగా ఉండటం 1894 నాటి చట్టంలోని లొసుగుల్లో అతి ప్రధానమైనది.

సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాలు 1990లలో ప్రారంభించిన నాటి నుండి దేశీయ, విదేశీ కంపెనీల కోసం రాష్ట్ర ప్రభుత్వాలు భూములను రైతాంగం నుండి పెద్ద ఎత్తున బలవంతంగా స్వాధీనం చేసుకోవడం ఆరంభించారు. ఈ కంపెనీలు కేవలం వస్తువుల తయారీ కోసమే కాకుండా రియల్ ఎస్టేట్, ఖనిజాలు వెలికితీత, ఇంకా ప్రభుత్వ ప్రైవేట్ భాగస్వామ్య (పిపిపి) ఒప్పందాలు మౌలిక వసతుల నిర్మాణాల అవసరాలకు మించి భూమిని డిమాండ్ చేయడం మొదలు పెట్టారు. ఇప్పుడు పెట్టుబడుల కోసం పోటి పడుతున్న రాష్ట్ర ప్రభుత్వాలు ఒక పద్ధతి ప్రకారం ప్రైవేట్ పెట్టుబడుల వినియోగం నిమిత్తం భూములను స్వాధీనం చేసుకుంటున్నాయి. ఎలాంటి ప్రైవేట్ లక్ష్యం కోసమైనా సరే... అవి సంపన్నుల ఇళ్ళ కాలనీలు కావచ్చు. గోల్ఫ్ కోర్టులు కావచ్చు, చివరికి కారు రేసుల కోసం నిర్మించిన ట్రాక్‌ల కోసం కూడా భూములు లాక్కొన్నారు. 1947-2014 మధ్యకాలంలో నిర్వాసితులైన లేదా బాధితులైన సంఖ్య దాదాపు ఆరుకోట్లుగా ఉంది. 70 లక్షల హెక్టార్ల అటవీ భూమి, 60 లక్షల హెక్టార్ల ఇతర ఉమ్మడి ఆస్తులతో సహా మొత్తం 2.5 కోట్ల హెక్టార్ల భూమి సేకరణకు గురైంది. ప్రాజెక్టులు నిర్మించడం వల్ల నిర్వాసితులైన లేదా బాధితుల్లో ఆదివాసీలు 40 శాతంగా ఉన్నారు. దళితులు 20 శాతంగా ఉన్నారు.

బ్రిటిష్ వలస పాలకులు చేసిన 13 భూసేకరణ చట్టాలను భారత పాలకులు యథాతథంగా స్వీకరించి 68 సంవత్సరాలుగా అమలు చేస్తున్నారు. 1894 భూసేకరణ చట్టాన్ని 1984లో మొదటిసారి భారత పాలకులు సవరించారు. సుప్రీంకోర్టు 2007లో బ్రిటిష్ కాలం నాటి కాలదోషం పట్టిన భూసేకరణ చట్టం ప్రజలను వంచించడానికి దోహదం చేస్తుందని, దీన్ని రద్దు చేయాలని, నూతన చట్టాన్ని రూపొందించాలని సుప్రీంకోర్టు పదే పదే నిర్ధారించింది. అనేక ఉద్యమాల ఫలితంగా, ప్రజల ప్రతిఘటనతో తప్పనిసరై కేంద్ర ప్రభుత్వం అనేక కసరత్తులు చేసి పునరావాస, పునర్నిర్మాణ విధానాన్ని 2007 అక్టోబర్ 31న గెజిట్‌లో ప్రచురించింది. 2009లో సవరించిన బిల్లును రెండు సంవత్సరాల తర్వాత 2011 సెప్టెంబర్ 7న లోక్‌సభలో ప్రవేశపెట్టారు. అది 2013 ఆగస్టు 29న లోక్‌సభ, సెప్టెంబర్ 4న రాజ్యసభ ఆమోదం పొందింది. 118 సంవత్సరాల క్రితం వలసవాదులు రూపొందించిన భూసేకరణ చట్టం స్థానంలో యుపిఎ ప్రభుత్వం నూతన భూసేకరణ చట్టం - 2013 తెచ్చింది.

యుపిఎ ప్రభుత్వం బ్రిటిష్ కాలం నాటి భూసేకరణ చట్టాలను రద్దుచేసి 2013లో చేసిన నూతన భూసేకరణ చట్టాన్ని సవరించకపోతే అభివృద్ధి సాగదని పారిశ్రామిక వర్గాలు, విదేశీ కార్పొరేట్లు గగ్గోలు చేస్తున్నాయి. భూ యాజమాని సమ్మతి లేని కారణంగా దాదాపు 30000 కోట్ల రూపాయల విలువైన ప్రాజెక్టుల పనులు ప్రారంభానికి నోచుకోలేదనీ, 2013 భూసేకరణ చట్టంలో మార్పు చేయనిదే భూసేకరణ పని సులభం కాదనీ 28 రాష్ట్రాలు, కేంద్ర పాలిత ప్రాంతాలు కూడా కేంద్రానికి విన్నవించుకున్నాయి. దీంతో బిజెపి అధికారంలోకి రాగానే దేశ, విదేశీ బడా బూర్జువాలకు తన విశ్వసనీయతను చాటుకునేందుకు పూనుకుంది. భూసేకరణ చట్టం 2013ను సవరిస్తూ భూసేకరణ ఆర్డినెన్సును 2014 డిశంబర్ 30న తెచ్చింది. "సబ్‌కా సాథ్, సబ్‌కా వికాస్" అన్న నినాదంతో అధికారం చేపట్టిన ఎన్డీయే సర్కార్ భూమిని ఉపాధి కల్పనకు మార్గంగా ఉపయోగించకుండా, అభివృద్ధి - మౌలిక వసతుల కల్పన చుట్టూ తిప్పడం రైతుల ప్రయోజనాలకు ప్రమాదకరంగా పరిణమించింది.

మోడీ నాయకత్వంలోని కేంద్ర ప్రభుత్వం రూపొందించిన భూసేకరణ సవరణ బిల్లు 2015 రైతు వ్యతిరేకమైంది. వ్యవసాయమే ప్రధాన జీవనాధారమైన మన దేశంలో పరిశ్రమల కోసం, వాణిజ్యం కోసం వ్యవసాయ భూములు సేకరించడం సమంజసం కాదు. అంతేగాక భూసేకరణలో న్యాయమైన పరిహారం పునరావాసంలో పారదర్శకతకు హామీ పేరుతో యుపిఎ ప్రభుత్వం రూపొందించిన "రైట్ టు ఫెయిర్ కాంపెన్సేషన్ అండ్ ట్రాన్స్‌ఫరెన్సీ ఇన్ లాండ్ ఎక్విజేషన్, రిహాబిలిటేషన్ అండ్ రిసెటిల్మెంట్ యాక్ట్ - 2013" పూర్వపక్షం చేస్తూ కేంద్ర ప్రభుత్వం డిశంబర్ 30న జారీ చేసిన ఆర్డినెన్స్ స్థానే చట్టం తీసుకురావడానికి ప్రవేశపెట్టిన బిల్లు లోక్‌సభలో మార్చిలో ఆమోదం పొందింది. ఈ చట్టంలోని 10వ సెక్షన్ సవరించడం ద్వారా భూయాజమానికి, నిర్వాసితులకు గల రక్షణలను తొలగించడంతో దేశవ్యాప్తంగా ఆందోళన మొదలైంది. రైతాంగ అశాంతికి ఆర్డినెన్స్ ఆజ్యం పోసింది. దిగువ సభలో ఆమోదం పొందిన

భూసేకరణ బిల్లు - 2015 ఎగువసభ ఆమోదం పొందనందున ప్రభుత్వం తిరిగి ఏప్రిల్ 5న ఆర్డినెన్స్ జారీ చేసింది.

భూసేకరణ సవరణ బిల్లు - 2015ను సమగ్రంగా పరిశీలిస్తే అనేక లోపాలు కనిపిస్తాయి. భారత్‌లో భూమి భావోద్వేగాలతో ముడిపడి ఉంది. భూమి అనగానే కేవలం అదొక పంట పొలాలుగా మాత్రమే ఆలోచిస్తున్నారు. నేడు భూమి అనేది సామాజిక గౌరవానికి, సామాజిక భద్రతకు చిరునామాగా మారిపోయింది. భూమిపై ఆధారపడి ఎన్నో రకాల వృత్తుల వాళ్లు జీవిస్తున్నారు. వ్యవసాయదారులే కాకుండా వ్యవసాయ కూలీలు, చేతివృత్తుల వారు వ్యవసాయంపై ఆధారపడి గ్రామీణ జీవితాన్ని గడుపుతున్నారు. గ్రామీణ స్వయంపోషక ఆర్థిక వ్యవస్థ మొత్తం భూమి కేంద్రంగా శతాబ్దాలుగా కొనసాగుతూ వస్తున్నది. కోట్లాది ప్రజలు నేటికీ ఈ గ్రామీణ వ్యవసాయ ఆధారిత ఉత్పత్తి విధానంలో తమ తమ వృత్తులతో కలిసి జీవిస్తున్నారు. అందువలన ఇది కేవలం భూమి కోల్పోతున్న రైతుల సమస్య మాత్రమే కాదు. భూసేకరణ విధానం మొత్తం గ్రామీణ వ్యవస్థ శిథిలమై చెట్టుకొకరు, పుట్టకొకరుగా, దీనులుగా, అనాథలుగా మారిపోయే దుస్థితిని తెచ్చిపెడుతోంది. అందువలన సామాజిక సంపద అయిన భూమిని సామాజిక సంక్షేమం పట్టని కేవలం లాభాపేక్షయే ధ్యేయంగా పనిచేసే కార్పొరేట్ సంస్థలకు భూములు అప్పగించడం హేతురహితమైన ప్రజా వ్యతిరేక అప్రజాస్వామిక చర్య.

నమ్ముకున్న భూమిపై అన్నదాతలకున్న హక్కును తొలగించే దిశగా మోడీ సర్కారు తొలి అడుగు వేసింది. విపక్షాల నిరసనలు, వాకౌట్ల మధ్య మూజువాణి ఓటుతో సముచిత పరిహారం, పారదర్శకతలతో భూసేకరణ, పునరావాస (సవరణ) బిల్లు - 2015 మార్చి 10న దిగువసభ ఆమోదం పొందింది. ఎన్డీఏ మిత్రపక్షాలు, విపక్షాలు, వ్యవసాయ సంఘాల సూచనలను పరిగణనలోకి తీసుకున్నామంటూ... బిల్లులో 9 అధికారిక సవరణలను ప్రతిపాదించిన ప్రభుత్వం... వాటిలో భూ యజమానుల ఆమోదం, సామాజిక ప్రభావ అంచనా, బహుళ పంటలు పండే భూముల సేకరణపై నిషేధం... తదితర రైతు అనుకూల అంశాల జోలికి మాత్రం వెళ్లలేదు. కంటి తుడుపుగా చేసిన సవరణలు : 1. భూసేకరణ ప్రభావం పడిన రైతు, కూలీల కుటుంబంలో ఒక్కరికి ఉద్యోగావకాశం. 2. భూసేకరణపై జిల్లా స్థాయిలోనే ఫిర్యాదులు చేయవచ్చు. 3. అవసరమైనంత మేరకే సేకరణ. 4. పారిశ్రామిక కారిడార్లలో రహదారులు, రైల్వే లైన్లకు ఇరువైపులా భూసేకరణను కిలోమీటరు వరకే పరిమితం చేయడం. 5. సామాజిక మౌలిక వసతుల ప్రాజెక్టులకిచ్చిన మినహాయింపు తొలగింపు. 6. ల్యాండ్ బ్యాంకుల ఏర్పాటుకు ఆయా రాష్ట్ర ప్రభుత్వాలకు అనుమతి. 7. ఈ ప్రాజెక్టులకు రాష్ట్ర ప్రభుత్వాల అనుమతి విధిగా ఉండాలి. 8. రెండు పంటలు పండే భూముల సేకరణకు వీలు లేదు. 9. ప్రభుత్వ - ప్రైవేటు భాగస్వామ్యంతో మౌలిక సదుపాయాల ప్రాజెక్టులకు చట్ట సవరణలో మినహాయింపు.

భూసేకరణ చట్టం - 2013 ప్రకారం ప్రభుత్వం - ప్రైవేటు భాగస్వామ్యం (పీపీపీ)తో చేపట్టే ప్రాజెక్టులకు సంబంధించి ప్రభావిత ప్రాంతంలో 70 శాతం, ప్రైవేటు సేకరణకైతే 80 శాతం పౌరుల సమ్మతి తప్పనిసరి. అలాగే గ్రామీణ ప్రాంతాల్లో సేకరించిన భూమికి మార్కెట్ విలువకన్నా నాలుగు రెట్లు, పట్టణ ప్రాంతాల్లో భూమికి రెండింతలు పరిహారం చెల్లించాలి. చట్టంలోని సెక్షన్-4 ప్రకారం గిరిజన ప్రాంతాల్లో భూసేకరణకు గ్రామసభ అనుమతి అవసరం. పరిహారం-పునరావాసం సంబంధించి సేకరించదలచిన భూములపై ఆధారపడి మనుగడ సాగించేవారికి పునరావాసం కల్పించడంతో పాటు, పూర్తి పరిహారం ముట్టజెప్పాకే, వారిని అక్కడి నుంచి కదిలించాలి. సేకరించిన భూమిలో ఎలాంటి ప్రాజెక్టులు ప్రారంభించకుండా అయిదేళ్లపాటు ఖాళీగా ఉంచిన పక్షంలో ఆ భూమిని తిరిగి సంబంధిత రైతులకు అప్పగించాలి లేదా ప్రభుత్వ భూ బ్యాంకుకు ఇవ్వాలి. ముక్కారు పంటలు పండే పొలాలను భూసేకరణ నుంచి మినహాయించాలి. ఒకవేళ ఏడాదికి మూడు పంటలు పండించే భూమిని సేకరిస్తే, అంతే పరిమాణంలో పంట భూమిని మరోచోట ప్రభుత్వం అభివృద్ధి పరచాలి. అది కుదరని పక్షంలో ఆ భూమి విలువకు సమానమైన మొత్తాన్ని ఆహార భద్రత కోసం నిర్దేశించిన ఓ ఖాతాలో మదుపు చేయాలి. ప్రజాప్రయోజనాన్ని లక్షించి ప్రైవేటు కంపెనీలు చేపట్టే ప్రాజెక్టుల కోసమూ భూ సేకరణ జరపవచ్చు.

ఎన్డీఏ ప్రభుత్వం 2013 భూసేకరణ చట్టంలోని సెక్షన్-10లో మార్పులు చేయడం ద్వారా రక్షణ, రక్షణ ఉత్పత్తులు, గ్రామీణ మౌలిక వసతులు (విద్యుదీకరణ), పారిశ్రామిక కారిడార్లు, సామాజిక మౌలిక సౌకర్యాల కల్పన (పేదల కోసం ఇళ్ల నిర్మాణం), ఈ అయిదు విభాగాల కోసం జరిపే భూసేకరణకు ప్రభావిత ప్రాంత పౌరుల సమ్మతిగాని, సామాజిక ప్రభావ అధ్యయన నివేదికగాని అవసరం లేదు. ఈ రంగాలకోసం అవసరమైతే ముక్కారు పంటలు పండించే భూమిని సేకరించవచ్చు. ప్రైవేటు ఆస్పత్రులు, విద్యాసంస్థలు, హోటళ్లను ప్రజాప్రయోజనం పరిధిలోకి తీసుకువచ్చి, భూ సేకరణకు అనుమతిచ్చారు. వలస కాలం నాటి పదమూడు రకాల భూ సేకరణ చట్టాలను ఇందులో విలీనం చేశారు. ఈ చట్టాల కింద సేకరించే భూమికి సైతం పునరావాసం, పునరాశ్రయం నిబంధనలు ఈ చట్టాల కింద సేకరించే భూములకూ వర్తిస్తాయి. గ్రామాల్లో సేకరించిన భూమికి మార్కెట్ విలువలో నాలుగు రెట్లు, పట్టణాల్లో రెండు రెట్లు పరిహారం చెల్లింపు. అయిదేళ్లలోగానీ, నిర్దిష్ట కాలావధి మేరకు ప్రాజెక్టు పూర్తయ్యేలోగానీ సేకరించిన భూమిని ఉపయోగించని పక్షంలో - దాన్ని తిరిగి సొంత దారులకు ఇచ్చేయాలి. ప్రైవేటు కంపెనీ కాకుండా భూసేకరణను 'ప్రైవేటు వ్యవస్థ' చేపడుతుంది.

భూసేకరణపై జరుగుతున్న చర్చ 'వృద్ధి-అభివృద్ధి' భావనలు దాటి వెళ్లడం లేదు. పైగా ప్రైవేట్ ఆస్తిహక్కు అనుల్లంఘనీయమని, ఏ రూపంలో జాతీయకరణ చేయడం ప్రమాదకరమని మొండిగా వాదించే మధ్య తరగతి భూ యజమానుల నుండి భూమిని బలవంతంగా గుంజుకొని జాతీయ, అంతర్జాతీయ కార్పొరేట్ శక్తులకు కట్టబెట్టడాన్ని సమర్థించడం శోచనీయం. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాల అమలు మొదలైన 1990 దశకం ఆరంభం నుండి బూర్జువా ఆర్థికవేత్తలూ, ప్రణాళిక కర్తలు కలిసి, భూమి ఆర్థిక సంపద అని, దురదృష్టవశాత్తు అది చేతగాని వ్యక్తుల (రైతుల) చేతిలో బంది అయివుందని మాట్లాడటం మొదలైన నాటి నుంచీ, భూమిని వీలైనంత ఎక్కువగా సేకరించడానికి పారిశ్రామిక వర్గాల, రియల్టర్స్ మధ్య పెనుగులాట మొదలైంది. ప్రపంచ బ్యాంకు పల్లెల

విధ్వంసం ద్వారా పట్టణాల అభివృద్ధికి, వ్యవసాయ కార్పొరేటీకరణకు, ప్రజా వ్యతిరేక పాలకుల వ్యూహానికి మార్గదర్శకాలు రూపొందించి అమలు చేయమని వత్తిడి చేస్తున్నది. సెజ్‌లు, విశాలమైన రోడ్లు, ఓడరేవులు, విమానాశ్రయాలు, మైనింగ్, ఆనకట్టలు, ఫార్మ, ఐటిసిటీలు, థర్మల్-అణు విద్యుత్ ప్లాంట్ల నిర్మాణం పేరిట లక్షలాది ఎకరాలు రైతాంగం నుండి బలవంతంగా సేకరించారు.

నిర్వాసిత ప్రజలు మాత్రం నష్టపరిహారాన్నే కాకుండా నిర్వాసిత ప్రజలందరికి పునరావాస కల్పనకు డిమాండ్ చేస్తూ బలవంతపు తొలగింపుకు వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా ఉద్యమం చేస్తున్నారు. ఈ ఉద్యమాలలో ఎంతో మంది పోలీసు కాల్పుల్లో మరణించారు. గాయపడ్డారు. అభివృద్ధి ప్రాజెక్టుల వల్ల కలిగే లాభనష్టాలను ప్రజలకు పూర్తిగా తెలియపరిచిన తర్వాతనే ప్రాజెక్టు నిర్మాణానికి ప్రజల నుండి సమ్మతి పొందాలని డిమాండు చేస్తున్నారు. బహుళ పంటలు పండే సారవంతమైన భూములను ఇతర అవసరాలకు తరలించరాదని కోరారు. ప్రైవేటు కంపెనీల కొరకు ప్రభుత్వం భూసేకరణ చేయరాదని డిమాండ్ చేశారు. నర్మదా బచావ్ ఆందోళన, కూడంకుళం, జైతాపూర్ అణువిద్యుత్తు కర్మాగారాల స్థాపనకు వ్యతిరేకంగా ఆందోళన, ఆంధ్రలో విద్యుత్తు కర్మాగారాల స్థాపనకు వ్యతిరేకంగా ఆందోళనలు, బెంగాల్‌లో సింగూర్, నందిగ్రాంలో భూసేకరణకు వ్యతిరేకంగా ఆందోళనలు ఒరిస్సాలో పోస్కో, టాటా కంపెనీల కొరకు భూసేకరణ వ్యతిరేక ఆందోళనలు వీటిలో కొన్ని మాత్రమే.

భారత్‌లో గ్రామీణ ప్రాంతం నుండి పట్టణాలకు జనాభా తరలింపు జరగాలని ప్రపంచ బ్యాంకు 1996 నుంచే పోరు పెడుతూ వచ్చిందన్న విషయాన్ని కూడా మరువరాదు. ఇప్పటి నుంచి వచ్చే 20 సంవత్సరాలలోగా అంటే 2015 నాటికి దేశంలోని 40 కోట్ల మంది ప్రజలను గ్రామీణ ప్రాంతాల్లోంచీ బయటకు పంపాలని ప్రపంచ బ్యాంకు ఆనాడే భారత్‌కు సూచించింది. అంటే బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీల జనాభాకు రెట్టింపు సంఖ్యలో భారతీయ రైతాంగాన్ని భూముల నుంచి తరిమివేసే భారీ పథకం ప్రపంచ బ్యాంకు కనుసన్నల్లో మొదలయింది. ఇక అప్పటి నుంచి స్మార్ట్‌సిటీలు, వ్యవసాయ కార్పొరేటీకరణ చర్యలు మొదలయ్యాయి. అందుకే వ్యవసాయాన్ని లాభసాటిగా ఉంచకుండా దాన్ని ఉద్దేశపూర్వకంగా పతనం వైపుకు నెట్టే చర్యలు పాలకులు చేపట్టడం ద్వారా ఈ ప్రక్రియ మొదలైంది. ఫలితంగా దేశవ్యాప్తంగా 3 లక్షల మంది రైతుల ఆత్మహత్యలు జరిగాయి. వ్యవసాయం గిట్టుబాటు కాక రుణగ్రస్తమై చిన్న సన్నకారు రైతులు వ్యవసాయం వదలి పట్టణాలకు బతుకు దెరువు కొరకు వలసలు వెళ్తున్నారు. దీని ఫలితంగా తమ భూములకు మంచి ధర పలికితే భూములను వదులుకోవడానికి సిద్ధమనే మానసిక స్థితిని రైతుల్లో కలిగించారు. ఒక్కసారి ఇలాంటి భావనను వారిలో ప్రవేశపెట్టాక, రైతులను వారి భూముల నుంచి తరిమేయడం మరింత సులువు అవుతుంది. ఇది 16, 17వ శతాబ్దంలో యూరప్‌లో పెట్టుబడి ప్రాథమిక సంచయనం సమయంలో రైతులు వ్యవసాయాన్ని వదిలి పట్టణాల బాట పట్టారు, కర్మాగారాల్లో కార్మికులుగా చేరారు. మనదేశంలో భూముల నుండి రైతులను తరిమి వేసే ప్రక్రియ మొదలైంది. కాని పట్టణాలకు వెళ్లే రైతులకు పరిశ్రమల్లో ఉపాధి దొరకడం లేదు. ఇది యూరప్‌లో జరిగిన దానికి భారత్‌లో జరుగుతున్న పెట్టుబడి ప్రాథమిక సంచయనంలో తేడాగా గుర్తించాలి.

ఇప్పటి వరకు భూసేకరణ వలన 6 కోట్ల మంది నిర్వాసితులైతే కేవలం 2 కోట్ల మందికి మాత్రమే పరిహారం, పునరావాసం కల్పించారు. మరోవైపు 2 కోట్ల ఎకరాల వ్యవసాయ భూమి వ్యవసాయేతర రంగాలకు మరల్చడం వలన ఆహార పదార్థాల ఉత్పత్తి తగ్గి 2020 నాటికీ ఆహార పదార్థాలకు విదేశాలపై ఆధారపడవల్సిన దుస్థితి వస్తుందని ఆహార శాస్త్రవేత్తలు చెబుతున్నారు. ఈ క్రమంలో ప్రభుత్వం రైతుల నుండి పంట భూములను ఏ రూపంలోనైనా సేకరించడాన్ని వ్యతిరేకించాలి. భూసేకరణకు సంబంధించిన అన్ని చట్టాలను రద్దు చేయాలని డిమాండు చేయాలి. ఆర్థిక కార్యకలాపాల కొరకు భూమి అవసరమైన వారు - ప్రభుత్వంతో సహా - రైతాంగంతో చర్చించి పరస్పరం అంగీకరించిన ధరకు కొనుగోలు చేయాలి. ప్రైవేటు అవసరాలకు ప్రభుత్వం ఎట్టి పరిస్థితుల్లోనూ భూసేకరణకు పూనుకోరాదు. ప్రతిపాదిత ప్రాజెక్టు పర్యావరణ, సామాజిక, ఆర్థిక ప్రభావాన్ని అంచనా వేసి తర్వాతనే ప్రాజెక్టుకు అనుమతినివ్వాలి. ఆ తర్వాతనే, భూమి కొనుగోలుకు చర్యలు ప్రారంభించాలి. నిజమైన ప్రజాక్షేమం కోసం భూసేకరణ అవసరమైతే బాధితులకు నష్టపరిహారం, పునరావాసం కల్పించిన తర్వాతనే భూమిని స్వాధీనం చేసుకోవాలి. ప్రభుత్వం ఎట్టి పరిస్థితుల్లోనూ దేశ సహజ వనరులను విదేశీ పెట్టుబడిదారులకు అప్పగించరాదు. ఈ డిమాండ్లపై విస్తృత ప్రజా ఉద్యమ నిర్మాణానికి ప్రజాస్వామిక వాదులు, హక్కుల సంఘాలు, ఉద్యమకారులు, సామాజిక కార్యకర్తలు పూనుకోవాలి.



## సృజన 1966-1992 డివిడి కొన్నవారికి విజ్ఞప్తి

సృజన ఆధునిక సాహిత్య వేదిక 1966-1992 సర్వస్వం డివిడిలో జూన్ 1973 (సంచిక 45) స్కానింగ్‌లో రెండు పేజీలు పొరపాటున తప్పిపోయాయి. అలాగే మే 1979 (సంచిక 91)లో మరొక సంచిక నుంచి పది పేజీలు కలిసి, అక్కడ ఉండవలసిన పేజీలు తప్పిపోయాయి. ఈ పొరపాట్లకు చింతిస్తున్నాం. సృజన డివిడి కొనుక్కున్నవాళ్లు srjana.missingpages@gmail.com కు మీ మెయిల్ ఐడి పంపితే ఆ రెండు సంచికలూ సవరించిన ప్రతులు పంపుతాం. మీ డివిడిలో లేదా కంప్యూటర్‌లో పాత ప్రతుల బదులు కొత్త ప్రతులు చేర్చుకోవచ్చు.

**- సాహితీమిత్రులు**

*గమనిక : గత నెల అచ్చయిన ఈ ప్రకటనలో మెయిల్ ఐడి స్పెల్లింగ్‌లో పొరపాటు దొర్లింది. గమనించగలరు. - సం.*

ప్రత్యేక వ్యాసం

# మేక్ ఇన్ ఇండియా-వినాశకరం జనతన సర్కార్లు-ప్రత్యామ్నాయం

- జహంగీర్

(గమనిక: అరుణతార ఆగస్టు-సెప్టెంబర్ 2014 సంచికలో దండకారణ్య సంభాషణ-ప్రత్యామ్నాయ సహాన్వేషణ చదివాం. రౌండ్‌టేబుల్ సమావేశంలో 'దండకారణ్యంలో జనతన సర్కార్' పై జరిగిన చర్చల వివరాలు బాసిత్ చక్కగా పాఠకులకు అందించారు. పాణి చర్చను ముందుకు తీసుకుపోవడానికి కొన్ని విషయాలను ప్రస్తావించడం బాగుంది. చివర్లో వరలక్ష్మి భవిష్యత్‌లో జనతన సర్కార్‌కు సంబంధించిన ప్రచార కార్యక్రమాలను రూపొందించుకొని కలసి పని చేద్దామని' ముగించారు. వివి మాట్లాడుతూ విరసం సిద్ధాంత అవగాహన గురించి చెప్పారు. మీరంతా వెళ్ళి రావడం సులువు అన్నారు. ఇవన్నీ అర్థం చేసుకున్నాక నా దగ్గర ఉన్న సమాచారాన్ని సంక్షిప్తంగానైనా అరుణతార పాఠకులతో పంచుకోవాలనిపించింది. విరసం సరిగ్గా 2014 ప్రారంభంలో 'జనతన సర్కార్లను కాపాడుకుందాం' నినాదంతో సంవత్సర కార్యక్రమాన్ని తీసుకుంది. అది ముగుస్తున్న సందర్భంగా కూడా ఈ సమాచారం ఉపయోగమేమోనని భావిస్తూ పంపిస్తున్నాను)

జనవరి 26 - 66వ భారత గణతంత్ర దినం. భారత రాజ్యాంగం అమలులోకి వచ్చిన దినం. ప్రధాన మంత్రిగా నరేంద్రమోదీకి ఇది తొలిసారి కాగా, తొలిసారిగా అమెరికా అధ్యక్షుడు భారత ప్రజాతంత్రదిన వేడుకలలో పాల్గొంటున్నాడు. అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామా వెంట భారీ ప్రతినిధి వర్గం మూడు రోజుల భారత పర్యటనలో పాల్గొంది. ఒబామా, ఆయన వెంట వచ్చిన వ్యాపార, పారిశ్రామికవేత్తలంతా మన దేశ అభివృద్ధిని కాంక్షించే వచ్చి ఉండాలి. ఒబామాతో కుదుర్చుకున్న రక్షణ సహా అనేక ఒప్పందాలు మన దేశ ప్రజల అభ్యున్నతికే అనుకోవాలి. మన దేశ ప్రజలను ఉద్దేశించి అమెరికా అధ్యక్షుడు 'మన్ కీ బాత్' ఆకాశవాణి ద్వారా మాట్లాడిన సిగ్గుమాలిన విషయం కూడా ఎంతో గొప్ప అనుకోవాలి. బామా-మోదీల 'స్నేహానికి' అది గొప్ప ప్రతీకగా భావిస్తున్నారు. మోదీ అధికారంలోకి వచ్చాక ఆయనతన యావత్తు శక్తి యుక్తులను వెచ్చిస్తూ ప్రచారం చేస్తున్నది 'మేక్ ఇన్ ఇండియా', జన్-ధన్ యోజనల గురించేనన్నది చూస్తున్నాం. భారత దేశానికి వరుసగా వస్తున్న దేశం తర్వాత దేశం నేతలందరితో మోదీ 'మేక్ ఇన్ ఇండియా' గురించే కలలు కంటున్నాడు. అదే విధంగా దేశం తర్వాత దేశం విదేశీ పర్యటనలు చేసి వచ్చిన మోదీ ఎక్కడికి వెళ్ళినా, అక్కడి నాయకుల, వ్యాపార, పారిశ్రామికరంగ ప్రతినిధుల ముందు తన స్వప్నాలను పరుస్తున్నాడు. ఇంతే కాదు 2014 జూన్ నుంచి ఇప్పటి వరకూ మోదీ ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాలన్నీ 'ఫస్ట్ డెవలప్ ఇండియా' అంటూ భారీ విదేశీ పెట్టుబడులను దేశానికి ఆహ్వానించే దిశలోనే ఉన్నాయి. 'సత్యమేవ జయతే' బాణీలో 'శ్రమేవ జయతే' అంటూ శ్రమను ఆకాశానికెత్తుతూ శ్రామికుల హక్కులను అణచివేస్తూ చేపడుతున్న నిర్ణయాలే కావచ్చు లేదా భూ అధిగ్రహణ చట్టంలో చేసిన భారీ మార్పులే కావచ్చు అన్నీ విదేశీ, దేశ ఘరానా పెట్టుబడులకు బార్లా దారులు తెరుస్తున్నాయి. విదేశీ, ప్రైవేటు పెట్టుబడులన్నీ మనదేశ అభివృద్ధికి సోపానాలంటూ మోదీ తన ఉపన్యాసాలతో శ్రోతలను మంత్రముగ్ధులను చేస్తున్నాడు. ఇకపోతే జన్-ధన్ యోజనను ముందుకు తెచ్చి, జనవరి-26 నిర్ణీత తేదీలోగా సునాయాసంగా టార్గెట్‌ను అధిగమించామనీ, పదకొండున్నర కోట్లకు పైగా బ్యాంకు ఖాతాలు తెరచుకొన్నాయని, దేశంలో 98 శాతం ప్రజలు బ్యాంకులతో సంబంధంలోకి వచ్చారనీ మోదీ ఎంతగానో సంబరపడి పోతున్నాడు. పేద ప్రజలు కడుపులు కట్టుకొని కూడబెట్టుకునే చిన్న-చిన్న మొత్తాలను సైతం బ్యాంకు ఖాతాల ద్వారా భారీ తిమింగలాలకు అప్పచెబుతున్నారు. మారుమూల పల్లెలలోని నిరుపేదలకు కాస్తో, కూస్తో అందుతున్న సబ్సిడీల మొత్తాలను కావచ్చు, లేదా అడవుల్లోని ఆదివాసీలు శ్రమించి సంపాదించుకునే తునికాకు కూలి డబ్బులపై ప్రభుత్వం చెల్లించే బోనస్ డబ్బులే కావచ్చు అన్నీ ఇపుడు బ్యాంకులతో ముడిపడిపోయాయి. బ్యాంకు నిల్వల్లో చాలా వరకు ఫైనాన్షియల్ పెట్టుబడుల అవసరాలనుతీర్చడానికే పోతాయనీ ప్రాథమిక అర్థశాస్త్ర విషయాలు అర్థమైనవారికి సైతం బోధపడేదే! స్మార్ట్ సిటీలు, బుల్లెట్ ట్రయిన్‌లు మొదలైన మోదీ పథకాలన్నీ సంపన్నులకు మరింత విలాసవంత జీవితాలను, పెట్టుబడిదారులకు అపార లాభాలను పండించేవేనన్నవి స్పష్టం. గత రెండున్నర దశాబ్దాలుగా దేశంలో ఏయేటికాయేడు తీవ్రమవుతున్న ప్రపంచీకరణ, సరళీకరణ, ప్రైవేటీకరణ- నూతన ఆర్థిక విధానాలు- దేశంలోని విలువైన ప్రకృతి సంపదలను, మానవ శ్రమశక్తిని చిత్తానుసారంగా దోచేస్తూ, దేశ, విదేశీ పెట్టుబడిదారుల బొక్కసాలను నింపేస్తున్నాయి. అనేక ప్రభుత్వ రంగాలలోకి వేగంగా ప్రైవేట్ పెట్టుబడులు వచ్చి చేరుతున్నాయి. పబ్లిక్ పరిశ్రమలను కారుచౌకగా ప్రైవేట్ పెట్టుబడిదారులకు అమ్మేస్తున్నారు. ఇలా గత 8 మాసాలుగా మోదీ చెప్పే ఏ 'మన్ కీ బాత్' (మనసులోని మాట) అయినా, చేపట్టే ఏ చర్య అయినా భారీ పెట్టుబడులకు వూడిగం చేసే ఆయన నైజాన్నే చాటుతున్నాయన్నది తెలుసుకోవాలి. ఇక ఆయన చెప్పే సుపరిపాలన అంతా దేశ ప్రజలను ప్రపంచ మార్కెట్‌కు బలి పెట్టడమే!

15 మార్చ్ 1950కు ఏర్పడి 1951 నుంచి ఇప్పటి వరకు 12 పంచవర్ష ప్రణాళికలు, 6 వార్షిక ప్రణాళికలను దేశ ప్రజల ముందుంచిన ప్లానింగ్ కమీషన్‌ను మోదీ ఒక్క కలం పోటుతో రద్దు

చేసి 'నీతి ఆయోగ్'ను ఏర్పర్చాడు. అందుకుతాను దేశ ప్రజలకు చెప్పిన ఏకైక కారణం కింద నుంచి ప్రభుత్వ విధానాలను తయారు చేసే లక్ష్యంతో దానిని మారుస్తున్నట్లు అంటే ప్రజల భాగస్వామ్యం పెంచే బుద్ధి ఉన్నట్లుగా ప్రకటించాడు. కానీ వేద కాలంలోనే టెస్ట్‌ట్యూబ్ బేబీలను, పుష్పక విమానాలను సృష్టించే మోదీకీ అప్పట్లో మునీశ్వరులు తల కిందకి కాళ్ళు పైకి పెట్టి తపస్సులు చేసే వారనడంలో కూడా నమ్మకం ఉండాలి. ఇప్పుడు ఆయన కూడా అలాగే ఆ జీవితాంతం తపస్సు చేసినా ప్రభుత్వ విధానాల రూపకల్పనలో ప్రజల భాగస్వామ్యం అంటే తివిరి ఇసుమున తైలంబు తీయడం లాంటిదేననీ ఆయన పైనుంచి ప్రారంభించిన స్వచ్ఛ భారత్, ఆదర్శ్ గ్రామ్ యోజన, జన్ ధన్ యోజనలు ఆయనను తప్ప ఆమ్ ఆద్మీని రంజింప చేయలేవేమో! నిజంగా ప్రజల నుంచి ప్రభుత్వ విధానాలను, ప్లానింగ్‌ను రూపిందించడం జనతన సర్కార్లకే సాధ్యం. అవి కేవలం అవి మాత్రమే అలా చేయగలవు.

గతంలో దేశంలోని బడా బ్యాంకులను జాతీయకరణ చేసే సందర్భంగా 1969లో అప్పటి ప్రధాని ఇందిర బ్యాంకుల్లో జమయ్యే ప్రజాధనం కార్పొరేట్ సంస్థల ప్రయోజనాలకు వినియోగించ బడుతుందని స్పష్టంగానే చెప్పింది. 56 ఇంచుల ఛాతి గల మోదీకి 45 సంవత్సరాల తర్వాత 2015లో ఆ మాట చెప్పాలంటే 90 ఇంచుల ఛాతి ఉన్నా సరిపోదేమో! ఇప్పటికే 'భారతదేశంలోని అతి భారీ 500 మంది బ్యాంకు రుణగ్రస్తులలో 82 మంది బడా పెట్టుబడిదార్లు తీవ్ర సంక్షోభంలో మునిగి కొట్టుమిట్టాడుతున్నారు. మరో 83 మంది ఆ అంచుల్లో ఉన్నారు. బ్యాంకులు వారి అప్పులను బ్యాడ్ లోన్స్‌లో జమచేసాయి. అంటే ఇక వారు బ్యాంకులకు తాము తీసుకున్న కోటానుకోట్ల రూపాయల రుణం తిరిగి చెల్లించరన్నమాట! అంటే నేతల హామీలు విని బ్యాంకులలో ఖాతాలు తెరిచిన పేద ప్రజలంతా డబ్బును నష్టపోవాల్సిందే! ఏ బ్యాంకు అధికారో, రాజకీయ నాయకుడో చిల్లి పైసా కూడా నష్టపోయేది ఉండదు. అసలు ఈ దేశ బూర్జువా రాజకీయ నాయకులు ప్రజలకు చచ్చినా నిజాలు చెప్పరు. అటు కేంద్రంలో ప్రధాని మోదీ గానీ, ఇటు ఛత్తీస్‌గఢ్ రాష్ట్రంలో ముఖ్యమంత్రి రమణుడు గానీ 'మేక్ ఇన్ ఇండియా', 'మేక్ ఇన్ ఛత్తీస్‌గఢ్' అంటూ పెట్టుబడిదార్లను ఆహ్వానిస్తున్నారు. కానీ వారికి డబ్బేది! ఇప్పడికే సంక్షోభం పాలైన కుబేర పరిశ్రమాధిపతులకు ప్రభుత్వాలు 'బేలవుట్' పేరుతో పుష్కలంగా డబ్బులు అందివ్వకపోతే చతికిలబడ్డ వాళ్ళంతా లేవలేని పరిస్థితిలోనే ఉందురు. ఇక వాళ్ళు కొత్తగా పరిశ్రమలు ఎలా తెరుస్తారు? వాళ్ళంతా ప్రభుత్వాల వైపే జలగల్లా చూస్తున్నారు. అందుకే ప్రభుత్వాలు తీపి తీపి మాటలతో ప్రజలను వాళ్ళు కడుపు కట్టుకొని దాచుకున్న పాతిక, పరక చిన్న మొత్తాలను సైతం బ్యాంకుల ద్వారా కుబేరులకు చేర్చే కుట్రలకు దిగాయి. వాటికి నగిషీలు చెక్కిన భాషను అలంకరిస్తూ, దేవేంద్ర ఫఢ్నవీస్ మేక్ ఇన్ విదర్భ అంటున్నాడు. ఇక పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి 'ఫైర్ బ్రాండ్' మమత తన రాష్ట్రం వచ్చే పెట్టుబడిదార్లకు ఏకంగా పాదాభిషేకం చేస్తాననంటుంది. ఇక కొత్త రాష్ట్రం తెలంగాణ ముఖ్యమంత్రి నోరు తెరిస్తే, బొందపెడుతూ, చంపెస్తా, మెడలు విరుస్తానంటూ కన్నూ మిన్నూ కానకుండా ఎవరిమీదనైనా నోరు పారేసుకునే పరమ ఫ్యూడల్ దొర కేసీఆర్ సైతం బంగారు తెలంగాణా అంటూ ప్రజలను మురిపించేస్తూ ప్రపంచ పెట్టుబడుల ముందు సవినయంగా తోకాడిస్తున్నాడు. వీరందరికీ దేశంలోని దట్టమైన అడవులు, అడవుల్లోని అపార ప్రాకృతిక సిరిసంపదలు కన్నుకుడుతున్నవి. వీటి అమ్మకాలే వీరి ధ్యేయం. అంతర్జాతీయ పెట్టుబడిదారులు, దేశ దళారి పెట్టుబడిదారుల ప్రయోజనాలను నెరవేర్చటమే వారిక్కావలసింది. కానీ వాటిలో చాలా వరకు మావోయిస్టు ఉద్యమ ప్రాంతాలుగా, ఎర్ర ప్రతిఘటనా ప్రాంతాలు లేదా గెరిల్లాజోన్‌లు అలాగే గెరిల్లా జోన్‌లలో గెరిల్లా బేసులుగా ప్రజా యుద్ధ కేంద్రాలుగా నిలిచాయి.

2002లో గుజరాత్‌లో నరమేధం కొనసాగించి వచ్చి ఫాసిస్టు మతోన్మాదిగా ప్రపంచ ప్రజలకు పరిచయమైన మోదీ 2015లో గుజరాత్ వైబ్రంట్ నిర్వహించి, లక్షల కోట్ల పెట్టుబడులు రానున్నాయంటూ ఊరిస్తున్నాడు. కానీ ఆ పెట్టుబడులు దేశ సహజ సంపదలను సర్వనాశనం చేస్తాయి. ప్రజల జీవితాలను కడతేరుస్తాయి. దేశంలో 1947 విభజన నుంచి ఇప్పటి వరకూ జరిగిన అన్ని నరమేధాలను తలదన్నే రీతిలో వైబ్రంటులు తయారవుతాయి. మూడు రోజుల భారత పర్యటనకు వచ్చిన ఒబామా ఇక్కడి కాలుష్యాన్ని భరించలేనంటూ తన వెంట ఆక్సిజన్‌ను తెచ్చుకోవటం చూస్తే, మిథైల్‌ఐసోసైనేట్ (మిక్) గ్యాస్‌తో వేలాది మంది భారత ప్రజల ప్రాణాలను బలిగొన్న అమెరికన్ యూనియన్ కార్బయిడ్ - భోపాల్ గ్యాస్ దుర్ఘటన లను తలదన్నే రీతిలో కూడంకుళంల సరసన మోదీ తాజా ఒప్పందాల ఫలితంగా సామ్రాజ్యవాదుల దజనుల కొద్ది అణు రియాక్టర్‌లు చేరి పర్యావరణ కాలుష్యం అత్యంత ప్రమాదకర స్థాయికి చేరి దేశ పొరుగు దేశాల ప్రజల జీవితాలను అతలాకుతలం చేయకమానవు. ఇవన్నీ ఒప్పందాలు మోదీ సామ్రాజ్యవాదుల, ప్రత్యేకించి అమెరికా సామ్రాజ్యవాదుల శ్రేయస్సు కోసం చేస్తున్నాడన్నది నిజం. గత కొన్ని సంవత్సరాలుగా 1930ల గ్రేట్ డిప్రెషన్‌ను తలపింప చేసే రీతిలో తీవ్ర ఆర్థిక, ద్రవ్య సంక్షోభంలో కొట్టుమిట్టాడుతోన్న నేటి అమెరికా, యూరప్ సామ్రాజ్యవాదులకు ఆనాటి హిట్లర్‌లా అమెరికాలో ఒక ఒబామా అవసరమైతే, ఇండియాలో ఒక మోదీ అవసరమయ్యాడు. ఇండియాలో ఉన్న వనరులు, ఇండియా మార్కెట్ విస్తరణ, ఇండియాలో యువశక్తి వారెరుగనిది కాదు. వారిని తమ హైపర్ ఇన్‌ఫ్లేషన్ నుంచి బయట పడేయడానికి ఇవన్నీ వారి సొత్తు కావాలంటే వారికి ఇప్పుడు మోదీని మించిన వాడు మరొకడు మన దేశంలో లేడనుకున్నారు. కూటమి ప్రభుత్వాలతో కులకలేకపోయి చతికిలబడిన మన్‌మోహనుడి పరిస్థితీ, కాంగ్రెస్ దుస్థితి ఒక వారికి ఎంత మాత్రం సరిపడదనుకున్నారు. అందుకే వారు ఒబామాకు దాదాపు సరితూగే విధంగానే 16వ లోక్‌సభ ఎన్నికల్లో డబ్బును ప్రవహింపచేసి మోదీని గెలిపించారు. 2012లో అమెరికా ఎన్నికల్లో గెలవడానికి డెమోక్రటిక్ పార్టీ అభ్యర్థి అయిన ఒబామా 98 కోట్ల 60 లక్షల డాలర్లు ఖర్చు చేసినట్టు అధికారికంగా అక్కడ ప్రకటించారు.

16వ లోక్‌సభ ఎన్నికల బరిలో మోదీని గెలిపించడానికి దేశ దళారీ పెట్టుబడిదారులు అదానీలు, అంబానీలు, ఎస్సార్‌లు, టాటాలు, జిందాల్‌లు ఇంకెందరెందరో ముందుకు వచ్చారు. వారంతా మోదీతో గుజరాత్‌లో ఎంతో లబ్ధి పొందిన వారే. గుజరాత్‌లో 50 లక్షల నుంచి ఒక కోటి వరకు ఎకరం భూమి విలువ చేస్తున్న చోట మోదీ తన పదవిని దుర్వినియోగం చేసి అంబానీకీ, అదానీకీ అక్షరాలే ఒకే ఒక్క రూపాయికి ఎకరం భూమి అప్పగించాడు. మోదీ గుజరాత్‌లోని కచ్ జిల్లాలో 14 వేల 306 ఎకరాల భూమినీ తన ప్రియమైన అదానీకి రూపాయి నుంచి 32 రూపాయలకు ఒక చదరపు మీటరును అప్పగించాడు. నిజానికి ఆ ప్రాంతంలో పారిశ్రామిక అవసరాల కోసం ప్రతి చదరపు మీటర్‌కు మార్కెట్ ధర 315 రూపాయలు. వ్యాపార అవసరాల కోసం 157 రూపాయలకు అమ్ముడవుతోంది. కానీ మోదీ వారిని ఎంత నగ్నంగా దోపిడికి గురి చేసాడో అది అనుభవించిన ముంద్రా వాసులను అడగాలి. 2001లో గుజరాత్‌కు మోదీ ముఖ్యమంత్రి అయినపుడు ఆ రాష్ట్ర రుణం 26 వేల కోట్లుండింది. అది 2014 వచ్చేసరికి 189 లక్షల కోట్లకు పడగలెత్తి గుజరాత్‌లో సామాన్యుని జీవితాన్ని దుర్భరం చేస్తున్నది. పశ్చిమ బెంగాల్‌లో వెల్లువెత్తిన ప్రజా వ్యతిరేకతతో సింగూర్ నుంచి తోకముడిచిన నానో కార్ల టాటాకు ఉన్న ఫలంగా గుజరాత్‌లో అన్ని వసతులతో నానోను ప్రతిష్ఠింప చేసాడు. గుజరాత్‌లో నరమేధం సృష్టించి ఆపైనా ఇలాంటి అభివృద్ధి చేసినవాడు మోదీ. ఇదీ మోదీ తరహా అభివృద్ధి. 56 అంచుల ఛాతీ అంటూ తన రసవత్తర ప్రసంగాలతో, తిమ్మిని బమ్మిని చేసే మోదీ 'మేక్ ఇన్ ఇండియా' కోసం ఏమైనా చేయగలడు. భారతదేశ షేర్ మార్కెట్‌లో వేగంగా పెరుగుతోన్న షేర్ల విలువలను 1977 నుంచి వరుసగా ప్రతి పదేళ్ళకొకసారి ఎదురవుతున్న 'క్రాష్'లు, గాలిబుడగల పేలుళ్ళ నేపథ్యంలో చూస్తేనే వాటి ప్రమాద సూచికలు అర్థమవుతాయి. కామ్రేడ్ చెరబండ రాజు తన వందేమాతరం గీతంలోని చరణాలను మనం కొంత మార్చుకుంటే, అంతర్జాతీయ విపణిలో అంగాంగం అమ్మకానికి పెడుతున్న మోదీ దేశ ప్రధాని కాదు, సామ్రాజ్యవాదులకు, దళారీ బూర్జువాలకు ప్రధాన సేవకుడన్నది అర్థమవుతుంది. (1977లో ఫైనాన్షియల్ బుడగ, ఫలితంగా 1987లో క్రాష్, 1997లో ఆగ్నేయాసియా దేశాల్లో క్రాష్, 2007 చివర్లో సబ్‌ప్రైమ్ క్రైసెస్ మొ॥ ఎదురయ్యాయి.)

చరిత్ర తెలిసిన వారికి మోదీకీ, హిట్లర్‌కు గల దగ్గరి పోలికలు తప్పక అర్థం అవుతాయి. వారిరువురి స్వస్తిక్ గుర్తు నుంచి, 'బ్రహ్మచర్యం', రసవత్తర ప్రసంగాలు, హిట్లర్ జాత్యాహంకారం- మోదీ మతోన్మాదం, హిట్లర్ గ్యాస్ ఛంబర్లు, కెటిల్ కార్లు, డెత్ మార్చ్‌లు, కాన్‌సంట్రేషన్ క్యాంపులు- మోదీ బెస్ట్ బేకరీ కాండ్‌లు, త్రిశూల వధలు, సునితీల నతిఖీలతో హత్యలు, హిట్లరెరుగని రీతిలో మహిళలపై హిందూ మతోన్మాదుల అత్యాచారాలు, ఇలా అనేక విషయాలలో చాయ్ వాలా మోదీ, కాషాయ ప్రచారక్ మోదీ బాల్యంలో అనాథ హిట్లర్‌ను, ఆ తర్వాత ఫాసిస్టు హిట్లర్‌ను ఎంతగానో పోలి ఉన్నాడు. హిట్లర్ ఫాసిజానికి ఎర్రసైన్యం అంతం పలికిన 70వ వార్షికోత్సవాలను ప్రపంచం ఈ సంవత్సరం జరుపుకుంటున్న వేళ ఎర్రసైన్యానికీ, ఐక్యసంఘటనకూ గల ప్రాధాన్యతను లోతుగా అర్థం చేసుకోవలసిన అవసరం ఉంది. 'షైనింగ్ మోదీ' జగత్ప్రసిద్ధమవుతున్న శునక సేవల వివరాలు అంతర్జాలంలో కుప్పలు తెప్పలుగా పడి ఉన్నాయి. వాటిని పీడిత జన పక్షపాతంతో మరో మాటలో వర్గ దృష్టితో, నిజమైన దేశభక్తితో చూస్తే మోదీ పాలనలో దేశం వినాశనం వైపు ఎలా పరుగులు తీస్తుందో అర్థమవుతుంది. ఈ దేశ స్వాతంత్ర్యం, గణతంత్రం ఎంత బూటకమో, మోదీ చెపుతున్న దేశ ప్రజల అభివృద్ధి అంతే మోసపూరితమైంది. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో ఓటు వేయడంతోనే ఓటర్ పాత్ర ముగుస్తుంది. మరో ఐదేళ్ళు వేచి ఉండి మళ్ళీ ఎన్నికలలో ఓటు వేసి మరో దోపిడీదారుణ్ణి ఎన్నుకోవాలి. ఓటరుకున్న స్వేచ్ఛ అంటే ఎవడినో ఒకడిని దోపిడీదారుణ్ణి ఐదేళ్ళకొకసారి ఎన్నుకోవడం మేరకేనన్నది తేలిపోయిన సత్యం! మోదీ ప్రజాస్వామ్యం అంటే దోపిడీ వర్గాల నియంతృత్వమే! దోపిడీ వర్గాల పాలన అంటే మరో మాటలో భూస్వామ్య, దళారీ నిరంకుశ పెట్టుబడిదార్ల పాలనే. ఈ రెండు వర్గాలకు సామ్రాజ్యవాదుల, ప్రత్యేకించి అమెరికా సామ్రాజ్యవాదుల పూర్తి అండదండలున్నాయి. మన దేశాన్ని వారు అప్రత్యక్షంగా దోపిడీకి గురిచేస్తూ,పాలిస్తూ నియంత్రిస్తున్నారు. ఇలాంటి దోపిడీ శక్తులకు మన దేశంలో జరుగుతున్న సోకాల్డ్ గణతంత్ర దిన వేడుకలలో పాల్గొనే కనీస నైతిక హక్కు కూడా లేదు. ఈ దోపిడీ వర్గాల పాలనను అంతమొందించి ప్రజల ప్రజాస్వామ్యాన్ని మరో మాటలో కార్మిక-కర్షకుల నియంతృత్వాన్ని నెలకొల్పడానికి మన దేశంలో గత నాలుగున్నర దశాబ్దాలుగా నూతన ప్రజాస్వామిక విప్లవం కొనసాగుతున్నది. అందులో భాగంఆ గత రెండు దశాబ్దాలుగా మన దేశంలో ప్రత్యామ్నాయ ప్రజా రాజ్యాధికార అంగాలు ఏర్పడి పని చేస్తున్నాయి. ఇవి మన దేశంలోని పలు రాష్ట్రాలలోని గ్రామీణ ప్రాంతంలో ప్రధానంగా ఎర్రసైన్యం (ప్రజా విముక్తి సైన్యం) ఏర్పడి బలపడడానికి పూర్తి అవకాశాలున్న వ్యూహాత్మక ప్రాంతాలలో పలు స్థాయిలలో ఏర్పడి పని చేస్తున్నాయి. ప్రజా రాజ్యాధికార స్థాపనా దినం సందర్భంగా అవి కొనసాగిస్తున్న కృషిని చూద్దాం!

ఫిబ్రవరి 10 ప్రజా రాజ్యాధికార స్థాపనా దినం. దండకారణ్యంలో ఇది భూంకాల్ దివస్‌గా ప్రసిద్ధి చెందిన రోజు. 1910లో బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా స్థానిక ఆదివాసీ ప్రజలు సాయుధ తిరుగుబాటు చేసి, ఫిబ్రవరి 10 నుంచి 40 రోజులు తమ అధికారాన్ని ప్రకటించుకొని కొనసాగించారు. ఆ గొప్ప ప్రజా పోరాట వారసత్వంగా, నేటి ప్రజా రాజ్యాధికార అంగాలు ఆ రోజును స్థాపనా దినంగా పాటిస్తున్నాయి. భారతదేశంలో 2 డిసెంబర్ 2000 నాడు నిర్మితమైన ప్రజా విముక్తి (గెరిల్లా) సేన దానికి అండగా నిలవగా, నాలుగు వర్గాల ఐక్యతను కార్మిక, కర్షక, పెటీ బూర్జువా, దేశీయ బూర్జువా- అది ఎత్తిపడుతుంది. అది దేశంలోని వ్యూహాత్మక ఐక్య సంఘటనకు న్యూక్లియస్‌గా నిల్చింది. అది చేస్తున్న కృషిని తెలుసుకునే ముందు భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) తన కార్యక్రమంలో ప్రజల ప్రజాస్వామిక రాజ్యాధికార, నూతన

ప్రజాస్వామిక ప్రభుత్వపు మౌలిక విధానాన్నీ, బాధ్యతనూ, దాని కర్తవ్యాలనూ వివరంగా పేర్కొంది. ఆ విధాన కార్యక్రమంలోని 8వ పాయింట్ ఈ విధంగా ఉంది:

"అర్ధవలస, అర్ధ భూస్వామ్య ఆర్థిక వ్యవస్థను కూలదోసి దేశ ఆర్థిక, సామాజిక అభివృద్ధికి మార్గ వెయ్యడం, సోషలిస్టు ఆర్థిక వ్యవస్థకు పునాది ఏర్పర్చడం జనతా ప్రజాస్వామిక ఆర్థిక వ్యవస్థ ముఖ్య కర్తవ్యం. కార్మికవర్గ నాయకత్వంలో జనతా ప్రజాస్వామిక నియంతృత్వం కింద పెట్టుబడిదారి విధానం నుంచి సోషలిజానికి మారే పరిణామ క్రమంలో ఉండే సమాజపు ఆర్థిక వ్యవస్థ ఇది.

భూస్వాముల, మత సంస్థల భూములన్నింటినీ స్వాధీనం చేసుకొని "దున్నేవారికే భూమి" ప్రాతిపదికన పేద, భూమి లేని రైతాంగానికీ, వ్యవసాయకూలీలకూ పంచుతుంది. ధనిక రైతుల ఆస్తులను స్వాధీనం చేసుకోదు. రైతాంగం మీద వడ్డీ వ్యాపారుల దోపిడీకి స్వస్తి చెబుతుంది. రైతాంగం చొరవనూ, సామర్థ్యాలనూ వెలికితీస్తుంది. అన్ని రంగాలలో స్వచ్ఛంద సహకార సంస్థలను నెలకొల్పుతుంది. వ్యవసాయాభివృద్ధికి పాటుపడుతుంది. వ్యవసాయం పునాదిగా బలమైన పారిశ్రామికీకరణకు పూనుకుంటుంది.

సామ్రాజ్యవాదులకూ, దళారీ నిరంకుశ బూర్జువా వర్గానికీ చెందిన అన్ని పరిశ్రమలూ, బ్యాంకులూ, ఇతర సంస్థలన్నింటినీ స్వాధీనం చేసుకుంటుంది. ప్రభుత్వం సామ్రాజ్యవాదులకూ దళారీ నిరంకుశ వర్గానికి చెందిన అన్ని పరిశ్రమలనూ, బ్యాంకులనూ, వ్యాపార సంస్థలనూ స్వాధీనం చేసుకుంటుంది. సామ్రాజ్యవాద ఆస్తులన్నింటినీ రద్దు చేస్తుంది. సామ్రాజ్యవాదులతో దోపిడీ ప్రభుత్వం చేసుకున్న అసమాన ఆర్థిక ఒప్పందాలను రద్దు చేస్తుంది.

ప్రభుత్వం దళారీ బడా బూర్జువా వర్గానికి చెందిన సంస్థల పెట్టుబడినీ, స్థిర, చర ఆస్తులన్నింటినీ స్వాధీనం చేసుకుంటుంది. 'పెట్టుబడిపై అదుపు' నియమంపై ఆధారపడి అన్ని గుత్త పరిశ్రమలపైనా, వాణిజ్యం పైనా పాలనాధికారాన్ని చేపడుతుంది.

దీనితో పాటుగా, ఇది వడ్డీ వ్యాపారులు, వ్యాపారస్తుల, షావుకార్ల దోపిడీని అంతమొందిస్తుంది. ప్రజలకు అవసరమైన పెట్టుబడి సమకూరేలా, వ్యాపార వాణిజ్యాలపై నియంత్రణ సాధించేలా సహకార సంఘాలకు ప్రోత్సాహాన్నిస్తుంది.

నూతన ప్రజాస్వామిక ప్రభుత్వం ప్రజా జీవితాన్ని శాసించే స్థితిలో లేనటువంటి పెట్టుబడిదారీ ఉత్పత్తిని అడ్డుకోదు. ప్రైవేటు ఆస్తులను స్వాధీనం చేసుకోదు. చిన్న పరిశ్రమలనూ, మధ్య తరహా పరిశ్రమలనూ అంటేజాతీయ పెట్టుబడిదారీ వర్గ పరిశ్రమలను అదుపు చేస్తుంది. నియంత్రిస్తుంది. సహకార సంఘాల ద్వారా కుటీర పరిశ్రమల, చేతి వృత్తుల అభివృద్ధికి తోడ్పడుతుంది.

పై వ్యవసాయ, వ్యాపార, పారిశ్రామిక విధానాలను అవలంబిస్తూ జనతా ప్రజాస్వామిక సోషలిస్టు ఆర్థిక వ్యవస్థకు మార్గం సుగమం చేస్తుంది."

దేశ ప్రధానమంత్రి మోదీ గారు సెలవిస్తున్న 'మేక్ ఇన్ ఇండియా' కార్యక్రమానికి పైన పేర్కొన్న ప్రజల ప్రజాస్వామిక విప్లవ కార్యక్రమం పూర్తిగా భిన్నమైంది. రెండు కార్యక్రమాలు రెండు వర్గాల ప్రజలకు ప్రాతినిధ్య వహిస్తున్నాయి. నిన్నటి ప్రభుత్వాలేవైనా, నేటి మోదీ ప్రభుత్వమైనా దేశాన్ని సామ్రాజ్యవాదుల, దళారీ నిరంకుశ బూర్జువాల విచ్చలవిడి దోపిడీకి గురి చేసేవే. జనతా ప్రజాస్వామిక ప్రభుత్వ మౌలిక విధానాలు దేశాన్ని, దేశ ప్రజలను కాపాడుకోవడానికి నిలబడుతున్నాయి. జనతా ప్రజాస్వామిక ప్రభుత్వం స్పష్టమైన ప్రత్యామ్నాయ కార్యక్రమాన్ని దేశ ప్రజల ముందు ఉంచుతున్నందున దోపిడీ ప్రభుత్వాలు ప్రజలపైన యుద్ధానికి దిగుతున్నాయి. 1972లో 20 వేల బలగాలతో పశ్చిమ బెంగాల్‌లో చేపట్టిన 'ఆపరేషన్ స్టైపుల్ చేజ్' నుంచి నేడు దాదాపు 5 లక్షల బలగాలతో కేంద్ర, రాష్ట్రాలు కొనసాగిస్తున్న ఆపరేషన్ గ్రీన్ హంట్ వరకు వారు కొనసాగిస్తున్న యుద్ధ చర్యలకు పేరు ఏదైనా కావచ్చు! అవి ప్రజలపైన యుద్ధం చేస్తున్నాయి. నేటి ప్రజల ప్రత్యామ్నాయం నిన్నటి చిదంబరంకు తెలుసు. నేటి రాజనాథ్ సింగ్‌కు తెలుసు. ప్రధానమంత్రి మోదీ, సర్ సంఘ్‌చాలక్ మోహన్ భాగవత్ సహా సమస్త కాషాయ బ్రిగేడ్‌కు ఎరుకే! ఇంకా చెప్పాలంటే, నక్సల్బరీ ఉద్యమ ఆరంభంలోనే ఆనాడు ఉనికిలో ఉన్న రీసెర్చ్ అండ్ పాలసీ (కాజెస్ అండ్ నేచర్ ఆఫ్ అగ్రేరియన్ టెన్షన్స్) చూస్తే, దేశంలో భూ సంస్కరణలను వాస్తవంగా చేపట్టకపోతే అప్పటికే దోపిడీ ప్రభుత్వాలు మహా ఆర్భాటంగా చేపట్టిన సామ్రాజ్యవాద ప్రాయోజిత హరిత విప్లవం ఎర్ర విప్లవంగా మారుతుందని హెచ్చరించింది. అలాంటి హెచ్చరికలు అది ఇంకా చాలా చేసింది. అవన్నీ వీరికి తెలిసినవే! కాబట్టి జనతా ప్రజాస్వామిక ప్రభుత్వ విధానాలలో ఏ రహస్యం లేదు. అందుకే దోపిడీ వర్గాలు వాటిని సాగనివ్వడం లేదు. వాటి నిర్మూలనకై పని చేస్తున్నాయి. మోదీ ప్రభుత్వం ఏర్పడ్డాక దండకారణ్యంలో పెంచిన 'భద్రతా బలగాల' సంఖ్యను చూస్తే బహుశా దేశంలోనే అత్యంత సైనికీకరణ చెందిన ప్రాంతంగా నిల్చిన చోట మొలకెత్తుతున్న విప్లవ ప్రజా కమిటీలు-జనతన సర్కార్లు ఎలా పని చేస్తున్నాయో, ఏ కార్యక్రమాలు చేపడుతున్నాయో తెలుసుకోవాలని పీడిత ప్రజలు ప్రజాస్వామికవాదులు, దేశభక్తులు హృదయ పూర్వకంగా కోరుకుంటున్నారు. గత 35 సంవత్సరాలుగా దేశంలో ఏ సామ్రాజ్యవాద పెట్టుబడికి గానీ, దళారీ నిరంకుశ పెట్టుబడిదార్ల నూతన పరిశ్రమల స్థాపనకు గానీ దారులు లేకుండా అడ్డుకున్న ప్రాంతం దేశంలో బహుశ దండకారణ్యమే కావచ్చు! చిన్న రాష్ట్రం, కొత్తగా ఏర్పడిన రాష్ట్రం, అభివృద్ధి జపం చేస్తున్న రాష్ట్రం, రైలు-రోడ్డు సౌకర్యాలు ఓ మేరకు ఏర్పడి ఉండడం లాంటి పలు అనుకూల పరిస్థితుల నేపథ్యంలో సామ్రాజ్యవాదులు దళారీ నిరంకుశ పెట్టుబడిదారీ వర్గం-టాటాలు, ఎస్సార్‌లు, జిందాల్‌లు, మిట్టల్‌లు సహా ఎందరెందరో- ఛత్తీస్‌గఢ్‌తో చేసుకున్న అనేక వ్యూహాత్మక ఒప్పందాలు ఎన్ని ఉన్నప్పటికీ, అతి విలువైన అపార ప్రకృతి సంపదలను దేశ ప్రజల ప్రయోజనాలను ఆశించి స్థానిక ప్రజలకు చెందిన వాటిని ప్రజాయుద్ధం ద్వారా కాపాడుతున్న ప్రాంతం దండకారణ్యం. మరోవైపు అక్కడి జనతన సర్కార్లు అవి అతి ప్రాథమిక స్థాయిలోనే ఉన్నప్పటికీ చేపడుతున్న ప్రజల మౌలిక జీవన రంగాలలో ప్రధానమైన వ్యవసాయ రంగంలోని కృషిని కూడా చూద్దాం. ☆

(ఇంకా ఉంది)

ప్రసంగ పాఠం:

# వలస కాలంలో బ్రాహ్మణ వ్యతిరేక పోరాటాలు- సాహిత్యం

- రివేరా

స్వేచ్ఛా వాణిజ్య దశ అంతం నుంచి సామ్రాజ్యవాద దశ ఆరంభం వరకూ మధ్య గల కాలాన్ని, సామాజిక ఉద్యమాలు లేక బ్రాహ్మణ వ్యతిరేక పోరాటాలు నడిచిన కాలంగా చెప్పవచ్చు. ఈ పోరాటాన్ని పరిచయం చేసుకోవడం అంటే.. అధికార, ఆధిపత్య సంబంధాలను బద్దలు కొట్టకుండా మనిషి విముక్తి సాధ్యం కాదనే ప్రాథమిక ఎరుకని సాంస్కృతిక, సామాజిక కోణంలో వ్యక్తీకరించిన వందేళ్ల భారతీయ వర్గ పోరాట చరిత్రని చెప్పుకోవడమే అవుతుంది.

సామాజిక ఉద్యమాలను వర్గ పోరాట క్రమంలో కలుపుకొని పోవడం ఎలా అనే చర్చ విస్తృతంగా జరుగుతున్న కాలమిది. దాని పర్యావసానాలనూ తెలుగు సమాజం చవి చూస్తూనే ఉంది. ఈ నేపథ్యంలో బ్రాహ్మణ వ్యతిరేక పోరాటాలను వర్గ పోరాట క్రమంగా అర్థం చేసుకునేందుకు, ఈ పోరాటాలను వాటి వాస్తవిక పునాదిపై నిలబెట్టేందుకు మనం ప్రయత్నించవచ్చా? ఈ ప్రతిపాదనతో నా పాఠం మొదలుపెడతాను.

అతిశయం – తొలి అడుగు!
ఎందుకురా పాపానికి తల వంచుతావు
చూడు చోకాని...
ఎంత ధీమాగా ఆలయంలోకి అడుగుపెట్టాడో
ఎందుకురా సిగ్గు!
ఎందుకలా దూరంగా ఉంటావు
నువ్వు చోకాకి వారసుడివి..
గుడిలోకి పోవడానికి ఎందుకురా భయం!
ఒక ధీరుడిలా కదిలి రా..
మనమిద్దరమూ కలిసి వెలిని వెలి వేద్దాం!!

19వ శతాబ్దంలో సాంఘిక విముక్తి కోసం పోరాడుతున్న అతి శూద్రులకు స్ఫూర్తిగా నిలిచినవాడు చోకామేలా. ఆయన 14వ శతాబ్దంలో జీవించాడు. పుట్టుక రీత్యా అతి శూద్రుడు. వేదాలను పఠించడమే కాదు.. విన్నా ప్రాణాలు తీసే కాలంలో ఆయన తన పాండిత్యంతో హైందవ బ్రాహ్మణ వర్గాలను సైతం మెప్పించాడని, అంత్య దశలో సన్యాసం స్వీకరించారని చెబుతారు. భారతదేశంలో 19వ శతాబ్దంలో అంటే వలస పాలన కాలంలో సామాజిక ఉత్థానం కోసం అంతటా ప్రయత్నాలు జరిగినప్పుడు.. చోకా వంటివారు సాంస్కృతిక ప్రతీకలుగా ముందుకొచ్చారు. మహారాష్ట్రలోని అతి శూద్రులైన మహర్లు, చమన్లు, మాంజీలకు సంత్ సంప్రదాయానికి చెందిన చోకా ప్రతీక అయినట్టే, ఈ సమాజంలోని శూద్రులైన మాలీలు, కున్బీలకు, కేరళలోని నాయర్లకు బలి చక్రవర్తి; తమిళ, తెలుగు ప్రాంతాల్లోని నాయకర్లు, కమ్మ, రెడ్డి వెలమలకు రావణాసురుడు, నరకాసురుడు వంటి పురుణ పురుషులు స్ఫూర్తిగా నిలిచారు. బలి చక్రవర్తిని గుర్తు చేసుకుంటూ కేరళలో ఇప్పటికీ ఓనం పండుగని జరుపుకుంటారు. సామాజిక అణచివేత, అంటరానితనాన్ని నిరసిస్తూ సాగిన బ్రాహ్మణ వ్యతిరేక పోరాటాలకు.. ఈ పురాణ, చారిత్రక ప్రస్తావనలతో తాత్విక మమేకత ఉంది. తమ సాంఘిక విముక్తిని హిందూ బ్రాహ్మణ సమాజంలో భాగంగానే సాధించాలని ఆయా ఉద్యమాలు భావించడమే దీనికి కారణం. ఈ చట్రం మీదే బ్రాహ్మణ వ్యతిరేక పోరాటాల నిర్మాణం జరిగింది. 1935లో బీఆర్ అంబేద్కర్ ముందుకొచ్చి.. హిందూమతం నుంచి బయటకు రండని, దేవాలయ ప్రవేశాల కోసం కాదు.. చెరువుల్లోకి దిగేందుకు ఉద్యమించండని పిలుపునిచ్చేవరకూ ఈ చట్రం ఇరుసుగానే పోరాటాలు జరిగాయి. బీఆర్ అంబేద్కర్ కృషిలోని ప్రధాన అంశం ఇదే. గొప్ప ఐతిహాసిక, చారిత్రక సమర్థనలుగా చెలామణిలోకి వచ్చిన అన్ని అతిశయాలను ఆయన కొట్టేశాడు. ఆధునిక ప్రజాస్వామిక భావనలతో, ముఖ్యంగా హక్కుల చైతన్యంతో సామాజిక పరిణామాన్ని పున:నిర్వచించి, ఉద్యమాలను పున:నిర్మించాడు. నిజానికి, ఈ కృషి మహాత్మా జ్యోతిరావు పూలేతో మొదలై అంబేద్కర్ కాలానికి

ఊపందుకున్నది. అందువల్లనే గౌతముడు, కబీర్‌తో పాటు పూలేని తన గురువుగా అంబేద్కర్ ప్రకటించుకొన్నాడు.

## ఏమిటీ బ్రాహ్మణ వ్యతిరేకత?

సంఘ సంస్కరణ ఉద్యమానికి కొనసాగింపుగా ముందుకు వచ్చిన బ్రాహ్మణ వ్యతిరేక పోరాటాలకు ఆద్యుడు మహాత్మా జ్యోతిరావు పూలే. భక్తి ఉద్యమాలు ముందుకు తెచ్చిన సంత్ సంప్రదాయాన్ని, సంఘ సంస్కరణ ఉద్యమాలు పైకి తీసుకొచ్చిన హిందూ సంస్కరణ ధోరణిని కలబోసుకొని పూలే నాయకత్వంలో మహారాష్ట్రలో, చెట్టంపి స్వామికల్ సారథ్యంలో కేరళలో బ్రాహ్మణ వ్యతిరేక పోరాటాలు జరిగాయి. బ్రాహ్మణ వ్యతిరేక పోరాటాలు ఒక ప్రత్యేక సందర్భంలో, ఒక స్పష్టమయిన కాలవధిలో జరిగిన పోరాటాలు. రాజ్యంలో అధికారమూ.. సామాజిక వ్యవహారాలపై ఆధిపత్యమూ.. రెండింటినీ చెలాయించిన హైందవ బ్రాహ్మణ వర్గంపై ఎక్కుపెట్టిన ప్రత్యేక పోరాటాలివి. మహారాష్ట్రలోని మాలీలు, కున్బీలు, కేరళలో నాయర్లు తదితర శూద్ర కులాలు.. తమ కులాలకు సమాజంలో న్యాయంగా దక్కాల్సిన గౌరవ మన్ననల కోసం గొంతెత్తాయి. మాలీ కులానికి చెందిన పూలే, నాయర్ కులానికి (తల్లి వైపు) చెందిన స్వామికల్ ఉద్యమ నాయకులుగా ముందుకొచ్చారు. మహారాష్ట్రలో భట్‌జీలు–షేట్‌జీలు, కేరళలో నంబూద్రీలకు వ్యతిరేకంగా ఈ నాయకులు రాజీ లేని పోరాటం సాగించారు. బాధలు పడుతున్న కులాల నుంచే నాయకత్వం రావడం, పాలకవర్గాల అధికారాన్ని, ఆధిపత్యాన్ని నేరుగా

గురి చూడటం అనే లక్షణాల వల్ల.. ఈ ఉద్యమం సంఘ సంస్కరణల దశను విజయవంతంగా దాటేసింది. ఆలోచన, ఆచరణ.. రెండింటిలో శాంతియుత, సామరస్య ధోరణిని ప్రకటించిన సంఘ సంస్కరణల కుబుసాన్ని చాలావరకూ బ్రాహ్మణ వ్యతిరేక పోరాటాలు విసర్జించగలిగాయి. ఈ పోరాట నాయకత్వం ఆలోచనల్లో తిరుగుబాటుతత్వాన్ని, ఆచరణలో అహింసాయుత, సహాయ నిరాకరణ పద్ధతులను అనుసరించింది. అప్పటికే భారతీయ ఆర్థిక రంగంపై పట్టుని సాధించే ప్రయత్నాల్లో ఉన్న వలస పెట్టుబడి, ఈ ప్రయత్నాలకు నేపథ్యాన్ని సమకూర్చింది.

## సంఘ సంస్కరణ - స్వేచ్ఛా వ్యాపార దశ

16వ శతాబ్దంలో పోర్చుగీసు వర్తకుడు వాస్కోడిగామ అడుగుపెట్టడంతో భారతదేశంలో వలసపాలన ఆరంభమయింది. నిజానికి, అప్పటికే మనదేశానికి ప్రపంచ దేశాలతో మారక సంబంధాలు ఉన్నాయి. వర్తక సముదాయంలోని ఒక సెక్షన్ దళారీ పాత్రని పోషిస్తోంది. ఒక ప్రాంతంలో మారకం జరపగా.. ఇంకా మిగిలిపోయిన వ్యవసాయ ఉత్పత్తులను మరో ప్రాంతానికి తీసుకెళ్లి అమ్మకాలు జరిపే వ్యవస్థగా.. దళారి వ్యవస్థ ఉనికిలోకి వచ్చింది. వందలాది బండ్ల మీద ఉత్పత్తులను నింపుకొని ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి ప్రయాణించే వీరి నుంచి స్థానిక రాజులు రహదారి సుంకాలను భారీగా వసూలు చేసేవారు అలాగే, దారిలో బందిపోట్లు దాడులు చేయకుండా వీరు సొంత సైన్యాలను పోషించేవారు. దానికికూడా, సుంకాలు చెల్లించాల్సి వచ్చేది. దీనివల్ల స్థానిక రాజులకు, దళారీలకు మధ్య వైరుధ్యం ఏర్పడింది. ఈ వాతావరణంలో స్థానిక దళారుల సహకారంతో ముందు పోర్చుగీసు.. అనంతరం డచ్, ఫ్రెంచీ, బ్రిటన్.. ఇలా ఒక్కొక్కటిగా యూరోపియన్ వర్తక కంపెనీలు రావడం ఆరంభమయినది. ఐరోపాలో పెట్టుబడిదారీ వ్యవస్థ వికసనంతో వర్తక నియమాలు, సంప్రదాయాలు మారి.. స్వేచ్ఛా వ్యాపార దశకు దారితీసింది. దీనివల్ల మారిన రాజకీయార్థిక సన్నివేశంలో ఒక్క బ్రిటిష్ వర్తక కంపెనీ తప్ప తక్కిన దేశాల కంపెనీలేవీ నిలదొక్కుకోలేకపోయాయి. 1750ల్లో కలకత్తా నవాబు సిరజుద్దౌలాను ఓడించడంతో బ్రిటిష్ వలస పెట్టుబడికి మనదేశంలో బీజం పడింది. 1799లో మైసూర్ చక్రవర్తి టిప్పు సుల్తాన్ హత్యతో ఈ క్రమం ఒక ముఖ్యమైన దశకు చేరుకుంది. స్వయం గ్రామీణ నిర్మాణాలతో ఏ రోజు తిండిని ఆ రోజు సంపాదించుకొనే పరస్పర ఆధారిత గొలుసుకట్టు సంబంధాలతో అతి ప్రాథమిక దశలో అప్పటికి ఉత్పత్తి శక్తులు ఉన్నాయి. దీన్నే ముకుళిత ఆర్థిక వ్యవస్థ అని కారల్ మార్క్స్ నిర్వచించారు. అలాంటి వ్యవస్థను మార్కెట్ ఆధారిత ఆర్థిక వ్యవస్థగా మలిచే ప్రయత్నాలు వలస పాలన కాలంలో జరిగాయి. ఏమిటీ మార్కెట్ ఆధారిత ఆర్థిక వ్యవస్థ? ఉత్పత్తి వ్యక్తిగతం, స్వాయత్తతా

వ్యక్తిగతం అనేది భూస్వామ్య లక్షణం. అంటే, భూస్వామి తన భూములను పనిమనుషులకు అప్పగించి శ్రమ చేయిస్తాడు. పని మనిషి తనకు కేటాయించిన భూమిలో తన కుటుంబ సభ్యులతో కలిసి పంట తీస్తాడు. దాన్ని భూస్వామి సొంతం చేసుకుంటాడు.

అందులో సింహభాగం తాను తీసుకొని, అరకొర స్థానిక ప్రభువులకు పంపిస్తాడు. ఇలా భూస్వామి, ఆయన పరివారం ప్రధాన అవసరాలతో ముడిపడిన గ్రామ అవసరాలు తీరేమేరకే ఉత్పత్తి సంబంధాలు కుదించుకుపోయి ఉంటాయి. కానీ వలస పెట్టుబడి పరిస్థితి వేరు. మార్కెట్ ఆధారితంగా, భారీ ఉత్పత్తి పద్ధతులను అనుసరించాల్సి ఉంటుంది. దానివల్ల ఇలాంటి భూ సంబంధాలు గల సమాజంలో వలస పెట్టుబడి మనలేదు. కాబట్టి.. ఈ స్థితి మారాలి. భూస్వామికి కొంత పోయినా కనీసం మూడో వంతు సంపద తనకు చేరాలి. అప్పుడే తనకొక రూపాయి (అదనపు విలువ) మిగులుతుంది. దీనికోసం భూసంస్కరణలను తీసుకురావాల్సిన అనివార్యత ఏర్పడింది. ఆ అవసరంలోంచి 1802లో కాలన్ వాలీస్ సంస్కరణలను ప్రవేశపెట్టారు. ఈ సంస్కరణలతో కరుడుగట్టిన బ్రాహ్మణ భూస్వామ్య భూ సంబంధాలు కుదుపునకు గురయ్యాయి. ఉత్పత్తి సంబంధాల్లో కదలిక వచ్చింది. కాబట్టి, ఇది భారతీయ సామాజిక చరిత్రలోనే ఒక మైలురాయి! ఈ కాలంలోనే సంఘ సంస్కరణల ఉద్యమం జరిగింది. కారన్ వాలీస్ సంస్కరణల వల్ల బ్యూరోక్రసీ (ఉద్యోగ స్వామ్యం) శక్తిమంతమైంది. రెవెన్యూ, పోలీస్, న్యాయ, పరిపాలన, పోస్టల్ వ్యవస్థలను వేరుచేశారు. వేటికి అవి స్వతంత్ర నిర్మాణాలుగా మారాయి. ఉత్పత్తి సంబంధాలు మందకొడిగా ఉండే భూస్వామ్య వ్యవస్థలో పాలక అంగాలన్నీ ఒక చేతి కిందనే ఉంటాయి. కానీ, వలస పెట్టుబడి ప్రధానంగా భారీ ఉత్పత్తిని, పెద్దఎత్తున అదనపు విలువను తీసే చారిత్రక బాధ్యతకు కట్టుబడింది. కాబట్టి, ఈ అంగాలను తాను ఒక్కతే నిర్వహించలేదు. ఈ పని చేసేందుకు వేరుగా ప్రభుత్వ వ్యవస్థను ఏర్పరిచి.. ఈ అంగాలను వేర్వేరు నిర్మాణాలుగా అభివృద్ధి చేయా ల్సి ఉంటుంది. ఇలా భారతదేశంలో వలస పెట్టుబడి కాలంలో విస్తృతమయిన బ్యూరోక్రటిక్ సంబంధాల్లో భాగం పంచుకోవడం కోసం బ్రాహ్మణ వర్గంలోకి ఒక వర్గం చేసిన ప్రయత్నాలు సంఘ సంస్కరణల ఉద్యమానికి భూమికను ఏర్పాటు చేశాయి. ఈ పరిణామాలతో నష్టపోయిన బ్రాహ్మణ పాలకవర్గంలోని సెక్షన్లు ఒక పక్కన, మార్పును ఆహ్వానించిన బ్రాహ్మణ వర్గంలోని విద్యాధిక సెక్షన్ మరోపక్కన నిలిచాయి. బ్రాహ్మణ ఆధిపత్యానికి చిహ్నాలుగా భావించే బాల్య వివాహాలు, సతీసహగమనం, వితంతువులపై సాంఘిక వివక్ష వంటి ఆచార సంప్రదాయాలపై.. మార్పును ఆశించిన సెక్షన్ తిరగబడింది. రాజా రామ్మోహన్ రాయ్, జస్టిస్ రణడే, దయానంద సరస్వతి తదితరులు ఈ ధోరణికి ప్రాతినిధ్యం వహించారు. కుల వ్యవస్థకు, సామాజిక అసమానతలకు సాధికారికతను కల్పిస్తున్న హిందూ మత ధర్మాన్ని కాక, ఆచరణ పద్ధతిని వీరు అభ్యంతరపెట్టారు. పాశ్చాత్య విద్యా సంస్కారం, యూరోపియన్ నాగరికత ప్రభావంతో సర్వ మానవ సమభావన, మానవ సేవే మాధవసేవ వంటి ఉదాత్త భావనలు ఆర్య సమాజం, బ్రహ్మ సమాజం వంటి సంస్థల ద్వారా, ప్రభాకర్, బ్రాహ్మణ వంటి పత్రికల ద్వారా విస్తృతంగా ప్రచారం పొందాయి. భారతీయ సామాజిక జీవనంలో పునరుజ్జీవనాన్ని కలిగించిన కాలమిది. ఈకాలంలోనే తొట్టతొలి విద్యాధిక వర్గం రంగంపైకి వచ్చింది. ఇంత చేసినా.. హిందూ మత ధర్మంపై మౌలిక విమర్శ పెట్టకపోవడం వల్ల ఈ ఉద్యమం పరిమితులకు లోనయింది. అంతకన్నా ముఖ్యంగా, బ్యూరోక్రసీలో భాగం కావడానికి బ్రాహ్మణ వర్గంలోని ఒక సెక్షన్ చేసిన ప్రయత్నాలకు సామాజిక వ్యక్తీకరణగా ముందుకొచ్చిన ఉద్యమం ఇది. ఆ ప్రక్రియ కాస్త పూర్తయిన వెంటనే

సహజంగానే ఉద్యమమూ

ప్రభావవంత స్థానాన్ని కోల్పోయింది. ఏ పరిమితిని దాటడానికి సంఘ సంస్కరణల కాలంలో విద్యాధిక మేధావి వర్గం వెనుకాముందాడిందో.. దాన్నే ఎజెండాగా చేసుకొని బ్రాహ్మణ వ్యతిరేక పోరాటాలు ముందుకొచ్చాయి.

## కుల నిర్మూలన దిశగా..

చరిత్రలో ఒక ఉద్యమం మరుగు కావడం, ఒక ఉద్యమం ముందుకు రావడం అనేది వ్యక్తుల ఇష్టాయిష్టాలు, వారి సామర్థ్యం, గుణ దోషాలను బట్టి జరగదు. అప్పటిదాకా ప్రగతిశీల పాత్రని పోషించిన ఉద్యమం కనుమరుగు అయ్యేటప్పుడు ప్రగతి నిరోధకంగా వ్యవహరించడం ఎలా చారిత్రక నిర్ణాయక అంశమో, దానిపై విమర్శ ప్రాతిపదికగా మరింత మెరుగైన ఉద్యమం ముందుకు రావడమూ అంతే సహజం. రెవెన్యూ వ్యవస్థను శక్తిమంతం చేయడం కోసం బ్రిటిష్ వలస పాలకులు దేవాలయ ఆస్తులను, పరంపరగా పోగుపడుతున్న నిధులను, గుడి మాన్యాలను స్వాధీనం చేసుకొన్నారు. ఈ చర్యను సంఘ సంస్కర్తలు వ్యతిరేకించారు. హిందూ మత, ధార్మిక వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడంగా దాన్ని వారు చూశారు. "స్థానిక విశ్వాసాలు, సంప్రదాయాల్లో కలగజేసుకోవద్దు" అని జస్టిస్ రణడే బాంబే ప్రావెన్సీ రాజకీయ ప్రతినిధికి లేఖ రాశాడు. హిందూమతంలో అంతర్భాగం అయిన కుల వ్యవస్థలో వేలు పెట్టొద్దని కూడా ఆయన కోరాడు. దీనిపై మహాత్మా జ్యోతిరావు పూలే.. జస్టిస్ రణడేపై తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేశాడు. మంచి స్నేహితులైన రణడే, పూలేల మధ్య ఈ అంశంపై ఉత్తర ప్రత్యుత్తరాలు వాడివేడిగా సాగాయి. శూద్రులను, అతి శూద్రులను కనీసం మనుషులుగా కూడా గుర్తించని కుల వ్యవస్థను కూలదోయకుండా సమాజం ముందుకుపోలేదని పూలే గట్టిగా వాదించాడు. కుల సామాజిక వ్యవహారాల్లో వలస పాలకులు జోక్యం కలిగించుకొని, శూద్రులు, అతి శూద్రులకు సహజ న్యాయాన్ని, హక్కులను కల్పించాలని పూలే కోరాడు. అప్పటికే భార్య సావిత్రి పూలేతో కలిసి ఆయన బాలికా పాఠశాలలను, బ్రాహ్మణ వితంతు శరణాలయాలను, అంటరాని కులాల వారికోసం బడులను నిర్వహిస్తున్నాడు. మిషనరీ స్కూలు చదువుల వల్ల మత విషయాల్లో లౌకికతత్వం అలవడింది. ఇదే కాలంలో.. అమెరికాలో సాగిన బానిస తిరుగుబాట్లు ఆయనలో స్వేచ్ఛా ధోరణిని ప్రేరేపించాయి. 'ఒకే దేవుడు, ఒకే కులం, ఒకే మతం' అనే మిషనరీ, పాశ్చాత్య, ప్రజాస్వామ్య భావనలకు పూర్తి వ్యతిరేక సామాజిక ధర్మాలను ప్రతిపాదిస్తున్న కుల వ్యవస్థని పూలే సహా బ్రాహ్మణ వ్యతిరేక పోరాటవాదులు నిరసించారు. శూద్రులను, అతి శూద్రులను కట్టు బానిసలుగా చూస్తూ, వారిపై సామాజిక అణచివేత, ఆంక్షలను అమలు చేస్తున్న బ్రాహ్మణ పాలకవర్గాలకు సాధికారికతను కల్పిస్తున్న కుల వ్యవస్థపై వారు ఎక్కుపెట్టారు. అందులోభాగంగా కేరళలో నారాయణ గురు అతి శూద్రుల కోసం ఆలయాలను నిర్మించాడు. మహారాష్ట్రలోని ప్రత్యేక పరిస్థితుల వల్ల పూలే ఈ ప్రయత్నాలను మరింత ముందుకు తీసుకెళ్లగలిగాడు.

## తెలుగు నేలపై కాల జ్ఞాన తత్త్వాలు

పూలేను భక్తి ఉద్యమంనాటి భక్త తుకారం తత్త్వాలు ఆకట్టుకున్నాయి. పుష్పాలు భగవంతుడికి అభిషేకించినప్పుడు కన్నా ఆడవారు తలలో తురుముకున్నప్పుడే ఎక్కువ శోభిస్తాయని చెప్పినవాడు భక్త తుకారం. సరిగ్గా అదే కాలంలో తెలుగు సమాజంలో పోతులూరి వీరబ్రహ్మం తత్త్వాలు ప్రచారంలో ఉన్నాయి. సమాజం గతిశీలమనే విషయాన్ని కాల జ్ఞాన తత్త్వాలుగా వీరబ్రహ్మం బోధించాడు. విశ్వ బ్రాహ్మణ కులంలో జన్మించిన ఆయన.. కంసాలి, కొలిమి, వడ్రంగం తదితర చేతివృత్తిదార్ల సమస్యలపై పనిచేశాడు. ఆ కాలంలో కోలార్, కొల్లూరు ప్రాంతాల్లో బంగారం, వజ్రపు గనులు బయటపడ్డాయి. దాంతో బంగారం శుద్ధి, నగల తయారీ పనులకు పెద్దఎత్తున డిమాండ్ ఏర్పడింది. చూస్తే.. ఆ పనులు చేసేవారు గ్రామాల్లో కుల వ్యవస్థ సంకెళ్లలో చిక్కుకొని ఉన్నారు. కంసాలీలతోపాటు, బంగారు వస్తువుల తయారీ పరిశ్రమ అనుబంధ సాధనాలైన కొలిమి, వడ్రంగి పనులు చేసేవారిని ఆ చట్రం నుంచి బయటకు తీసుకురావడం అవసరం అయింది. ఈ క్రమంలోనే వీరబ్రహ్మం ముందుకొచ్చి చారిత్రకంగా అభివృద్ధికర పాత్రని పోషించాడు.

సముద్రాలు పొంగేట్లు, గాలులే కదిలేట్లు చేసే<br>
మహాశక్తి మనిషిలోను ఉంది<br>
నీలోని శక్తిని భక్తితో ధ్యానించు

ఆ దైవ దర్శనము కలిగేనయా.. అంటూ కుల అణచివేత వల్ల తీవ్ర న్యూనతాభావానికి గురవుతున్న చేతివృత్తిదార్లను కార్యోన్ముఖులను చేశాడు. భక్త తుకారంలోనూ మనిషి కేంద్రంగా గల ఇలాంటి అభివృద్ధికర ఆలోచనలే వ్యక్తం అయ్యాయి. జ్యోతిరావు పూలే చివరివరకూ ఇదే అభివృద్ధికర దృక్పథాన్ని ప్రకటిస్తూ వచ్చాడు. అలాగే, ఆన్ లిబర్టీ, హ్యూమన్ రైట్స్ గ్రంథాల పఠనంలోంచి స్వేచ్ఛా భావనలకు ఆకర్షితుడయ్యాడు. బ్రాహ్మణ పాలకవర్గాల సాంస్కృతిక ఆధిపత్యాన్ని చావుదెబ్బతీయడం కోసం శూద్ర చక్రవర్తి ఛత్రపతి శివాజీని ప్రతీకగా నిలిపి.. ప్రత్యామ్నాయ సాంస్కృతిక చరిత్ర రచనకు ప్రయత్నించాడు. మరాఠా సమాజంలో ఈ కాలంలో చోటుచేసుకొన్న కొన్ని పరిణామాలు ఆయన ప్రయత్నాలకు ఉత్తేజాన్నిచ్చాయి.

## పేష్వాల పతనం

1812లో పేష్వాలను ముంబై ప్రావెన్సీ సేనలు ఓడించాయి. భూ, రెవెన్యూ, సామాజిక సంబంధాలపై పట్టు కోసం ఉద్దేశించిన

కారన్‌వాలీస్ సంస్కరణలు ప్రావెన్సీ పరిధిలో బలంగా అమలయ్యాయి. అప్పటిదాకా గంపగుత్తగా ఉన్న రెవెన్యూ, న్యాయ, పోలీస్, కార్యనిర్వాహక, పోస్టల్ వ్యవస్థలను వేటికి వాటిని వేరు చేశారు. దానివల్ల బ్రాహ్మణుల ఆధిపత్యానికి దెబ్బతగిలింది. వందల ఎకరాలను రాజుల నుంచి పొంది శూద్రులు, అతిశూద్రులతో వెట్టి చాకిరి చేయిస్తూ, వసూలు చేసిన ధాన్యం, ఇతర వస్తువుల్లో మూడు వంతులు సొంత గాదెలకు, మిగతాది రాజులకు పంపించేవారు. తోసినట్టు న్యాయం చెబుతూ, తప్పనిపిస్తే శిక్షలు వేస్తూ, ఎవరంటే వారిని పట్టుకొచ్చేందుకు గ్రామ సేవక వ్యవస్థని పోషిస్తూ, సామాజిక ఆధిపత్యం చెలాయించేవారు. ఇప్పుడు వీటన్నింటికీ వేర్వేరు

వ్యవస్థలను ఏర్పాటు చేయడంతో ఈ ఆధిపత్యానికి గండి పడింది. ప్రావెన్సీల స్థాయిలో వలస పాలకులు వెట్టి చాకిరి వ్యవస్థని రద్దు చేశారు. ఉత్తర భారతదేశంలో జమిందారీ పద్ధతిని, దక్షిణ భారతంలో రైత్వారీ పద్ధతిని ప్రవేశపెట్టారు. పీడించి పిప్పి చేయడం తప్ప మరే విధానం లేని కరుడుగట్టిన భూస్వామ్య సంబంధాలను సంస్కరించడం, అస్తవ్యస్తమైన దిగుబడి, రాబడి పద్ధతుల స్థానంలో స్థిరమైన రెవెన్యూకు హామీపడే విధానాన్ని ప్రవేశపెట్టడం.. లక్ష్యంగా రైత్వారీ పద్ధతిని తీసుకొచ్చారు. మార్కెట్ అవసరాల కోసమూ, సొంత రెవెన్యూ (అదనపు విలువ) పెంచుకోవడం కోసం వలస పాలకులు తీసుకొచ్చిన ఈ సంస్కరణలు శూద్ర కులాల వికాసానికి దారులు వేశాయి. కేరళలో సైనిక కులానికి చెందిన నాయర్లు.. ప్రబల బ్రాహ్మణ వర్గం అయిన నంబూద్రీల ఆస్తులు, అధికారాల్లో వాటాను దక్కించుకోగలిగారు. మహారాష్ట్రలో రైతాంగ కులాలైన కున్బీలు, మాలీలు తొలిసారి భూహక్కుని పొందారు. భూ సంస్కరణల వల్ల నష్టపోయిన వర్గాలకు, చేతివృత్తిదార్లకు, కౌలుదార్లకు రైత్వారీ పద్ధతిలో ఎలాంటి హామీ లేదు. దీనివల్ల ఉపాధి భద్రత కొరవడి, వీరిపై భూ యాజమాన్యం సంపాదించిన శూద్రుల్లోని సెక్షన్ల విపరీతమైన దోపిడీ అమలయ్యేది. ఈ పరిస్థితుల్లో.. కున్బీల్లోని ఒక సెక్షన్ భూస్వాములుగా మారి.. బ్రాహ్మణ ఆధిపత్య పాలకవర్గంలో భాగం కోరుతూ ముందుకొచ్చింది. వారు ఎంత ఎదిగి వచ్చినా శూద్రులనే చిన్నచూపు పోలేదు. తగినంత అర్థబలం, అంగ బలం ఉన్నా లౌకిక వ్యవహారాల్లో పాల్గొనలేకపోయేవారు. మరోవైపు అప్పటిదాకా తాము చేసిన పనులన్నింటికీ కారన్ వాలీస్ సంస్కరణల రాకతో వేర్వేరు వ్యవస్థలు ఏర్పాటు కావడంతో గ్రామ సేవకులుగా ఉన్న అతి శూద్రుల్లో ఒక సెక్షన్‌కు ఉనికి సమస్య తలెత్తింది. ఈ పరిస్థితుల్లో.. అనివార్యంగానే సంప్రదాయ వృత్తి బంధనాల నుంచి బయటపడి వలస పెట్టుబడి కల్పించిన అవకాశాలను వెతుక్కుంటూ బయలుదేరారు. వారంతా బాంబే, పుణె, నాగ్‌పూర్‌లకు చేరుకొని రైల్వే, నౌకా, రవాణా రంగాల్లో కళాసీలుగా, గ్యాంగ్‌మన్లు, రోడ్డు కూలీలుగా మారారు. ఇంకొందరు సైన్యంలో చేరారు. ఈ ధోరణి ఎంత ప్రబలంగా కొనసాగిందంటే అతి శూద్ర కులం అయిన మహర్.. సైనిక కులంగా ప్రాచుర్యంలోకి వచ్చింది. కొత్త పాత్రల్లోకి, కొత్త హోదాల్లోకి మారి ఆర్థికంగా మెరుగైన జీవితాన్ని గడిపే స్థాయికి మహర్లు చేరుకొన్నారు. కానీ, దానికి తగిన గౌరవం, విలువను సమాజంలో పొందలేకపోయారు. ఈ విధంగా భూమిపై పట్టు సాధించిన కున్బీల్లోని బలమైన సెక్షన్, వలస పెట్టుబడి అవసరాలు తీర్చడం ద్వారా తమ అవసరాలు తీర్చుకునే మార్కెట్ సంబంధాల్లోకి ప్రవేశించిన మహర్లు.. సామాజిక ఉద్యమాలకు ముందుకొచ్చారు. వీరి నాయకుడు జ్యోతిరావు పూలే.

## సాంస్కృతిక ప్రత్యామ్నాయ రచన - అధ్యయనం

మహాత్మా అనే పేరు సహా పూలే పోరాట పద్ధతులన్నింటినీ కరంచంద్ గాంధీ జాతీయోద్యమ కాలంలో అనుకరించాడు. సమాజంలో బ్రాహ్మణ ఆధిపత్యాన్ని రద్దు చేయడం కోసం అన్ని నిరసన పోరాట రూపాలను పూలే చేపట్టాడు. బ్రాహ్మణులకు సహాయ నిరాకరణ చేశాడు. క్షురకులను కూడగట్టి.. బ్రాహ్మణులకు క్షవరం బంద్ పెట్టించాడు. బ్రాహ్మణులకు చేదోడుగా ఉంటున్న వైశ్యుల నుంచి రుణాలు తీసుకోవద్దని ప్రచారం చేశాడు. కుల వ్యవస్థ రద్దుకు అంగీకరించేవరకూ, బ్రాహ్మణ సంస్థలు ఏర్పాటుచేసే కార్యక్రమాల్లో పాల్గొనవద్దంటూ ముంబై ప్రావెన్సీ రాజకీయ ప్రతినిధికి మెమోరాండాలు సమర్పించాడు. బ్రాహ్మణ వర్గాలకు, వలస పాలకులకు మధ్య గల ఘర్షణాత్మక వాతావరణాన్ని ఉద్యమ విస్తరణకు ఉపయోగించుకొన్నాడు. "నాకు తెలుసు. యూరోపియన్లు తక్కువేమి తినలేదు. ప్రజలను పీడించడంలో వారు ఎవరికీ తీసిపోరు. వారు వ్యాపారం కోసమే ఇక్కడకు వచ్చారు. కానీ, మానవ జాతికి వ్యతిరేకమైన ఈ హిందూ కరుడుగట్టిన కుటిల, కృత్రిమ, ఐ కుసంస్కారులతో ఉండాలా లేక బయట నుంచి వచ్చినవారితో ఉండాలా అన్నప్పుడు శూద్రులు రెండో పక్షం వైపు నిలబడక తప్పదు" అని పూలే చెప్పేవాడు. మరోవైపు అణగారిన కులాల్లో సామాజిక సంస్కారాన్ని పెంచేందుకు ప్రయత్నించాడు. ఆధునిక విద్యని నేర్చుకోవాలని, శుభ్రమైన దుస్తులు ధరించాలని ప్రచారం చేశాడు. "విద్య లేక మతి తప్పింది. మతి లేక నీతి తప్పింది. నీతి లేక పురోగతి తప్పింది. పురోగతి లేక విత్తం తప్పింది. విత్తం లేక శూద్రుడు నాశనమయ్యాడు" అని 'గులాంగిరీ'లో పూలే అంటాడు. ఆయన రచనలు, ప్రసంగాలు అత్యంత సరళ శైలిలో సాగేవి. ప్రబల పాలకవర్గ భావజాలాన్ని ఎదుర్కొనే తాత్విక సాధనాల కోసం చరిత్రను, పురాణాలను విస్తృతంగా పూలే అధ్యయనం చేశాడు. శూద్రులు, అతి శూద్రుల వైపు నుంచి ఇతిహాసాలను తిరగరాశాడు. చరిత్రను బ్రాహ్మణ, శూద్ర సంగ్రామ సారంగా నిర్వచించాడు. దశావతారాలను.. శూద్రులపై ఆర్యుల దురాక్రమణగా చిత్రీకరించాడు. "మత్స్య అవతారంలో.. ఆర్యులు సముద్రం దాటి వచ్చారు. నరసింహ అవతారంలో శూద్రులపై పెద్దఎత్తున దాడులు చేశారు. వామన అవతారంలో శూద్ర చక్రవర్తి బలి చక్రవర్తిని హత్య చేసి శూద్రుల నుంచి అధికారాన్ని, ఆధిపత్యాన్ని బలవంతంగా హస్తగతం చేసుకొన్నార"ని వ్యాఖ్యానించాడు. కాబట్టి, ఇప్పుడు తిరిగి వాటిని సొంతం చేసుకునేందుకు తిరగబడాలని పిలుపునిచ్చాడు. వలస పాలకులు సముద్రం దాటి వచ్చారు కాబట్టి, ఆర్యులు కూడా అదే మార్గంలో వచ్చి ఉంటారని పూలే ఊహ చేశాడు. భూమి పుత్రుల సిద్ధాంతాన్ని తయారుచేసి, మరాఠా భావనను బలంగా ముందుకు తెచ్చాడు. మరాఠాల ప్రతినిధిగా ఛత్రపతి శివాజీని పూలే ప్రతిష్ఠించాడు. పూలే ప్రభావంతో అతి శూద్రులైన మహర్లు తమను తాము మహాన్ మహర్లు అని పిలుచుకోవడం మొదలుపెట్టారు. దాన్ని వారు ఆత్మగౌరవ ప్రతీకగా భావించారు. పురాణాల అధ్యయనంలోని అశాస్త్రీయత, చరిత్ర పరిశీలనలోని అతిశయ దృష్టి వల్ల.. పూలే ఉద్యమంలో అభిజాత్య, దురాభిమాన ధోరణులు పెరిగాయి. ఫలితంగా శూద్రుల్లో సంపన్న, భూస్వామ్య సెక్షన్‌గా ముందుకొచ్చి.. పాలకవర్గాల్లో గౌరవ స్థానం కోసం ప్రయత్నిస్తున్న కున్బీల్లో మితిమీరిన కులాభిమానం పాదుకుపోయింది. రోగి కోరింది అదే.. వైద్యుడు ఇచ్చిందీ అదే! కున్బీలు నాటి సమాజంలో ఏ ఆధిపత్యాన్నయితే చెలాయించాలనుకున్నారో దానికి ఊతంగానే పూలే ఆలోచనలు నిలిచాయి. పూలేకు తెలిసే ఇదంతా జరిగిందా? కుల వ్యవస్థ రద్దుకు తాను చేసిన ప్రయత్నాలు మరింత కరుడుగట్టిన కులతత్వం పాదుకోవడానికే దోహదం చేస్తాయని ఆయన ముందే

అనుకున్నాడా? శూద్రులను, అతి శూద్రులను సాంఘిక బంధనాల నుంచి విడిపించేందుకు సాగించిన ఉద్యమం చివరికి ఈ అంచుకు చేరుతుందని పూలే అసలు భావించి ఉంటాడా? లేదు. కాకపోతే కుల చలనాన్ని పట్టుకోవడంలో ఆయన తడబట్టాడు. భూమి తదితర ఉత్పత్తి సాధనాలు లేక ఆస్తిపై అధికారం లభించినప్పుడు.. ఆ అధికారాన్ని అంటిపెట్టుకొనే అధికార భావజాలం కూడా ప్రబలంగా ముందుకొస్తుంది. భారతదేశ పరిస్థితుల్లో అలాంటి అధికార పాలకవర్గ భావజాలం కులం. కాబట్టి, సాంఘిక అణచివేతకు గురి అయిన కున్బీలు, అలాగే వెలికి గురయిన మహర్లు.. ఎవరైనా కావచ్చుగానీ ఒకసారి వారు పాలకవర్గాల్లో భాగం అయిన తర్వాత, పాలకవర్గ భావజాలం ప్రభావాన్ని విస్తరించడానికే ప్రయత్నిస్తారు. ఈ క్రమంలో వారు మరింత క్రూరం గా, కటువుగా సామాజిక సంబంధాలతో వ్యవహరిస్తారు. అందువల్లనే కేరళలో తొలి దశలో సాంఘిక ఉద్యమాలను ప్రోత్సహించిన నాయర్లు.. అనంతర కాలంలో అతిశూద్రుల ఆత్మగౌరవ పోరాటాలను కర్కశంగా అణచివేశారు. మహారాష్ట్రలో కూడా.. మహర్ల ఉద్యమాన్ని కున్బీలు, మాలీలు తదితర శూద్ర కులాల్లోని బలమైన సెక్షన్ తొక్కిపెట్టింది. చివరకు సైన్యంలో కూడా వారికి చోటు లేకుండా చేసింది. ఈ పరిస్థితుల్లో.. మహర్లు కిషన్ ఫాగోజీ బోంస్డే నాయకత్వంలో బ్రాహ్మణీయ వ్యతిరేక పోరాటాలకు ముందుకొచ్చారు. ఇదంతా పూలే కళ్ల ముందే జరిగింది. జీవితపు చరమ దశలో ఈ వైఫల్య భారం ఆయనను కుంగదీసింది. పూలే ఉద్యమాన్ని దెబ్బతీసిన మరో అంశం.. 1857 తరువాత మారిన వలస పాలకుల వైఖరి.

## 1857పై పూలే అంచనా

1857 సిపాయిల తిరుగుబాటు లేక తొలి స్వాతంత్ర్య సమరంలో జ్యోతిరావు పూలే వలస పాలకుల పక్షం వహించాడు. ఆయన రెండు కారణాలతో ఈ తిరుగుబాటును వ్యతిరేకించాడు. 1857 తిరుగుబాటుకు నాయకత్వం వహించిన వారంతా పేష్వాలు. 1812లో ముంబై ప్రావెన్సీ సేవలకు పేష్వా బాజీరావు -2 లొంగిపోయాడు. మహారాష్ట్రను వదిలిపెట్టి మధ్యప్రదేశ్‌లోని కల్పి వద్ద.. బ్రిటిష్ పాలకులు ఇచ్చే పింఛనుతో కాలం గడుపుతున్నాడు. తాంతియా తోపే, నానా సాహెబ్ అక్కడే ఉన్నారు. పేష్వా బాజీరావు చేతుల్లో పెరిగిన లక్ష్మీబాయి ఝాన్సీ రాణిగా ఉంది. 1857 తిరుగుబాటుకు తక్షణ ప్రేరణ ఏదైనా, అందులో పాల్గొన్నవారు ఎవరైనా.. చివరిదాకా ఉద్యమాన్ని నడిపింది మాత్రం పేష్వాల బృందమే. మహారాష్ట్రలో కుల వ్యవస్థను అత్యంత దారుణ పద్ధతుల్లో అమలు చేసిన బ్రాహ్మణ పాలకవర్గమిది. చిన్న తప్పుకే శూద్రులను, అతి శూద్రులను మదపుటేనుగుల కాళ్ల కింద వేసి తలలు బద్దలుకొట్టించిన దుర్మార్గులు వీరు. శూద్రులు ఆభరణాలను ధరించడాన్ని నిషేధించారు. మంచి పెంకుతో ఇల్లు కట్టుకుంటే సుంకాలు వసూలు చేశారు. బ్రాహ్మణుడి ఇంట ఏ కార్యం జరిగినా.. శూద్రులను, అతి శూద్రులను వేధించి ఆర్థిక, ఆర్థికేతర దోపిడీలకు గురిచేశారు. పూలే భయం ఏమిటంటే, తిరుగుబాటు విజయవంతం అయితే.. తిరిగి పేష్వాల పీడ తమకు చుట్టుకుంటుందని కలవరపడ్డాడు. నిజానికి, 1812లో పేష్వాల మీద ముంబై ప్రావెన్సీ సేవలు దండెత్తినప్పుడు ఆ సేవలతో కలిసి అతి కసిగా పేష్వాలపై దాడులు చేసినవారు అతి శూద్రులు. ఆ యుద్ధంలో ఎక్కువగా ప్రాణాలు పోగొట్టుకున్నదీ వారే. ఈ నేపథ్యమూ పూలేను ప్రభావితం చేసింది. ఇది ఒక కారణం అయితే, వలస పాలకులు ఓడిపోతే మహారాష్ట్రలో వారి ప్రోత్సాహంతో జరుగుతున్న సామాజికోద్ధరణ కార్యక్రమాలు కుంటుపడిపోతాయని పూలే భావించాడు. ఈ రెండు కారణాలతో ఆయన 1857 తిరుగుబాటును వ్యతిరేకించాడు. ఆయన కారణాలు ఆయనకు ఉన్నాయిగానీ, చరిత్రలో మటుకు 1857కు చారిత్రక ప్రాధాన్యతే ఉంది. అది తొలి స్వాతంత్ర్య సమర పోరాటం., ప్రజాతంత్ర ఉద్యమ ఆరంభ ఘట్టం.. అనే కోణాన్ని అలా పక్కన ఉంచినా.. ఆధునిక భారతదేశ ముఖచిత్రానికి సంబంధించిన ఛాయలు ఈ తిరుగుబాటు పర్యావసానంలో ఉన్నాయి. అదేమిటంటే., అప్పటిదాకా తూర్పు వర్తక సంఘం ఏలుబడిలో ఉన్న దేశం., విక్టోరియా రాణి పాలనలోకి మారి బ్రిటీషిండియాగా రూపుదిద్దుకుంది.

అంటే, అప్పటిదాకా భూ, రెవెన్యూ సంబంధాలతో వ్యవహరించడంలో ఎదుర్కొన్న ఇబ్బందులను చాలావరకూ తొలగించుకొని.. ఆర్థిక వ్యవస్థపై పూర్తిస్థాయి పట్టు సాధించింది. అక్కడినుంచి వలస పెట్టుబడిని విస్తరించే పనిని ముమ్మరం చేసింది. అప్పటికే వర్తక సముదాయంలో ఒక సెక్షన్‌గా కొనసాగుతున్న సంపన్న దళారీ వర్గం సహాయంతో ఆధునిక పరిశ్రమల ఏర్పాటుకు ప్రయత్నిస్తున్నది. ఈ విధంగా.. 1880ల నాటికి దేశంలో తొలి ఆధునిక పారిశ్రామిక కార్మిక వర్గం ఏర్పడింది. మరోవైపు, పూలే ఆశించినట్టు బ్రిటీషిండియా పాలకులు సాంఘిక ఉద్యమాల పట్ల మునుపటి అనురక్తిని ప్రదర్శించలేదు. నిజానికి, తొలినుంచీ వలస పాలకుల ఆసక్తులు వేరుగానే ఉన్నారు. ఏదేని ఆర్థిక వ్యవస్థపై పట్టు సాధించాలనుకున్నప్పుడు భూ, రెవెన్యూ సంబంధాలపై తన ముద్రను వేయడం ఎంత అవసరమో, సామాజిక సంబంధాల్లో విచ్ఛిన్నతను ప్రోత్సహించడమూ అంతే అవసరం. ఈ అవసరంలోంచే వలస పాలకులు పూలే తదితరుల పోరాటాలకు మద్దతుగా నిలిచారు. కానీ, 1857 తరువాత స్థానిక పాలక వర్గాలతో వారికి అవసరాలు పెరిగాయి. పెద్దఎత్తున వ్యవసాయ జనాభాను పారిశ్రామిక పట్టణాలకు తరలించడం, భవిష్యత్తులో కార్మికవర్గంనుంచి ఎదురయ్యే తిరుగుబాట్లను ఎదుర్కొనేందుకు పెద్దఎత్తున సైన్య సమీకరణ చేయడం బ్రిటీషిండియా పాలకుల ముందున్న తక్షణ కర్తవ్యాలు. దానికి స్థానిక పాలకవర్గాల అవసరం ఎంతో ఉంది. దానికోసం.. మహారాష్ట్రలోని పచ్చి అభివృద్ధి నిరోధక పాలకవర్గాల సహకారం తీసుకోవాల్సి వచ్చింది. కాబట్టి.. తొలి నాటి ఉదారవాదం, సామరస్యానికి వారిలో తావే లేదు.

ఇదంతా ఎలా తయారయిందంటే.. గొడ్లను తినేవాళ్లు పోయి మనుషులను తినేవాళ్లు వచ్చినట్టు అయింది. పూలేకు ఇది రెండు విధాలా దెబ్బ! తాను సమీకరించిన కున్బీలు పాలకవర్గాల్లో భాగమయి, సామాజిక సంబంధాల్లో అత్యంత ప్రగతి నిరోధకులుగా తయారవడం ఒక కుదుపు. అణగారిన కులాలను ఎంతోకొంత ఉద్ధరిస్తారనుకున్న వలస పాలకులు పరమ అణచివేతదార్లుగా తేలడం మరో ఎదురుదెబ్బ! నిజానికి, ఇది పూలే వైఫల్యం కాదు. ఆయన కాలానికీ, అప్పటి

ఉత్పత్తి సంబంధాల స్థితికీ, ఆనాటికి అందుబాటులో ఉన్న జ్ఞాన, తత్వ విచారానికీ, చారిత్రక పరిణామ అవగాహనకూ గల పరిమితి ఇది. మొత్తంగానే సమాజంలో వర్గ పోరాటం పదునెక్కుతూ, ఆధునిక కార్మికవర్గం రెక్క విప్పుకుంటున్న క్రమంలో తామంతా భాగస్వాములమనే ఎరుకకు కలిగిన పరిమితి ఇది! అంతేకాదు.. పూలే అంత్యదశలో ఆయన ఉద్యమం రెండుగా చీలిపోయింది. భార్య సావిత్రి పూలే సాంఘిక సంస్కరణల భావ ప్రచారానికి పరిమితం కాగా.. పూలే శిష్యుడు లొఖండే ముంబైకు చేరుకొని కార్మికవర్గాన్ని సంఘటితం చేశాడు. ఆధునిక భారతదేశ చరిత్రలో తొలి కార్మికవర్గ నాయకుడయ్యాడు. అలాగే, కేరళలో అయ్యంకాళి ముఖ్య అనుచరులు కృష్ణపిళ్లై, కేపీ కుప్పన్, కేటీకే కృష్ణన్.. కేరళలో కమ్యూనిస్టు పార్టీ వ్యవస్థాపకులయ్యారు.

## బహుజన వాదం - పూలే వారసత్వం

ముందే చెప్పినట్టు శూద్రుల్లోని బలమైన సెక్షన్.. కేరళ, మహారాష్ట్రల్లో అతి శూద్రుల సాంఘిక విముక్తి ప్రయత్నాలకు ప్రతిబంధకంగా నిలిచింది. సామాజిక ఉద్యమదశ బ్రాహ్మణ వ్యతిరేక పోరాట పరిధిని దాటుకొని బ్రాహ్మణీయ వ్యతిరేక పోరాటాల్లోకి ప్రవేశించింది. కేరళలో అయ్యంకాళి, మహారాష్ట్రలో కిషన్ ఫాగోజీ బొంస్డే ఈ పోరాటాలకు నాయకులు. పెద్దఎత్తున సైనిక సమీకరణ ప్రయత్నాల్లో ఉన్న వలస పాలకులు.. మరాఠా శూద్ర నాయకులను సంప్రదించారు. అప్పుడు వారు పెట్టిన తొలి షరతు ఏమిటంటే.. అతి శూద్రులను సైన్యంలోంచి గెంటేయాలని ఆంక్ష విధించారు. ఎందుకంటే సైనిక కులం అయిన మహర్.. తనను తాను మహాన్ మహర్ అని చెప్పుకోవడం వారికి కంటగింపుగా మారింది. వారి ఒత్తిడి మేరకు 1890ల ప్రాంతంలో బ్రిటీషిండియా పాలకులు సైనిక నిర్మాణంలో మార్పులు తీసుకొచ్చారు. ఈ పరిస్థితుల్లో.. అనివార్యంగానే, 'మహాన్ మహరు' ఉద్యమాల్లోకి రావాల్సి వచ్చింది. కాబట్టి.. పూలే అనంతర ఉద్యమ నాయకత్వం మహర్ల నుంచి రావాలనేది చారిత్రక నిర్ణాయక అంశం. ఈ క్రమమే మహర్ కులంలో పుట్టిన బీఆర్ అంబేద్కర్‌ను రంగంపైకి తెచ్చింది. నిజానికి, మహర్లలో చివరగా సైన్యంలో పనిచేసిన వారిలో అంబేద్కర్ తండ్రి ఒకరు. ఆ తరువాత ఆ కులానికి మొత్తంగానే సైనిక ప్రవేశాన్ని నిషేధించారు. అలాంటి మహర్లు ఇప్పుడు ఎక్కడ ఉన్నారు? అంబేద్కర్ స్థాపించిన సంస్థలను, పార్టీలను సొంతం చేసుకొన్న మహర్లలోని సంపన్న శ్రేణి ఇప్పుడు మహారాష్ట్రలో బీజేపీ- శివసేనల సంకీర్ణ ప్రభుత్వంలో భాగస్వామిగా ఉంది. ఈ శ్రేణికి నాయకుడు రామదాస్ అథవలే. మరోవైపు శివసేనలో ప్రాబల్య స్థానాల్లో ఉన్నవారంతా శూద్ర కులాల్లోని సంపన్న, భూస్వామ్య శ్రేణులు. ఈ పరిణామం ఏమి సూచిస్తున్నది?

శూద్రులు, అతి శూద్రులు ఒక్కటి కావాలని నినదిస్తున్న వారంతా ఇప్పుడు పూలేను ముందుకు తెస్తున్నారు. దళితులు, బీసీలు, మైనారిటీలు, మహిళలను ఒక్కటిచేసి బహుజనంగా నిలిపేదే పూలే ఆలోచన విధానం అని ప్రచారం చేసుకుంటున్నారు. వీళ్లు చెబుతున్న బహుజన భావన పూలే జీవించిన కాలంలోనే విఫలమయింది. దాన్ని ఆయన కళ్లారా చూశాడు. ఇప్పుడు పూలే పేరు మీద జరుగుతున్న ప్రచారం వాస్తవంలో ఆయనకు అన్యాయం చేస్తున్నది. ఆయన పరిమితులను విశిష్టతలుగా, ఆయన పరిశీలనలోని లోటుపాట్లనే గొప్ప సిద్ధాంతంగా ప్రచారం చేస్తున్నారు. కులాలవారీ ఐక్యసంఘటన ప్రయత్నాలకు పడుతున్న గతిని ఒకవైపు చూస్తూనే.. అదే గోతిలో దూకుతామంటున్నారు. వీరి బహుజన తత్వం ఏమిటి? ఆ తత్వంలో మైనారిటీలకు తావెక్కడ? ఈ దేశంలో బ్రిటిష్ వలస పెట్టుబడిని తొలినాడే ప్రాణాలొడ్డి అడ్డుకొన్నవాడు సిరజుద్దౌలా.. ఒక ముస్లిం. దేశంలో వలస పెట్టుబడి బలంగా పాదుకుపోతున్న దశలో, గట్టిగా ఎదుర్కొన్నవాడు టిప్పు సుల్తాన్.. ఒక ముస్లిం. అమెరికా సామ్రాజ్యవాదులకు ఊడిగం చేస్తున్న హిందూత్వ నేతలు అమిత్‌షాలు, నరేంద్ర మోడీలకు హైదరాబాద్‌లో బహుజన నేతలుగా చెప్పుకునేవారు స్వాగతాలు పలుకుతూ, వారితో ఫొటోలకు ఫోజులిస్తున్నారు. అలాంటప్పుడు సామ్రాజ్యవాద వ్యతిరేక ఉజ్వల చరిత్ర కలిగిన ముస్లింలను.. బహుజన ఫ్రంట్‌లోకి ఎలా ఆహ్వానిస్తారు? పోనీ వారు చెప్పే పద్ధతుల్లో బహుజన భావన పెరగాలన్నా రెండు విషయాల్లో వారు స్పష్టతని ఇవ్వాలి. ముందుగా తాము సామ్రాజ్యవాద ప్రపంచీకరణకు వ్యతిరేకం అని ప్రకటించాలి. హిందూత్వవాద భావజాలానికి, హిందూత్వ నేతల అధికారానికి వ్యతిరేకంగా పోరాడతామని తీర్మానించాలి. నిజానికి, ఈ దేశంలో పూలే వారసులు ఎవరైనా ఉన్నారంటే.. వారు 1857ల నాటి నుంచి నేటి వరకూ ప్రియమైన భారతదేశ విముక్తి కోసం పోరాడుతున్న శక్తులు మాత్రమే. అధికార సంబంధాల్లో, సామాజిక సంబంధాల్లో, రాజకీయ సంబంధాల్లో ప్రత్యామ్నాయాన్ని కోరుతున్నవాళ్లే పూలే ఆచరణలోని, ఆలోచనల్లోని పరిమితులను సవరించి.. కుల నిర్మూలన విషయంలో ఆయన స్ఫూర్తిని కొనసాగించగలుగుతారు. కులాలవారీ కాదు.. వర్గాల వారీగా శ్రామిక జన ఐక్య సంఘటనను నిర్మించినప్పుడే పూలే, ఆయన కాలం నాటి బ్రహ్మణ వ్యతిరేక పోరాటవాదుల కల నెరవేరుతుంది. చరిత్రలో బ్రాహ్మణ వ్యతిరేక పోరాటాల పాత్రని అంచనా వేసేటప్పుడు ఒక విషయాన్ని గుర్తుపెట్టుకోవాలి. వ్యక్తులు ఉద్యమాలను నిర్మించలేనట్టే.. ఉద్యమాలు మార్పుకు కారణం కావు. 1885లో కాంగ్రెస్ ఏర్పాటుతోనే దేశవ్యాప్తంగా జాతీయోద్యమ రాజకీయాలు మొదలు కాలేదు. దానికి ముందు సకల అంగాలపై వలస పెట్టుబడి పెత్తనం, కుటీర, చేతివృత్తుల విధ్వంసం, ఆధునిక పారిశ్రామిక కార్మికవర్గం అవతరణ.. అనే క్రమం ఉంది. వాటి రాజకీయార్థిక అవసరాలు, ప్రతిచర్యల్లోంచి మాత్రమే జాతీయోద్యమం ముందుకొచ్చింది. అంటే సామాజిక మార్పు క్రమంలోనే ఉద్యమాల స్వరూపం, వాటి నాయకత్వం చారిత్రకంగా నిర్ణయమవుతాయన్నమాట. ఒక్కమాటలో వర్గ పోరాట ఆవరణలోనే సామాజిక సంచలనాలు చోటుచేసుకొని.. అవి వర్గపోరాట ఆచరణను మరింత పదునెక్కిస్తుంటాయి.

('సామాజిక ఉద్యమాలు- ప్రజాస్వామిక విప్లవం' అనే అంశంపై ఫిబ్రవరి 7, 8 తేదీల్లో విజయనగరం జిల్లా బొబ్బిలిలో జరిగిన రెండు రోజుల విరసం సాహిత్య పాఠశాలలో 'వలస కాలంలో బ్రాహ్మణ వ్యతిరేక పోరాటాలు - సాహిత్యం' అనే అంశంపై చెప్పిన పాఠం. అనంతర మార్పులు, చేర్పులతో తయారయిన ప్రసంగ వ్యాసం)



వ్యాసం

# పరాయీకరణ

- వై.వి. రమణారావు (వై.వి.ఆర్.)

"పరాయీకరణ" అనే విషయం గురించి హెగెల్ ప్రముఖంగా రాశాడు. ఆయనకు ముందుకాలాల్లో దీనిపై "సామాజిక ఒడంబడిక లేదా సర్దుబాటు" అన్న అర్థాల్లో రూసో, హ్యూగో గ్రోషియన్ లాంటి అనేకమంది సామాజికవేత్తలు తమ భావనలను వెలిబుచ్చారు. దీనిపై "ఇస్తవాన్ మెజరాస్" రాసిన "మార్క్స్ థియరీ ఆఫ్ అలీనేషన్" పుస్తకంలో మనం అనేక విషయాల గురించి చూడవచ్చు. స్థలాభావం దృష్ట్యా, అందులోని సారభూత అంశాల్ని 4, 5 వాక్యాల్లో రాస్తాను. ఎందుకంటే, ఈవ్యాసం ఉద్దేశ్యం-''పరాయికరణ'' గురించిన విస్తారమైన వివరణను,విశ్లేషణలన్నింటినీ ఇవ్వడం గాక, "పరాయీకరణ" అనేది ఒక "చారిత్రక,వర్తమాన సామాజిక వాస్తవం" అని తెలియజేయడం కాబట్టి.

## 1. మెజరాస్ భావనలు :

అ) యూదు, క్రైస్తవ మత భావనల్ని పోల్చుతూ, మార్క్స్ రాసిన పరాయీకరణ అంశాల్లోని రాజకీయ,ఆర్థిక కోణాల్లోనివి ఉల్లేఖిస్తాడు.

ఆ) ఆదిమ, మధ్య యుగాల్లోనూ, ఫ్యూడల్ సమాజాల్లోనూ బానిసలనూ, వెట్టి పనివారినీ కొత్త యజమానులకు అమ్మాలంటే, ముందుగా అలాంటి వారిని "అమ్మకపు సరుకులు"గా మార్చాలి (అంటే, Reification జరగాలి - ఒక వస్తువుగా మార్చాలి). ఆదిమ కాలం నుండీ ఓడింపబడిన తెగలు, జాతులు, మతాల వారు, విజేతలచే హీనంగా భావించబడే వస్తువులుగా చూడబడటం వల్ల (అంటే - పరాయివారుగా), వారి శ్రమను దోచే స్థితి మొదలై, అలా "పరాయీకరణ" భావన ప్రపంచమంతా కొనసాగుతూ వచ్చింది.

ఇ) మెజరాస్ తన గ్రంథంలో-పరాయీకరణ భావన యొక్క మూలాల్ని, మార్క్స్ పరాయీకరణ సిద్ధాంతం యొక్క అంగ నిర్మాణాన్నీ, భావనా నిర్మాణాన్నీ వాటి చారిత్రక అభివృద్ధి దశల్లో వర్ణించి, విశ్లేషిస్తాడు. ఇంకా, పరాయీకరణ భావన యొక్క వివిధ దృక్పథాలను-ఆర్థిక, రాజకీయ, జ్ఞానపర, నైతిక, కళాత్మకమైన వాటిని-విశ్లేషిస్తాడు.

ఈ) యువ మార్క్స్, పరిణతి చెందిన మార్క్స్ భావాల సారాంశాలకు తేడా లేదనీ; EPMలోని పరాయీకరణ భావనలు, తర్వాత "కాపిటల్"లోనూ కొనసాగాయని చాలా ఉదాహరణలతో నొక్కి చెబుతాడు.

## 2. పరాయీకరణపై వివిధ భావనలు :

ఇప్పుడు పరాయీకరణపై వివిధ భావనల్ని చూద్దాం. వీటిని "ఎ డిక్షనరీ ఆఫ్ మార్క్సిస్టుథాట్ " గ్రంథం నుండి అనువదించాను.

1. క్రైస్తవ మత భావన : క్రైస్తవ మత భావన అయిన "ఆదిపాపం" మరియు "పశ్చాత్తాపం" అనేది - "మానవుని యొక్క పరాయీకరణ, దాని పరిహారం" - అనే కథ యొక్క మొదటి భావనలుగా చాలామందిచే పరిగణించబడుచున్నది.
2. ప్లేటో-హెగెల్‌ల సారూప్య భావన : హెగెల్ భావన అయిన- "ప్రకృతి అనేది "అఖండభావం" యొక్క "స్వీయ పరాయీకరణ" ద్వారా ఏర్పడింది" - అనేటటువంటిది; ప్లేటో భావన అయిన- "ఉన్నత భావనా ప్రపంచం యొక్క అసంపూర్ణ చిత్రణే ప్రాకృతిక ప్రపంచం"- అనే భావనతో సరిపోలుతుంది.
3. రూసో భావన : రూసో భావన అయిన - "ప్రాకృతిక మానవుడు మరియు సాంఘిక మానవుడు"- అనే ద్వయాన్ని, "పరాయికరణ చెందిన మానవుడు, అపరాయీకరణ (DE-ALIENATION) చెందిన మానవుడు"- అనే భావనతో మనం పోల్చవచ్చు.
4. హెగెల్ భావన : హెగెల్ పరాయీకరణ, అపరాయీకరణ భావనల్ని తాత్వికంగా వాడుతూ వచ్చాడు. హెగెల్ భావన ప్రకారం - "అఖండభావం (ABSOLUTE MIND) యొక్క పరాయీకరణ చెందిన రూపంలోని "ప్రకృతి"అనేది-తన స్వీయ పరాయీకరణకు తిరిగివచ్చే ప్రక్రియగా (అంటే-అపరాయీకరణ చెందటం) - "హద్దుగల మనసు" (FINITE MIND) అయిన "మానవుడి"లో ఉంటుంది. ఆ రకంగా, మానవుని యొక్క ప్రాథమిక నిర్మాణమే - ఆ అఖండభావం యొక్క ఈ సృష్టి నిర్మాణ ప్రక్రియను అందుకునే వైపుగా (పరాయీకరణ, అపరాయీకరణల ద్వారా) పయనిస్తుంది."
5. ప్యూయర్బా భావన : ప్యూయర్బా ప్రకారం, హెగెల్ యొక్క పై భావన తప్పు. ప్యూయర్బా ప్రకారం-మానవుడు అనేవాడు- స్వీయపరాయీకరణ చెందిన దేవుడుకాదు. కానీ, దేవుడు మాత్రం- స్వీయపరాయీకరణ చెందిన మానవుడే.
6. హ్యూగో గ్రోషియన్ భావన : హ్యూగో గ్రోషియన్ ప్రకారం, పరాయీకరణ అనేది-''మానవుడు తనపై గల సంపూర్ణాధికారాన్ని వేరొక మానవునికి బదలాయించటం."
7. పరాయీకరణపై ప్రాపంచిక భావనలు : "పరాయీకరణ" అనే పదం, దాని భావం 20వ శతాబ్దపు మలి దశాబ్దాల్లో అన్ని శాస్త్ర రంగాలలోనూ విరివిగా, రకరకాల అర్థాల్లో ఉపయోగించ బడుతోంది. ఏది ఏమైనా, "పరాయీకరణ" భావనలోని "సాంఘిక ఒడంబడిక" భావాన్ని మనం ఇలా పరిగణించవచ్చు- ''అపరాయీకరణ (DE-ALIENATION) భావనలో అభివృద్ధిపరమైన దానివైపుగా చేసే (మరింత స్వేచ్ఛ లేదా కనీసం భద్రతను పొందటానికి) సంకల్పిత పాక్షిక పరాయీకరణ ద్వారా జరిగే ఒక ప్రయత్నపూర్వక చర్య."
8. మార్క్స్ భావన : మార్క్స్ ప్రకారం, "పరాయీకరణ" అంటే-

ఏదైనా ఒక పని ద్వారా గానీ, (లేక) ఒక స్థితి ద్వారా గానీ, ఒక వ్యక్తి, ఒక గుంపు, ఒక సంస్థ లేదా ఒక సమాజం అనేది- (అ) తన స్వంత చర్యల ఫలితాలకు లేదా ఉత్పత్తులకు, (లేదా) మొత్తం కార్యకలాపానికే, (ఆ) తను ఏ ప్రకృతిలో నివసిస్తున్నదో ఆ ప్రకృతికి, (ఇ) తన తోటి మానవులకు, (ఈ) దానికదే - పరాయిదిగా అవటం లేక ఉండటం. ఆ రకంగా, పరాయీకరణ అనేది ఎల్లప్పుడూ "స్వీయ పరాయీకరణే."

### 3. పరాయీకరణ, అన్యధీకరణ పదాల నిర్వచనం, భావనల గురించి:

పైన, మార్క్స్ యొక్క భావన, "స్వీయ పరాయీకరణ" కేంద్రంగా వున్నట్లు మనకు వ్యక్తపరచబడింది. కానీ, మార్క్స్ రాసిన "ఆర్థిక, తాత్విక రాతప్రతులు, 1844" (జూలీ) లోనూ, "కాపిటల్" లోనూ, "శ్రమ అన్యధీకరణ" ద్వారా జరిగే దోపిడీయే ప్రధానమైనదన్న భావనను వ్యక్తీకరించాడు. ఈ విషయాన్ని మనం తర్వాత చూడబోతాం. ఆ రకంగా, మార్క్స్ భావన ప్రకారం-"పరాయీకరణ అనేది హెగెల్ చెప్పినట్లుగా "ఒక సార్వత్రికమైన సూత్రం"గా కాక, ఒక తాత్విక భావనగా కాక, ఒక "సామాజిక వాస్తవం"గా మనకు తెలుపబడుతుంది.

మార్క్స్ ప్రకారం-"పరాయీకరణ అనేది చారిత్రకంగా, సామాజికంగా అంటే--మానవుడు-తన నుండి, తననే, తన సొంత కార్యకలాపాల ద్వారానే పరాయీకరణ చెందటం. అంతేకాదు, "స్వీయ పరాయీకరణ" అనేది--(క) పరాయీకరణ యొక్క సారం, (ఖ) పరాయీకరణ యొక్క ప్రాథమిక నిర్మాణం. - ("ఎ డిక్షనరీ ఆఫ్ మార్క్సిస్టు థాట్" గ్రంథం నుండి) భౌతికపరమైన అనివార్య అభివృద్ధి దశల గుండా సాగుతూ వస్తున్నది."

మనం ఈ విషయాన్ని చారిత్రక దశల్లో వీక్షిస్తే, మొదట ఆదిమ సమాజంలో జీవన విధానంలోని దశలైన గుంపు, తెగ, గణ వ్యవస్థలన్నింటిలోనూ, "సంఘ" సభ్యుడు తన జీవనాన్ని ఆ సంఘ / గుంపు సభ్యుడిగా కొనసాగించాలంటే, తన శ్రమఫలాల్ని కొంతమేరకు సంఘానికి చెందేట్లు(అంటే,తన "శ్రమ పరాయీకరణ" కు) అంగీకరించి, అలా వ్యవహరించాలి. లేకపోతే, అలాంటి సభ్యుల్ని తమ గుంపు, తెగ, గణం నుండి సంఘపెద్దలు వెలేసేవారు. అలా వెలివేయబడ్డ వారికి, వారి గుంపు/తెగ బయట గడిపే జీవితం దుర్భరం అయిపోవటాన్ని ఆ సభ్యులు, గుంపులోని ఇతరులు ప్రత్యక్షంగా చూడటం,అనుభవం పొందటంవల్ల, "శ్రమ పరాయీకరణ" అనేది ఎలా తప్పనిసరో తెల్సుకుంటారు. ఆ రకంగా, "శ్రమ పరాయీకరణ" అనేది సంఘ సభ్యులకు ఒక అలవాటుగా, "సంప్రదాయం"గా, "సామాజిక జీవన విధానం/కట్టుబాటు/ఒడంబడిక" క్రింద కొన్ని తరాల కాలక్రమంలో స్థిరపడిపోతుంది. అలా స్థిరపడిపోయిన కట్టుబాటే సామాజిక రంగంలో "స్వీయ పరాయీకరణ"గా తర్వాతి కాలాల్లో మనకు కన్పడుతుంది. అలా, మానవుడు తన ఇష్టపూర్వకంగానే సమాజంకోసం తన వంతుగా తన శ్రమను పరులకోసం (తన తోటి సభ్యులకోసం) ఉపయోగపడేలా చేస్తాడు. దీనినే మనం, సామాజిక రంగంలో "స్వీయ పరాయీకరణ" (SELF- ALIENATION) అంటున్నాము.

అయితే, ఆదిమకాలంలోనూ, అదనపుఉత్పత్తి జరగని కాలాల్లోనూ, "శ్రమ దోపిడీ" జరగనప్పుడు, మనకు గుంపు, తెగ, గణం గల సమాజాల్లో "శ్రమ పరాయీకరణ" యొక్క బలవంతపు రూపమైన "శ్రమ అన్యధీకరణ" ఉండేది కాదు లేదా బహుతక్కువ మోతాదులో ఉండేది, ప్రజలు నాడు సాధారణ జీవితాల్ని గడిపేవారు. కాలక్రమంలో జనాభా పెరుగుదల, వలసల విధానం, అవసరాలు పెరగటం, తీరిక ఏర్పడటం, వ్యాపారం, మతం, సంస్కృతి, మొదలైన వాటన్నింటివల్ల, స్వీయ పరాయీకరణ స్థానంలో, "బలవంతపు పరాయీకరణ" (అంటే, "శ్రమ అన్యధీకరణ"/శ్రమదోపిడీ) జరిగేది. వివిధ భౌగోళిక స్థితులు, జాతులు, వాటి వలసలు, యుద్ధాలు, వర్గాలు ఏర్పడటం, మతం, సంస్కృతుల సమ్మేళనమైన వివిధ ఖండాల్లో, వివిధ రాజ్యాలున్న భూగోళంపై, ఇది ఒక అనివార్య సామాజిక దశ. అయితే, " శ్రమ పరాయీకరణ" లోనే సంఘం/రాజ్యం యొక్క అవసరాల కోసం అంటూ చేయబడే పనుల్లోనే ఒక "శ్రమ దోపిడీ" వర్గం బయలుదేరి, వేల ఏళ్ళుగా తన సామాజిక స్థితిని గడ్డకట్టించుకుని,వికృత పరాన్నవర్గంగా మసలుతోంది. నేటి రాజ్య సంబంధ, ఉద్యోగస్వామ్యంలో మనం దీనిని చూడొచ్చు.

### 3.1. పరాయీకరణ, అన్యధీకరణ పదాల భావనల వాడుక:

"అన్యధీకరణ" అనేది, "పరాయీకరణ"కు సమానార్థంగా కమ్యూనిస్టు సాహిత్యంలో నేటికీ వాడబడుతున్నా, "అన్యధీకరణ" అనే విధానమే, మానవ శ్రమను, అందునా అదనపు శ్రమను, అదనపు విలువను చరిత్ర పొడుగునా దోపిడీ చేస్తూ, కార్మికులను, వారి తరాలను "కార్మికులుగానే ఇంకా కొనసాగేటట్లు" చేస్తున్నది. అయితే, మనకు తెలుగు అనువాదాల్లో "పరాయీకరణ" (ALIENATION)నే, "అన్యధీకరణ"కు (ESTRANGEMENT) కూడా అర్థం(ఉమ్మడి అర్థం) ఇచ్చే పదంగానూ భావిస్తూవస్తున్నారు.ప్రస్తుతానికి మనంకూడా పరాయీకరణ పదాన్నే మూలభావనగా భావిద్దాం (ముందటి పేజీలో రాసినట్లు, "పరాయీకరణ"కూ,"అన్యధీకరణ"కూ వేరువేరు అర్థాలున్నా కూడా).

### 3.2. పరాయీకరణ, అన్యధీకరణ పదాలకు జర్మన్, ఇంగ్లీషు అర్థాలు:

"శ్రమ పరాయీకరణ" విధానంలో "సమాజహితం" జరిగినా కూడా, చాలావరకు దోపిడీవర్గాల్లోని అసంఖ్యాక "శ్రమచేయని" వర్గాల వారికే ఆ ఫలాలు పంచబడి (ఉదాహరణకు, లంచాలు, తప్పుడు లెక్కలు, అనవసర పాలనా విభాగాల ఖర్చులు, వగైరాల వల్ల) వృథాగా పోతోంది. కానీ, "శ్రమ అన్యధీకరణ" ద్వారానే చాలాచాలా ఎక్కువరెట్ల "శ్రమదోపిడీ" జరుగుతోంది. ఇదే , వర్గాలు గిడకబారిపోవడానికి ముఖ్య కారణం. దీనినే మార్క్స్ మనకు "కాపిటల్"లో వివరిస్తాడు. అందుకని, "పరాయీకరణ", "అన్యధీకరణ" పదాల్ని, వాటి అర్థాల్ని, మార్క్స్ వాటిని వాడిన విధానాన్ని చూస్తే, మనకు ఒక స్పష్టమైన అవగాహన వస్తుంది. దీనికోసం, మార్క్స్ రాసిన EPM (ECONOMIC AND POLITICAL MANUSCRIPTS, 1844) లోని వాక్యాల్ని చూడాలి. అంతకు ముందుగా, అసలు ఈ పదాలకు ఇంగ్లీషులో, జర్మన్‌లో గల అర్థాల్ని,భావనలను చూద్దాం.

(i). "పరాయీకరణ"కు ఇంగ్లీషులోని పదం - ALIENATION.
జర్మన్‌లోని పదం - ENTAUSSERUNG.
(ii). "అన్యధీకరణ"కు ఇంగ్లీషులోని పదం - ESTRANGEMENT.

జర్మన్‌లోని పదం - ENTFREMDUNG

(i). ENTAUSSERUNG కి అర్థం - 'Voluntary disposal of (పరాయీకరణ) one's own property.' అంటే, తెలుగులో అర్థం- "బలవంతము లేని మరియు స్వీయ సమ్మతముగా తన శ్రమఫలాలను ఒకడు ఇతరులకు చెందేటట్లు చేయడం." లేదా - సామాజిక ఒడంబడిక/కట్టుబాట్ల వల్ల స్వచ్ఛందంగా జరిగే శ్రమఫలాల బదలాయింపు.

(ii). ENTFREMDUNGకి అర్థం- 'To make alien. Taking or (అన్యధీకరణ) stealing a person's goods.' అంటే, తెలుగులో అర్థం-"పరాయీకరణ చెందబడటం" లేదా బాహ్యశక్తులచే ఒత్తిడి వల్లనూ, బలవంతంగానూ జరిగే పరాయీకరణ."

## మార్క్స్ EPM,1844 లో ఇలా అంటాడు-

"Alienated Labour has resolved itself for us into two component parts, which mutually condition one another, or which are merely different expressions of one and the same relationship.
Appropriation appears as Estrangement,as Alienation; and Alienation appears as Appropriation,
Estrangement as true admission to Citizenship."

వీటికి నేను చేసిన తెలుగు అనువాదాన్ని ఇప్పుడు చూద్దాం.

"పరాయీకరింపబడిన శ్రమ" అనేది తనకు తాను రెండు భాగాలుగా విడిపోయినట్లు మనకు అగుపిస్తుంది- ఏవైతే ఒకదానినొకటి పరస్పరం అదుపులో వుంచుకుంటాయో లేదా ఏవైతే ఒకే సంబంధం యొక్క వివిధములైన/వేరైన వ్యక్తీకరణలో, అవి." (అంటే, ఆ రెండూ-

1. పరాయీకరణ లేదా అణ్యధీకరణ
2. సర్దుబాటు (APPROPRIATION) అని ఈ క్రింది వాక్యాల్లో తర్వాత మార్క్స్ అంటాడు--వై.వి.ఆర్.).

"పరాయీకరణ లేదా అణ్యధీకరణ వల్ల జరిగిన నష్టానికి,

(1) సర్దుబాటు అనేది మనకు ఇలా కన్పిస్తుంది- అణ్యధీకరణ వలెనూ, పరాయీకరణ వలెనూ మరియు

(2) అ) పరాయీకరణ అనేది-- సర్దుబాటు వలెనూ,
ఆ) అణ్యధీకరణ అనేది-- పౌరసత్వానికి నిజమైన సమ్మతి వలెనూ కన్పిస్తాయి." మార్క్స్ యొక్క పై భావన అర్థం కావాలంటే, ఒక ఉదాహరణ చూద్దాం.

### 3.3. ఉదాహరణ :

'A' అనేవాని "పరాయీకరింపబడిన 10 భాగాల శ్రమ-'B'కి 5 భాగాలు, 'C'కి 5 భాగాలుగా విభజింపబడుతుందని అనుకుందాం.

ఇలానే, 'B' అనేవాడు-'C', 'A' లకు బీ 'C' అనేవాడు-A,B లకు తమ శ్రమఫలాల్ని పోగొట్టుకుంటారనుకుందాం. (కానీ, అసలుకి, ఈ "శ్రమ ఫలం" విభజన అనేది- 'A' అనేవాడు-B, C, D, E, F.......ఇలా చాలామందికి వివిధ భాగాల్లో పోగొట్టుకుంటాడు--ఈ సమాజంలో).

### 3.3.1. A దృష్టిలో :

(i). A తన శ్రమఫలాన్ని పోగొట్టుకోవడం :
(అ) Bకి పరాయీకరణ రూపంలో 2 భాగాలు పోగొట్టుకుంటాడు.
(ఆ) B అన్యధీకరణ రూపంలో 3 భాగాలు దోపిడీ చేస్తాడు.

(ii) A తన శ్రమ ఫలాల్ని తిరిగి పొందటం :
పై రకంగా పోగొట్టుకోబడిన తన శ్రమఫలాన్ని తిరిగి పొందాలంటే, Aకి గల మార్గం-"సామాజికంగా అందుబాటు" లో గల "సర్దుబాటు" మాత్రమే. ఇది 2 రకాలు-
(అ) సామాజిక ఒడంబడిక
(ఆ) పౌరసత్వ హక్కు అనుమతి.

**(అ) సామాజిక సర్దుబాటు/ఒడంబడిక (పరాయీకరణ) :**

"సామాజిక సర్దుబాటు" అంటే, ఇంతకు ముందటి పేజీల్లో చెప్పినట్లుగా, సమాజం నడవడం కోసం, ప్రతి ఒక్కడు స్వచ్ఛందంగా ఒదులుకునే తన శ్రమఫలాలు. ఆ రకంగా, తను (జు), దీ కి పరాయీకరణ ద్వారా పోగొట్టుకున్న 2 భాగాలు, తిరిగి "సామాజిక సర్దుబాటు" ద్వారా "తనకు ఏదో ఒక రకంగా చేరతాయిలే" అని జు భావిస్తాడు. అంటే, ఇక్కడ- "పరాయీకరణ" అనేది, "సామాజిక సర్దుబాటు"లా కన్పిస్తుంది లేదా మరింత వివరంగా చెప్పాలంటే, "సర్దుబాటు"లోని మొదటి రకమైన "సామాజిక ఒడంబడిక/ కట్టుబాటు"లా కనిపిస్తుంది.

**(ఆ) పౌరసత్వానికి సమ్మతి పత్రం (అన్యధీకరణ) :**

అన్యధీకరణ (అంటే, "బలవంతపు పరాయీకరణ". దీన్నే, "శ్రమ దోపిడీ" అనవచ్చు) ద్వారా జు కోల్పోయిన మిగిలిన 3 భాగాలు, ఎలా తిరిగి పొందుతాడంటే-జుకి ఈ సమాజం ఇచ్చిన "పౌరసత్వం" అనే అనుమతి/సమ్మతి ద్వారా పొందుతాడు. దీనినే, "అన్యధీకరణ స్వాధీనత" (అంటే, అన్యులకు అధీనమైన తన యొక్క శ్రమఫలాలను తిరిగి పొందటం) అని కూడా అనవచ్చు. ఇక్కడ మనం, సమాజం, పౌరసత్వం లాంటి విషయాల్ని మార్క్స్ మాటల్లో కొంత చూడాలి. దానికి ముందు, "పౌరుని" గురించి చూద్దాం.

**పౌరుడు-విధులు :**

ఈ సమాజంలో పౌరుడు, తన విధుల్లో భాగంగా తన సమాజం కోసం కొంత శ్రమఫలాన్ని పోగొట్టుకుంటాడు. ఈ విషయాన్ని పైన (అ) లో చూశాం.

**పౌరుడు-హక్కులు :**

అలానే, తన(A యొక్క) శ్రమఫలాన్ని మరొకడు (B) దోపిడీ చేస్తే (అది ఆనాటి సామాజిక దశలోని ఉత్పత్తి విధానాలు, ఉత్పత్తి సంబంధాలు, జీవన విధానాల వల్ల నిర్ణయమై, మారుతూ వుంటుంది), దానిని తిరిగి పొందటానికి (నిజంగా, A యొక్క శ్రమఫలం ఎంతోకొంత సమాజానికి ఉపయోగపడినా, మిగిలిన పోగొట్టుకోబడిన అతని శ్రమఫలం, తప్పకుండా ఆ పౌరుడు (A) తిరిగి పొందాల్సి వుంటుంది - అప్పుడే అతనికి భుక్తి, మనుగడ), అతను పౌరునిగా తనకు గల

హక్కుల్లో భాగంగా, ఇతరులనుండి వారి శ్రమఫలాన్ని దోపిడీ చేస్తాడు/లాక్కుంటాడు (తనకు తెలియ కుండానే, అదేదో "సామాజిక జీవన విధానం" అన్న భావనలో వుంటూ, ఆ భావన యొక్క ఋజువులను చట్టపరంగానూ, దైనిక జీవిత విధానంలోనూ జరిగే వాటిని ఈ సమాజంలో అడుగడుగునా చూస్తూ, అనుభవిస్తూ వుంటాడు గనుక, అతను (A) అలా చేస్తాడు).

**సమాజం :**

ఇక్కడ మనం, సమాజం గురించిన అధికాధిక ప్రజల అవగాహనని చూడాలి. ఆ అవగాహన ఏమిటంటే – "ఈ సమాజం అనాదిగా మానవులలోని స్వార్థంపై, తెలివిపై ఆధారపడి నడుస్తూ వస్తున్నదనీ : ఆ రకంగా ప్రతి మానవుడూ తనకే ఎక్కువ ప్రతిఫలం/సుఖం/లాభం దక్కాలని అనుకుంటాడు కాబట్టి, ప్రతి ఇతర మానవుడు కూడా అలా తెలివిని ఉపయోగిస్తూ, స్వార్థంతో వ్యవహరిస్తూ వస్తున్నాడు, వ్యవహరించబోతాడనీబీ ఈ విధానం శాశ్వతం అనటానికి చరిత్ర, వర్తమానమే సాక్షం" అంటూ ("దోపిడీ" అన్న పేరు వాడకుండానే, "వ్యాపారం", "తెలివి" లాంటి పదాల మాటున వారు ఇలా మాట్లాడుతారు), ముసుగేసిన ఋజువులను చూపిస్తారు.

**సమాజం, అన్యధీకరణపై మార్క్స్ వ్యాఖ్యలు (EPM ,1844 లో):**

"అన్నింటికీ మించి, "సమాజాన్ని" వ్యక్తికి అతీతమైన, విరుద్ధమైన "అమూర్తం"గా సూత్రీకరించకూడదు. వ్యక్తి ఒక సామాజిక జీవి." (అంటే- "సమాజాన్ని" ఒక వస్తుసారంగా మాత్రమే, ఒక కేవల భౌతిక - రూపంగా మాత్రమే లేదా "కేవలం సంపద/డబ్బు ఇచ్చే ఒక కుప్ప"గా మాత్రమే భావించరాదు – అని అర్థం – వై.వి.ఆర్.).

ఆ పుస్తకంలోనే మార్క్స్ ఇంకా ఇలా అంటాడు – "అన్యధీకరణ శ్రమకు మూలం, కారణం – వ్యక్తిగత ఆస్థి అయినప్పటికీ, వ్యక్తిగత ఆస్థి అనేది – అన్యధీకరణ యొక్క "ఫలితం". వ్యక్తిగత ఆస్థిని గురించి మాట్లాడేటప్పుడేమో ఎవరైనా – అది మానవునికి బాహ్యమైనదిగా భావిస్తారు. కానీ, శ్రమ గురించి మాట్లాడేటప్పుడేమో – "మానవుణ్ణే" లెక్కలోకి తీసుకుంటారు." (అంటే, సమాజంలో "వ్యక్తిగత ఆస్థి" అనేది – సాధించవలసిన ఒక విషయంగానో, పొందాల్సిన ఒక వస్తువుగానో కన్పడుతుంది- ప్రతి మనిషికీ. దాన్ని సృష్టించే శ్రామిక మానవుల రాశి మాత్రం – విలువలేని వారిగా; వారి ఖర్మకొద్దీ, చేతగానితనం కొద్దీ, తెలివితక్కువ కొద్దీ దానిని వారి యజమానులకూ, పరులకూ సాధించిపెట్టేవారుగా కనపడతారు – ప్రతి మనిషికీ –వై.వి.ఆర్).

**సంపద :**

"నేటి సమాజస్థితి శాశ్వతం" అనుకునే ప్రతిమనిషీ ఇంకా ఇలా అనుకుంటాడు–అతి"సంపద అనేది తెలివైనవాని సొత్తు, అలా ఎంతైనా సంపద సమాజంలో వుంది, లేదా ముందుగా దాన్ని సొంతం చేసుకున్న వారికే అది దక్కుతుంది"–అని. ఇది నేటి దోపిడీ భావజాలం కల్గించే "సంపాదనా యావ" ఫలితమే. కానీ, సమాజంలో సంపద అనంతంగా లేదు, హద్దు కల్గి వుంది. హద్దుల్లేని పోగువడే సంపదకి కారణం–"విస్తారమైన శ్రామిక జనం చేసే శ్రమ విలువ" దోపిడీయే.

**చరిత్రలో శ్రమదోపిడీ :**

శ్రమ దోపిడీ అనాదిగా ఒకే రకంగా లేదు. ఆదిమకాలంలో అది పూజారుల పరమైంది. తర్వాత బలవంతులు, రాజులు చేశారు. ఆ తర్వాత, వ్యాపారం వృద్ధిఅయ్యే కొద్దీ, తమ రాజ్యాల్లోని కప్పాలు, సుంకాలు, దోపిడీ ద్వారా లభించే మొత్తాలకీ చేసే పోరాటాలు రాజులకు భారమయ్యాయి. కారణం – ప్రజలు నెమ్మదిగా సామాజిక, శాస్త్రీయదృష్టి పెంచుకునే దశల్లోకి అడుగెట్టడం. ఇక అప్పుడు, అనాదికాలం నుండీ మారుతూ వస్తున్న (ఒక్క రక్తం చుక్కా రాల్చని, ఏ మాత్రం బలప్రయోగం, పరాక్రమం ప్రయోగించే అవసరమే లేని) "వ్యాపారం/వాణిజ్యం" అనేది దోపిడీదారులందరికీ, ఆ తర్వాత సామాన్య ప్రజలకు కూడా, కల్పతరువు/కామధేనువులా కన్పడింది. ఇంకేం, రాజులు (ముఖ్యంగా యూరప్‌లో) వ్యాపారానికీ, వాణిజ్యానికీ (ముఖ్యంగా "వలసల వాణిజ్యానికీ) పెట్టుబడులు సమకూర్చి, అత్యధిక లాభాలు గడించారు. ఆ రకంగా, "వ్యాపారం"లోని ప్రాణవాయువు వంటిదైన "పెట్టుబడి" నేటి "ప్రపంచీకరణ" దశలోని "ఫైనాన్స్ కాపిటల్" స్థితికి చేరింది. అయితే, ఈ స్థితి శాశ్వతం కాదు, ఇది ఒక తాత్కాలిక సామాజిక దశ మాత్రమే.దీనిలోని "హింసలేమి" అనేది ప్రపంచంలో శ్రమచేయని/దోపిడీ చేసే ప్రజలకు ఒక "సమ్మోహనం"గా కన్పడుతోంది. అయితే, దీని రహస్యాన్ని "పెట్టుబడి" గ్రంథంలో మార్క్స్ ప్రజలముందు పెట్టిన తర్వాతా: ఈ మధ్యకాలంలో పెట్టుబడి వినాశకర ప్రభావం, దాని చాటున జరిగే హింస కార్మికులపై పడటం వల్ల, వాళ్ళు వ్యాపారం యొక్క రహస్యాల్నీ, నగ్న పీడననూ చూసి, తెల్సుకుని, శక్తిగొని, ప్రతిఘటించి, తమ దేశాల్నుండి పెట్టుబడి శక్తుల్ని (బహుళజాతి కంపెనీలను) తరిమేశారు (లాటిన్ అమెరికా దేశాల్లో), సోషలిస్టు సమాజాలను–కొంతకాలం వరకైనా–స్థాపించారు.

**3.3.2. B దృష్టిలో–తన శ్రమఫలాన్ని పోగొట్టుకోవడం,తిరిగి పొందటం:**

పై ఉదాహరణలో A బదులు B, B బదులు A రాసుకుంటే, A దృష్టిలో లాగానే, B దృష్టిలో కూడా తన శ్రమఫలాన్ని అతను ఎలా పోగొట్టుకుంటాడో, ఎలా తిరిగి పొందుతాడో మనకు స్పష్టమవుతుంది.

**మానవశ్రమఫలాల పంపిణీ సారాంశం :**

మానవశ్రమ ఎవరి విషయంలోనైనా మూడు విధాలుగా ఉంటుంది.

1. తన శ్రమ ఫలాలలోని ఎంతోకొంత భాగం తనకే చెందటం,
2. తన శ్రమ ఫలాలలోని ఒక భాగం తప్పనిసరిగా సమాజానికి చెందేటట్లు స్వీయ పరాయీకరణ చెందటం,
3. తన శ్రమ ఫలాలలోని మిగిలిన భాగం (అసలుకి, ఇదే ప్రధాన లేక ముఖ్య భాగం అయిపోయింది–చారిత్రక క్రమంలో) అన్యధీకరణ ద్వారా, అంటే, శ్రమదోపిడీ ద్వారా, ఇతరుల అధీనంలోకి పోతుంది. ఇలా పైన 2,3 లలో చెప్పిన, తాను కోల్పోయిన శ్రమ ఫలాలను తిరిగి పొందటానికి పరాయీకరణ మరియు అన్యధీకరణ స్వాధీనత (పౌరసత్వహక్కు ద్వారా చేసే శ్రమదోపిడీ) ద్వారా అతను ప్రయత్నిస్తాడు.

(మిగతా వచ్చే సంచికలో.)



# 'కథ గాని కథ' కానూరి తాత

- వి.వి.

ప్రజానాట్యమండలి (1944), విప్లవ రచయితల సంఘం (1970), అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య (డెబ్బైలలోనే) స్థాపకుల్లో ఒకరైన కానూరి వెంకటేశ్వరరావు 2015 ఏప్రిల్ 24 ఉదయం ఖమ్మంలో న్యూడెమోక్రసీ ఆఫీసులో కన్ను మూసాడు. ఏ కొద్ది నెలలో తక్కువ నూరేళ్లు జీవించాడాయన. ఆ జీవితంలో డెబ్బై ఏళ్లకు పైగా తాను విప్లవం తెస్తుందని నమ్మిన కమ్యూనిస్టు పార్టీతో ఉన్నాడు. కమ్యూనిస్టు పార్టీకే వ్యవసాయ విప్లవ కార్యక్రమం లేని రోజుల్లో రైతుగా వ్యవసాయ జీవితంలో ఉన్నాడు. విప్లవ ప్రచారం చేస్తాయి, చేస్తున్నాయని తాను నమ్మిన సాహిత్య, సాంస్కృతిక సంస్థల్లో అరవై ఏళ్ల పాటు పని చేసాడు.

నలభైలలో ఒక దశాబ్దం పాటు కృష్ణాజిల్లా గుడివాడ తాలూకాలో అప్పుడు తూర్పు కృష్ణా జిల్లా కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శిగా ఉన్న కొండపల్లి సీతారామయ్య నాయకత్వంలో పార్టీలోనూ, ప్రజానాట్య మండలిలోనూ పని చేసాడు. ప్రజా నాట్యమండలి రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ఫాసిస్టు వ్యతిరేక సాంస్కృతిక పోరాటం ముమ్మరంగా నిర్వహించినపుడు మల్ల యుద్ధ యోధుడు కోడిరామమూర్తిపై బుర్రకథ రాసాడు. కోడిరామమూర్తి తన ఛాతీపై చెక్కపెట్టుకొని ఒంగోలు గిత్త వంటి ఎద్దును నిలబెట్టుకునే వాడని ప్రతీతి. స్పెయిన్‌లో విస్తృత ప్రచారంలో ఉన్న క్రీడ ఎద్దును ఎర్ర గుడ్డతో లొంగ దీసుకోవడాన్ని దృష్టిలో పెట్టుకొని స్పెయిన్‌లోనే నియంత ఫ్రాంకోకు వ్యతిరేకంగా ప్రజాస్వామ్యం కోసం సాయుధంగా పోరాడిన స్పానియార్డులు, అంతర్జాతీయ బ్రిగేడ్ ప్రేరణతో ఆయన ఒక జాతీయ వీరగాథను కోడి రామమూర్తిపై రాసాడు. ఇందుకు ప్రేరణ ప్రేంచంద్, సజ్జీద్ జహీర్, బలరాజ్ సాహ్నీ మొదలైనవారు ఏర్పాటు చేసిన ప్రగతిశీల లేఖక్ సంఘ్, ఇప్టా (ఇండియన్ పీపుల్స్ థియేటర్ అండ్ ఆర్ట్స్) తెలుగు నేల మీద అభ్యుదయ రచయితల సంఘం. ప్రజా నాట్యమండలి. 1944 నుంచి 1955 వరకు పన్నెండు సంవత్సరాలు కృష్ణాజిల్లాలో, ముఖ్యంగా తూర్పు కృష్ణా జిల్లా ఐదు తాలుకాల్లో కె.ఎస్. నాయకత్వంలో పార్టీ పనులతో పాటు ప్రజా సాంస్కృతిక రంగంలో ఆయన పూర్తికాలం పని చేసాడు. అది ఫాసిస్టు వ్యతిరేక పోరాటం కావచ్చు, తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం కావచ్చు, పోరాట విరమణ తర్వాత వర్గపోరాటం వలెనే 1955 ఎన్నికలు కావచ్చు. కమ్యూనిస్టు పార్టీ, దాని ప్రజా సంఘాలు ప్రజల్లో ఉండి చేసిన ప్రతి మిలిటెంట్ పోరాటంలోనూ ఆయన ఉన్నాడు. కమ్యూనిస్టు పార్టీ సాంస్కృతిక రంగంలోనే కాదు ఇతరత్రా ఇచ్చిన ప్రతి పనిని ఎంత ప్రమాదకరమైందయినా సరే నిర్వహించాడు. ఇరవై అయిదు ఎకరాల కామందు కుటుంబంలో పుట్టిన కానూరి 1956 నాటికి పేద రైతుగా మారాడు. అప్పటికింక 1951 పోరాట విరమణకు, 55 ఎన్నికల ఓటమికి 56 శాంతియుత సహ జీవన సిద్ధాంతం కూడా తోడయి పార్టీ కార్యదర్శి చంద్ర రాజేశ్వరరావుగారు వృత్తి కళాకారులను, కార్యకర్తలను బతుకు తెరువు చూసుకొమ్మన్నారు. ఎకరమూ, రెండెకరాలు ఉంటే అమ్ముకొని తెలంగాణలో నీటిపట్టున భూములు కొనుక్కుంటే రైతులుగా బతుకవచ్చునని చెప్పాడు.

అట్లా 1956లో కె.ఎస్. నాయకత్వంలోనే ములుగు ఘనపురం వచ్చిన కుటుంబాల్లో అట్లూరి రంగారావు, కానూరి వెంకటేశ్వరరావు, చెరుకూరి కాశీవిశ్వనాథం, ముగ్గురూ విరసం ఏర్పడీ ఏర్పడగానే 1970 ఖమ్మం సుబ్బారావు పాణిగ్రాహి నగర్‌లోనే సభ్యులుగా చేరారు. అప్పటిదాకా ములుగు ఘనపురంలో వ్యవసాయం చేస్తూనే ఆ ప్రాంతంలోనే కాకుండా జిల్లాలో కూడా తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట కాలం నుంచి కూడా పోరాట యోధుడిగా పేరున్న పొట్లూరి రామనర్సయ్యతో రాజకీయ సంబంధాల్లోకి అట్లూరి, కానూరి వెళ్లారు. ములుగు ఘనపురం వెళ్లిన కొద్ది రోజులకే కె.ఎస్. ఆదిలాబాదు జిల్లా జన్నారంకు మారిపోయి అక్కడ కూడా ఎక్కువ రోజులు ఉండకుండా భూమి అంతా అమ్ముకొని, చాలా కష్ట నష్టాలకు గురయి కాజీపేటలో గేబ్రియల్ స్కూల్‌లో హిందీ పండిట్‌గా 1961 నాటికే చేరిపోయాడు. 1967 నక్సల్బరీ వసంత మేఘ గర్జనతో నక్సల్బరీ పోరాట ప్రభావం శ్రీకాకుళం మీదనే కాకుండా గోదావరి లోయ అంతటా ప్రసరించింది. 1967 ఎన్నికల్లో గెలిచి ప్రతిపక్ష నాయకుడైన తరిమెల నాగిరెడ్డి 'శాసన సభ పాలెగాడు' అని ప్రకటించి విప్లవోద్యమ నిర్మాణానికి పూనుకుని వరంగల్‌కు 1968లో వచ్చాడు. అప్పటికి ములుగు సమితి ఉపాధ్యక్షుడుగా ఉన్న రామనర్సయ్య పదవికి రాజీనామా చేసి తరిమెల నాగిరెడ్డి, దేవులపల్లి వెంకటేశ్వరరావుల నాయకత్వంలో ములుగు ప్రాంతంలో విప్లవోద్యమ నిర్మాణానికి పూనుకున్నాడు. 1971లో ఆ పార్టీ నాయకత్వమంతా అరెస్టయి అప్పటికే అడవిలో ఉద్యమ నిర్మాణం చేస్తున్న చంద్రపుల్లారెడ్డి, రామనర్సయ్యలు అరెస్టు కాకుండా సాయుధ చర్యలు కొనసాగిస్తూ నాయకత్వంను విభేదిస్తూ సిపి నాయకత్వంలో విడిపోయారు. ఇంక అక్కడి నుంచీ అట్లూరి రంగారావు, కానూరి వెంకటేశ్వరరావు ఆ రాజకీయాలతోనే ప్రయాణం చేసారు. సిపి అమరత్వం తర్వాత 1985లో సిపిఐఎంఎల్ న్యూడెమోక్రసీ ఏర్పడినాక కానూరి దాదాపు పూర్తికాలపు కార్యకర్తగా దానితో ప్రయాణం చేసాడు. కాని 70 నుంచి 85 దాకా వరంగల్ విరసంలో కానూరి క్రియాశీల పాత్ర నిర్వహించడమే కాకుండా అప్పటి విద్యార్థులైన విరసం సభ్యులకు ఎందరికో నాటక, కళా సాంస్కృతిక రంగాల్లో శిక్షణ ఇచ్చాడు.

విరసంలో గంగిరెడ్డి రాసిన 'నాంది' నాటకం తర్వాత చాలా బుర్రకథలు, గేయమాలికలు రూపొందించి 1985 దాకా ప్రదర్శనలు నిర్వహించినవాడు కానూరియే. కానూరి నాకు 1968-69 మధ్య

కాలంలో పరిచయం కావడమే కె.వి.ఆర్. 'మహోదయం' ఉద్గ్రంథాన్ని గురజాడ బుర్రకథగా రాయడం ద్వారా. కానూరి 60 యేండ్ల కళారంగ అనుభవాలు రాసిన 'కథ గాని కథ' ప్రతి విప్లవ సాంస్కృతిక కార్యకర్త తప్పకుండా చదువవలసిన పుస్తకం. అందులో 16వ అధ్యాయం నుంచీ విరసంకు చాలా ఆసక్తిదాయకమైన చరిత్ర దొరుకుతుంది. జులై 4 హైదరాబాదులో విరసం ఏర్పడి, 10-7-1970 తేదీకి వరంగల్, వైజాగ్, గుంటూరు, కావలి పట్టణాలలో విరసం శాఖలు ఏర్పడినవి. అని నిర్దిష్టంగా రాయడంలో ఆ తేదీకి విప్లవోద్యమ చరిత్రలో చాలా ప్రాముఖ్యమున్నది. 10వ తేదీ సాయంత్రానికి తెలుగు నేలంతా వెంపటాపు సత్యం, ఆదిభట్ల కైలాసం 'ఎన్‌కౌంటర్' వార్తతో విషాద మేఘాలు కమ్ముకున్నాయి. వరంగల్‌లో విప్లవాభిమానులమైన సాహిత్యకారులం ఒక చోట చేరాం. ఖమ్మం మహాసభలకు ముమ్మరంగా ఏర్పాట్లు చేయడం ద్వారానే ఇది అధిగమించ మనుకున్నాం. ఖమ్మం మహాసభకు ఏదైనా కళా రూపం తయారు చేయాలనుకున్నాడు కానూరి. 'అప్పటికి కళారంగం ప్రారంభించాలనే ఉద్దేశంతో పిల్లలకు పాటలు అవీ నేర్పుతున్నాను' అని రాసుకున్నాడు. అయితే అప్పటికి రాసి రెడీగా ఉన్నది 'గురజాడ జీవిత చరిత్ర బుర్రకథ' మాత్రమే. అది ఖమ్మంలో ప్రదర్శించ లేదుగాని, ప్రజానాట్యమండలి నాటి అనుభవం ఉన్న కృష్ణ అనే కళాకారునితో కలిసి పలనాటి యుద్ధం బుర్రకథ శ్రీశ్రీ 'మహా ప్రస్థానం' పాటలు కొన్ని చొప్పించి చెప్పి మెప్పించాడు. కాని గురజాడ బుర్రకథను ఖమ్మం సభల్లో శ్రీశ్రీ, కొకు, రావి శాస్త్రి, కెవిర్ చదివి వినిపించుకొని మెచ్చుకున్నారు. అప్పటికీ, ఇప్పటికీ ఆ కథ చెప్పగలవాళ్లు దొరకలేదు గానీ 72 గుంటూరు విరసం సభల్లో ప్రింటెడ్ కాపీని కొడవటిగంటి ఆవిష్కరించాడు.

ఖమ్మంలో సాధ్యం కాని సొంత రచన ప్రదర్శన 1972 గుంటూరు విరసం మహాసభల్లో సాధ్యమైంది. అదే 'ప్రగతి' భాగోతం. కాంగ్రెస్‌లో గ్రూపులు, రివిజనిస్టు రాజకీయాలను ఎండగడుతూ రాసిన హాస్య, వ్యంగ్య రచన. ఆయన మాటల్లో చెప్పాలంటే 'ఏదో అవసరార్థం అది తయారు చేస్తే, అది ఆటంబాంబులా పేలింది'. ఈ భాగోతం దెబ్బై, ఎనభైల విరసం సభ్యులను, అభిమానులనెందరినో గాయకులుగా, నటులుగా తీర్చి దిద్దింది. స్వరాజ్యం, ఎన్.వెంకటయ్య, మదన్, బుచ్చయ్య, నారాయణరెడ్డి, ఎన్. రామ్‌గోపాల్, ఎన్. వేణుగోపాల్ అందరూ ఈ బాగోతంలో ఏదో ఒక పాత్ర అభినయించి మెప్పుపొందిన వాళ్లే. శ్రీకాకుళం వీరగాథ, బుర్రకథ, విప్లవ సింహం రామనర్సయ్య బుర్రకథ (78) నీలం రామచంద్రయ్య హరికథ, ఢిల్లీ మహారాణి 'ఇంద్రజాలం' కూచిపూడి భాగోతం, 1982లో సిరిసిల్లా ప్రతిఘటన ఒగ్గుకథ, 1984లో శ్రీకాకుళం వీరగాథ, జనగామ నృత్యకళారూపం, ఇంద్రవెల్లిపై పాట, 1985లో బొగ్గు పరిశ్రమ బాయి బాగోతం. ఇట్లా ఆయన రాయని కళా ప్రక్రియ, అంశం ఏమైనా ఉన్నాయా అంటే లేవనే చెప్పాలి.

అయితే కానూరి ప్రజా నాట్యమండలి, విరసం, అరుణోదయ - ఏ సంస్థలో పని చేసినా తాను కమ్యూనిస్టు పార్టీ సభ్యున్ననే క్రమ శిక్షణతో పని చేసాడు. ఆ క్రమంలో కమ్యూనిస్టు పార్టీలో వచ్చిన చీలికలు ఒక్కోసారి ఆయనకు బాధాకరంగా అనిపించినా, ఐక్యత కోరుకున్న ఆయన ఏదో ఒక నాయకత్వాన్ని క్రమశిక్షణతో స్వీకరించాడు.

1975 జనవరిలో అనంతపురంలో విరసం చీలికతో ఆయన బాధపడ్డాడు. చారుమజుందార్ రాజకీయాలను అభిమానించే విరసం సభ్యుల ప్రవర్తనను చాలా తీవ్రంగా విమర్శించాడు. (కథ గాని కథ - పేజీ 129) కానీ 1985 దాకా కూడా కాశీపతి నాయకత్వంలో ఆయన, నమ్ము, హెచ్చార్కె, నర్సింహరావు మొదలైన వారంతా విరసంతో కొనసాగారు.

1985లో న్యూడెమోక్రసీ ఏర్పడినపుడు గానీ వీరంతా విడిపోలేదు. అయితే అప్పుడు తనను, జీవన్‌ను నాయకత్వంలో పెట్టి మరో రచయితల సంఘం పెట్టాలన్న పార్టీ ప్రయత్నాలను ఆయన అంతగా హర్షించలేదుకానీ అంగీకరించాడు.

ఇటువంటి అంతస్సంఘర్షణ, అవగాహనల వల్లనే ఆయన 1985 నుంచి అరుణోదయ సాంస్కృతిక సంస్థ కార్యకలాపాలాకే పూర్తి కాలాన్ని ఇచ్చాడు. కాని అదే ఒకటిగా లేని పరిస్థితులొచ్చాయి కదా.

'కళలు వర్గాధీనాలు కనుక, శ్రామిక వర్గ కళలు శ్రామిక వర్గ పార్టీ చెప్పుచేతల్లో నడుచుకుంటున్నవి. మరి ఆ పార్టీల్లో చీలిక వస్తే కళారంగం గతి యేమిటి? అది కూడా చీలికలు, పేలికలు గాక తప్పదు. ఇదే నడుస్తున్న చరిత్ర. ఈ చీలిక ఉద్యమాలకు నష్టకరమూ బాధాకరమే... ఈ చీలిక జబ్బు అరుణోదయకే కాదు, విరసం సభ్యులకూ సోకింది' అని 85 చీలిక ఇష్టం లేని సందర్భంలో అభిప్రాయపడ్డాడు. (కథ గాని కథ 157)

బహుశా ఈ అవగాహన పరిణత దశలో 2006లో ఆయన ఒక ప్రతిపాదన చేసాడు. అప్పటికి విరసంపై 2005 ఆగస్టులో పెట్టిన నిషేధం, తొలగిపోవడం జరిగింది. 2006 జూన్‌లో హైదరాబాదులో జరిగిన విరసం మహాసభల్లో అరుణోదయ పాల్గొంటున్న సందర్భంలో ఆయన ఒక ప్రతిపాదన చేసాడు. అరుణోదయలో ఉన్న సాంస్కృతిక కార్యకర్తలు, కళాకారులు అందులో కొనసాగుతారు, రచయితలు విరసంలో చేరాలి అని. కాని కారణాలు ఏమోకానీ అది జరుగలేదు, విరసం ఆ ప్రతిపాదనను ఆహ్వానించింది.

కానూరికి తెలిసిన విషయాలు రెండే. వ్యవసాయం, వ్యవసాయ విప్లవం. రెండూ రెండు చేతులా తన అవగాహన మేరకు నిర్వహించాడు. తనకంటూ ఇల్లూ, పొలమూ ఏమీ మిగలకుండా ఖమ్మంలో న్యూడెమోక్రసీ ఆఫీసులో కన్ను మూసాడు.

గొర్రెపాటి మాధవరావు (మానవ హక్కుల వేదిక, నిజామాబాదు), డాక్టర్ ముత్యం (శాతవాహన విశ్వవిద్యాలయం, కరీంనగర్) కృషివల్ల ఆయన జీవిత కథ 2005లో అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య ప్రచురించింది. భాష, బాణీలు - వంటివి మావో చెప్పినట్లు ఈ తరానికి అనుసరణీయాలు కాకపోవచ్చు. జండర్ స్పృహ విషయంలో కృష్ణాబాయిగారు అభ్యంతరం చెప్పడాన్ని ప్రస్తావించి కూడా ఆయన తోసి పుచ్చాడు. అటువంటి అంశాల కోసం కూడా ఈ పుస్తకం చదివి తీరాలి. ఆయన సుదీర్ఘ నిరంతర కళా కృషీవలుడనేది మాత్రం నిర్వివాదాంశం.



పుస్తక సమీక్ష

# అత్యంత సహజంగా మొలకలు వేస్తున్న కవిత 'ఎగరాల్సిన సమయం'

- అరసవిల్లి కృష్ణ

మూడున్నర దశాబ్దాల క్రితం బతుకుదెరువు వెతుక్కుంటూ ఆ నేలకు పరాయి కావడం ఇవాల్టికి సరిపడనంత దుఃఖాన్నిస్తుంది. ఇంతకాలం గడిచాక కూడా. కళింగ సీమ తనదయిన బతుకుదెరువు పొందలేదు. వలసలు లేని కళింగ నేలను ఊహించలేం. అభివృద్ధి ఫలాలను అందుకున్నవారు కొంతమేర ఆర్థిక స్వేచ్ఛను పొందినా ఇంకా ఆ నేలపై అసమానతలున్నాయి. బతుకు పోరాటమున్నది. అభివృద్ధి నమూనా చేస్తున్న జీవన విధ్వంసమున్నది. విధ్వంస్వాన్ని నిరసించే ప్రజలున్నారు. కాలం అత్యంత సజీవమైనది కదా! నెత్తురోడుతున్న కాలంలో భాగమవుతూ అక్కడి ప్రజల జీవన ఆరాటాలను చిత్రించే సాహిత్యం విరివిగా వస్తున్నది. కళింగాంధ్ర తన ఆర్థిక అసమానతలను విప్పి చెప్పే సృజనకారుల్ని రూపొందించుకుంటుంది. ఎప్పటికప్పుడు కొత్త తరం తమ ప్రాంత జీవన విధ్వంసాల్ని హృదయంతో అంచనా వేస్తుంది. మారుతున్న కాలాన్ని, దాని మార్పుల్ని ప్రతి బిందువు దగ్గర నిలబడి సాహిత్యంలోకి తర్జుమా చేస్తున్నారు.

కళింగాంధ్ర రచయితలు ఆ ప్రాంతం మొత్తం జీవితాన్ని అక్కడి ప్రజల పోరాట పటిమను చిత్రిస్తున్నారు. తమని తాము విస్తరింప జేసుకుంటూ, సమస్యల మూలాల్లోకి వెళ్ళే ప్రయత్నం చేస్తున్నారు. ఎప్పటికప్పుడు సరికొత్తగా సాహిత్యావరణలోకి దారి చేసుకుంటున్నారు. కళింగాంధ్ర నుండి కథ, కవిత బలమైన సాహిత్య రూపం తీసుకుంటున్నాయి. ఎక్కడి రాపిడి ఉంటుందో, జీవితం ప్రశ్నగా మిగులుతుందో, వలసలు ఎక్కడ ఊపందుకుంటాయో, ఊర్లు ఖాళీ అయి, పిల్లలు ముసలివాళ్ళు మాత్రమే కనబడతారో.. అలాంటి నేల నుంచి కన్నీరొలికించే కవిత్వమే వస్తుంది. రాజ్యాన్ని ధిక్కరించే సృజన పురుడు పోసుకుంటుంది. ఆ కాలం సారం అది. ఇది కళింగాంధ్రకే పరిమితం కాదు. ఈ దేశంలో ఇలాంటి ప్రాంతాలెన్నో, వాటి పెనుగులాట కింద బతుకు శ్వాస ఆగిపోతున్న జీవితాలెన్నో బొడ్డు పేగు తెగిన నేల నుండి హఠాత్తుగా, వేరొక జీవన సంస్కృతిలోకి ప్రవేశించడం అది ఎలాంటి మానసిక భావోద్వేగాలకు కలిగిస్తుందో జీవనోత్సవం ఇగిరి పోయి మనుషులు ఎలాంటి యాంత్రిక అనుభవంలోనికి కట్టబడతారో తెలియంది కాదు. బహుశా ఇలాంటి నేపథ్యాల నుండి, తనని తాను ఆవిష్కరించుకున్న కవి బాల సుధాకర్ మౌళి కవితావరణలోకి తాజా కలంలా వచ్చిన కవి. తూర్పు దిక్కు నుంచి మొలిచిన వెలుగుదారి. ఆ వెలుగుకే శ్రీకాకుళ నక్సల్బరీ పోరాట దృశ్యం అంతర్లీనంగా ఉంది. ప్రపంచ వ్యాప్తంగా పెనుగులాడుతున్న వామపక్ష భావధార స్రవంతి ఉంది. స్థానిక వాతావరణమున్నది. అన్నిటికీ మించి ప్రజల పక్షాన నిలబడాలనే నిబద్ధత ఉన్నది. ఇన్ని లక్షణాలు ఉంటేనే గాని ఎవరయినా కవిగా బొమ్మ కట్టరు. ఆ బొమ్మ చలనంలోకి రావాలంటే రాజకీయార్థిక విషయాల పట్ల సరైన దృక్పథం ఉండాలి. కవిగా చూపుని విస్తరించుకున్నాడు కాబట్టే ఎగరాల్సిన సమయం అని అనగలిగాడు.

బాల సుధాకర్ మౌళి కవి విస్తరిస్తున్న కాలం (2004-2014) భారత దేశానికి సంబంధించినంత వరకు మొదటి దశ. రెండవ దశ ఆర్థిక సంస్కరణలు వేగవంతం కావడం, పాలకవర్గం దేశ సహజ సంపదలను బహుళ జాతి సంస్థలకు ధారాదత్తం చేసే క్రమం. ఈ వనరుల దోపిడీని నివారించేందుకు మొత్తం తన శక్తిని ధారపోసి రాజ్యంతో తలపడిన విప్లవోద్యమం, మొదటి, రెండవ దశ గ్రీన్‌హంట్ ప్రయోగం, అదే క్రమంలో అత్యంత వేగంగా ఆర్థిక సంస్కరణలను అమలు చేస్తున్న కాలం. మొత్తం ఈ క్రమంలో మనిషి నలిగిపోతున్న, అదృశ్యమవుతున్న స్థితిని కవిత్వం ద్వారా పట్టుకున్నాడు మౌళి. కాలం కవిని తయారు చేసుకున్నది. అదే సమయంలో కాలం అంచులపై నిలబడి కవి విస్తరించాడు. ఊహ తెలిసిన దగ్గర నుండి ఉగ్గబెట్టుకున్నదేదో కవిత్వంగా ఆవిష్కృతమయింది. సాంద్రత ఏర్పడింది. తానేమి రాయాలో, ఎలా రాయాలో అనే దృక్పథం పట్టుబడింది.



ఎగరాల్సిన సమయం
బాలసుధాకర్ మౌళి
ప్రచురణ : చంపావతి ప్రచురణలు
వెల : రు. 80/-; పేజీలు : 159

కవిత్వం పదాల కూర్పు కాదు. అదొక అల్లిక కళ. మౌళి చుట్టూ ఉన్న వాతావరణం కవిత్వం కావడానికి గల సామాగ్రిన్నిచ్చింది. దాన్ని కవితారూపంలోకి అనువదించడమెట్లా! కవిత్వం చేయడమెలా! దానికి తగిన సాధన అవసరం. అలవోకగా కాకుండా కవితా నిర్మాణం పట్ల ఒకింత దృష్టి పెట్టడం అవసరం. అధ్యయనం, ప్రపంచ వ్యాప్తంగా, తన ముందటి కవుల రచనా శైలిపట్ల అవగాహనను పెంచుకొని, వస్తువుని ఎలా చెబితే కవిత్వమవుతుంది అనే ఎరుకతో కవితా రూపానికి మెరుగులు దిద్దుకున్న కవి. తనదయిన శిల్పం గాఢంగా చెప్పడం, భావ తీవ్రత. నిజానికి రాజకీయ కవిత్వం శిల్పపరమైన రూపం తీసుకోకపోతే వచనమై తేలిపోతుంది.

కల్లోల దేశాన్ని / కవిత్వం చేస్తున్నప్పుడు,
కవిత్వం / పసిపిల్లలా ఉండాలనుకోవడంలో

తప్పేముంది? కల్లోల దేశం అనేది అలజడికి, ఘర్షణలకి సాంకేతంగా తీసుకొని కవిత్వం పసిపిల్ల అనడం ద్వారా, సున్నితమైన భావాన్ని రెండింటి మధ్య కలిపి ఉంచడం. అంటే కల్లోలం, పసిపిల్ల ఈ రెండు పదాల మధ్య ఓ రాజకీయార్థిక ఘటనను చెప్పడం మౌళి కవితారూపంలో ఓ ప్రధాన లక్షణం. చెప్పే తీరులో సృజనాత్మకత

లోపిస్తే కవితా రచన పలచబడుతుంది. వస్తువును హృదయ గతం చేసుకోవడమే కాదు. ఆ వస్తువుకి తగిన శిల్పం కవికి పట్టుబడాలి. ఎలా చెప్పాలి! ఎలా చెబుతున్నాం? కవిత నడక ఎలా ఉంది? ఈ మూడింటిపై కవికి శ్రద్ధ ఉండాలి. శ్రద్ధ మాత్రమే చాలదు. కవిత నడిపే తీరులో రెండు విరుద్ధాంశాలను చెప్పేటప్పుడు నేర్పుతో వాటిని కలగలపే అల్లిక ఉండాలి. కవిత్వం కవిత్వం కోసం కాదు. అది అశేష ప్రజారాశుల గుండె తడి అనే స్పృహ ఉన్నప్పుడు ఇలాంటి కవితా నిర్మాణం సాధ్య పడుతుంది.

రెక్కలు తెగి కొన్ని పక్షులు
నేలపై, నెత్తుటి మడుగుల్లో ప్రాణాలు విడిచాయి
ఇంకొన్ని పక్షులు
శత్రువుకు బందీలుగా చిక్కి
నాలుగు గోడల పంజరంలో మరణిస్తున్నాయి
కొన్ని పక్షులు మాత్రం
చెట్టు స్వప్నాన్ని నిజం చేస్తూ

ఇప్పటికే యుద్ధం కొనసాగిస్తూనే ఉన్నాయి. విప్లవోద్యమంలో వ్యక్తులు మృత్యువును సైతం ధిక్కరిస్తూ ప్రజల విజయం కోసం ఎంతటి త్యాగానికి సిద్ధపడతారో, కలను వాస్తవం చేయడానికి ఎంతటి రాజ్య నిర్బంధానికి కూడా తలవంచరో, మరణం అత్యంత సహజమైనదిగా విప్లవకారులు ఎలా భావిస్తారో చెప్పిన కవిత. కవి విప్లవకారులను పక్షులతో పోలిక తేవడం, చెట్టు విశాల భూభాగానికి ప్రతీకగా, ప్రజల ఆకాంక్షలను చెట్టుతో పోల్చడం మౌళి కవితా నిర్మాణశైలి. నిజానికి కవిత్వం వాచ్యంగా ఉండకూడదు. వస్తువును కవిత్వం చేసే క్రమంలో ఊహాశీలత దానికి తగిన కవితా నిర్మాణం ఉండాలి. కవి ఊహకు పాఠకుని ఆలోచనకు మధ్య కలగలిసే ఓ దారి ఉండాలి. అప్పుడే కవిత హృదయ సంబంధి కావడమే కాదు. కవి కల్పించిన వాతావరణంలోకి పాఠకుడు జొరబడతాడు. కవి చెప్పేదేదో తన లోపలికి తీసుకుంటాడు. కవి అదృశ్యమయి కవిత ప్రయాణం చేస్తుంది. ఈ టెక్నిక్‌ని సాధన ద్వారా సాధించినవాడు మౌళి.

స్వప్నం చేతిలో ఆయుధముంది / భూమి తల్లి విముక్తికై,
వేల వేల అరుణోదయాల కాంతిని / కలగంటుంది
స్వప్నం / నా దేశ ప్రజల ఆకాంక్షల్లో పుట్టిన
ఎర్ర కలువ. (అరణ్య స్వప్నం)

మౌళి కవిత్వంలో చాలా భాగం విప్లవోద్యమ ఆకాంక్షల వ్యక్తీకరణగా ఉంటుంది. తను చూస్తున్న గమనిస్తున్న, విప్లవోద్యమ గమనం మాత్రమే కాదు. విప్లవం విజయవంతం కావాలనే ఆకాంక్ష ఉన్న కవి. విప్లవాన్ని ఆశిస్తున్నాడంటే తను భాగమవుతున్న, తనతో సంభాషిస్తున్న సమాజ చలనం పట్ల అసంతృప్తి అసహనం మాత్రమే కాదు, ఏదో ఓ కుదుపు కావాలని, ఆ కుదుపు అన్ని వర్గాల ప్రజలకు భరోసా ఇవ్వగలగాలని, దేశ ప్రజల ఆకాంక్షలతో తనని తాను మిళితం చేసుకున్న కవి.

నీక్కావలసింది / అరణ్యమే కదా
వెళ్ళు / అరణ్యానికి నీ చేతులను ఇవ్వు
అరణ్యానికి నీ కళ్ళని ఇవ్వు

అరణ్యానికి నీ అణువణువునూ సమర్పించు (ఎగరాల్సిన సమయం) కవి లోపల అరణ్యం విస్తరించడమంటే అరణ్యాన్ని కల గనడమంటే, ఇక చివరి ఆశ అరణ్యమే అనే భావన ఏర్పడినప్పుడు సమూహాన్ని ఉద్దేశించి అరణ్యంలో భాగం కమ్మని ప్రేరేపిస్తున్నాడు. ఇక్కడ భాగం కావడమంటే ఓ పోరాట శీలతలో ఐక్యం కావడం, అంతిమంగా ప్రజలవైపు నిలబడే ఓ పోరాట దృశ్యంలో విప్లవాన్ని ప్రజలే ఎత్తిపట్టడం. అరణ్యం మినహా ఈ దేశానికి వేరే చూపులేదు. వేరే ఊహ లేదు. అయోమయంలో ఉన్న రాజ్య వ్యవస్థకి అసలు సిసలు ప్రత్యామ్నాయం అరణ్యమే. కవి విప్లవోద్యమ ప్రభావానికి లోను కాకపోతే పోరాటమే ప్రజల చివరి ఆశ అని గుర్తించకపోతే బహుశా అతని కవిత్వంలోకి అరణ్యం దారి చేసుకోదు.

కమాండర్
ఈ కాల
గ్రీష్మానికి బలి కాదు
....
ఏనాటికైనా చరిత్ర నది
సత్యం వైపే ప్రవహిస్తుంది
ప్రజలు గెలుస్తారు (పడమటి ఆకాశంపై తూర్పు గీతం)

నిజానికి ఈ కవిత వెనుజులా ప్రజల కోసం రాసినా స్థల కాలాల మినహాయింపు. అంతిమంగా ప్రజలే విజయం సాధిస్తారు. రాజ్యం అణిచివేత, ఆధిపత్యం ఏదో ఓ దశ వరకు కొనసాగవచ్చు. కాని ఉవ్వెత్తున లేచే ప్రజాగ్రహం ముందు రాజ్యం తలవంచక తప్పదు. అంత వరకు పోరాటం సమాయత్తమవుతుంది, విస్తరిస్తుంది.

మౌళి కవిత్వంలో అనేక పాయలున్నాయి. విప్లవోద్యమం, ప్రపంచీకరణ, అగ్రకుల ఆధిపత్యం. అదే సమయంలో తను నిత్యం గమనించే సున్నితమైన అంశాలను కవిగా ఈ మొత్తం వాతావరణాన్ని తనలో జీర్ణం చేసుకుంటేనే తప్ప సాంద్రమైన కవిగా రూపొందలేడు.

లక్షింపేటా... లక్షింపేటా
నీ గుండె సమాధులపై
ఆరిన నెత్తుటి దీపాల సాక్షిగా
భూమి కోసం...
భుక్తి కోసం...
శ్రమగీతాలు సారం చేసే
పంచమ కోయిలల తెగిన దేహ సముద్రాలపై
రేపటి ఎర్ర ఉషోదయాల పెను తుపాను

పోటెత్తుతుంది (దేహ సముద్రాలపై) లక్షింపేటలో దళితుల ఊచకోతపై కవి స్పందన అధికార మార్పిడి జరిగి ఆరున్నర దశాబ్దాలు గడిచినా, దళితులపై దాడులు వర్తమాన భారతదేశంలో పునరావృత్తమవుతూనే ఉన్నాయి. దళితులు, అణగారిన వర్గాలు, భూమిపై హక్కును పొందాలంటే, ఆత్మగౌరవానికి, భూమిని ఆధారం చేసుకోవాలనే దళితుల ఆకాంక్షలను చిదిమివేసే అగ్రకులం ఓ వైపు. దానికి మద్దతుగా నిలిచే రాజ్యాంగ యంత్రం మరోవైపు. వీటి మధ్య చిన్నాభిన్నమయిన దళితుల జీవితాన్ని ఆర్ద్రతతో చిత్రించిన కవిత.

బెస్తవాళ్ళ జీవితాలు కల్లోలితమైనవి
ఆటుపోటులకు, గుర్యే ఒడ్డులవలె
బెస్తవాళ్ళ హృదయాలు విశాలమైనవి
తమ జీవితాలను శాసించే సముద్రం లాగే,

కోస్తాంధ్రలో తొమ్మిది వందల కిలోమీటర్లు పైబడి విస్తరించిన సముద్ర తీర ప్రాంతముంది. ఈ తీర ప్రాంతంపై మత్స్యకార్ల కుటుంబాలు ఆధారపడి ఉన్నాయి. చేపల వేట ద్వారా జీవనోపాధి

పొందుతున్న వారిపై రాజ్యం కన్ను పడింది. తన అసమ అభివృద్ధిలో భాగంగా మొత్తం తీరప్రాంతాన్ని పారిశ్రామిక కారిడార్‌గా రూపొందించడానికి ప్రయత్నాలు చేస్తుంది. ఈ నేపథ్యంలో మత్స్యకారులు మొత్తంగా విస్థాపనకు గురయ్యే అవకాశమున్నది. వారిదైన జీవన సంస్కృతిని కోల్పోయే ప్రమాదమున్నది. వారి జీవితాల్లోని కల్లోలాన్ని వ్యక్తీకరించే కవిత. బాలసుధాకర్ మౌళి అన్ని అంశాలను తడిమిన కవి. శ్రీకాకుళంలో థర్మల్ ప్లాంట్‌లకు వ్యతిరేకంగా గళం విప్పిన కవి. సోంపేట పోలీసు కాల్పులను నిరసించిన కవి. స్పష్టమైన రాజకీయ అవగాహన మాత్రమే చాలదు. పీడితుల తరఫున గొంతు విప్పితే సరిపోదు. ఎప్పటికప్పుడు కవిగా తనని తాను పదును పెట్టుకోవడమే మౌళి ముందున్న ప్రశ్న. కళింగాంధ్ర అనే వెనుకబడిన ప్రాంతం నుండి కవితావరణలోకి ప్రవేశించిన కవి ప్రపంచం తీరు తెన్నులను గమనించి తన కవిత్వంలో పలికించిన కవి. ఎగరాల్సిన సమయం మౌళి మొదటి కవితా సంపుటి. ఓ పదేళ్ళ సంక్షుభిత కాలం ఓ కవిని తయారు చేసింది. తూర్పు దిక్కున ఉదయించిన నక్సల్‌బరి ప్రేరణ అయింది. ఉద్దీపన అయింది. విప్లవోద్యమం నుండి వైదొలగిన వాళ్ళు, దూరం జరిగిన వాళ్ళు తరచూ కొన్ని ప్రశ్నలు వేస్తారు. సందేహాలు ప్రకటిస్తారు. విప్లవోద్యమ ప్రభావం ఎక్కడ ఉన్నదని! హృదయం ఉండాల్సిన చోట ఉండే మౌళి వంటి కవులు అత్యంత తాజాగా మొలకలు వేస్తారు. ఎగరాల్సిన సమయం తన తొలి సంపుటి కాబట్టి తన తర్వాత మజిలీ ఎలా ఉంటుందో ఊహించలేం. కవిత్వం సామాజిక బాధ్యత అనుకుంటే, అణగారిన ప్రజల గొంతుక అనుకుంటే, అతను ప్రజల వెలుగులో ప్రయాణిస్తాడు. కవిత్వం కీర్తి కండూతి కోసం రాస్తే అంగీకరించడం కష్టం. కరిగి కన్నీరై పలవరించక పోతే, కవిత్వం ద్వారా వచ్చే గుర్తింపుకు అవల ప్రజా జీవితమున్నది అని గుర్తించకపోతే కవి దారి తప్పిపోతాడు. ఈ సూత్రం మౌళికి మాత్రమే వర్తించదు. కవిత్వం నిమగ్నతతో రాసే అందరికీ వర్తిస్తుంది.

మౌళిపై తన ముందరి కవుల ప్రభావమున్నది. చదువరిగా వారి నుండి ఉత్తేజం పొందవచ్చుగాని. ఆ ప్రభావాల నుండి బయటపడాలి. కవిత్వం అల్లిక మౌళికి తెలుసు. ఆ అల్లిక తనదయిన గొంతును పట్టి ఇవ్వాలి. వస్తు రూప శిల్పాల సమ్మేళనంలో తనదయిన సొంత శైలిని బాలసుధాకర్ మౌళి పట్టుకోగలగాలి. తన ప్రాంత ప్రజల భాషను స్థానీయతను కవిత్వంలో పలికించాలి. నిర్మాణపరమైన దృష్టి మాత్రమే చాలదు. వస్తువు పట్ల అవగాహన ఉంటే సరిపోదు. ఈ మొత్తం కవితలో ఎలా పలుకుతుందో తూకం ఉండాలి. ఈ సంపుటికి ముందు మాట రాసిన శివారెడ్డి ఇతర కవుల కవిత్వం మంచి నేర్చుకోవాల్సిందే. తనను తాను రిపీట్ చేసుకోకూడదు. మోనాటనీ రాకుండా చూసుకోవాలి . ఈ మాట సుధాకర్ మౌళి గమనంలో ఉంచుకోవాలి.

ఆ కుర్రాడు
కవిత్వం రాస్తాడు
....
ఆకలి బాధ ఎరిగిన ఆ కుర్రాడు
కచ్చితంగా తిరుగుబాటు కవిత్వమే రాస్తాడు!



పత్రికా ప్రకటన :

## వసంతరేఖ పుస్తకావిష్కరణ సభపై దాడి చేసిన దుండగుల మీద ప్రభుత్వం చర్య తీసుకోవాలి

మార్చి 24వ తేది మంగళవారం మహబూబ్‌నగర్ జిల్లా వనపర్తిలో కిరణ్‌కుమార్ అనే ఉపాధ్యాయుడు రచించిన వసంతరేఖ పుస్తకావిష్కరణ సభ జరుగుతుండగా ఆర్.ఎస్.ఎస్. అనుబంధ హిందూ సంస్థలకు చెందిన దుండగులు సభను అడ్డుకొని దౌర్జన్యానికి దిగారు. సభలో విరసం కార్యవర్గ సభ్యుడు కాశీం మాట్లాడుతుండగా మైకు లాగిపడేసి దాడికి పాల్పడ్డారు. వసంతరేఖ పుస్తకంలో వాళ్లకు నచ్చని విషయాలు ఉన్నాయని భౌతిక దాడికి తెబడ్డారు. రాముడిని గురించి అనుచిత వ్యాఖ్యాలున్నాయని అల్లరి చేశారు. భావాలపై భౌతిక దాడిని విరసం తీవ్రంగా ఖండిస్తోంది. రామాయణం గురించి, అందులోని పాత్రల గురించి వందలాది కథలు ప్రచారంలో ఉన్నాయి. చారిత్రక క్రమంలో రాచరికం అంతమయ్యి ప్రజాస్వామిక భావాలు పెంపొందాక పెరిగిన చైతన్యంతో దళితులు, స్త్రీలు రామాయణ ధర్మాన్ని విమర్శిస్తూ వేలాది రచనలు చేశారు. సుప్రసిద్ధమైన అంబేద్కర్ రచనలు ఉండనే ఉన్నాయి. అసమానతను, అణచివేతను బోధించే ప్రాచీన ధర్మసూత్రాలు ప్రశ్నలకు గురికాక తప్పదు. భిన్నాభిప్రాయాలను చర్చకు పెట్టినప్పుడు అవతలి పక్షం వారు చర్చ ద్వారానే సమాధానం చెప్పాలిగాని దాడులకు దిగడం అప్రజాస్వామికం అవుతుంది. ఇటువంటి సందర్భాలలో చట్టం జోక్యం చేసుకుని భావప్రకటనా స్వేచ్ఛకు భరోసా ఇవ్వాలి. కానీ జరుగుతున్నదేమిటంటే దౌర్జన్యకారులు తెగబడుతుంటే పోలీసులు ప్రేక్షక పాత్ర వహిస్తున్నారు. దాడికి దిగిన వారిని అడ్డుకోకపోవడం అంటే ఆ దాడిని సమర్థించడమే. వనపర్తిలో దుండగులు చేసిన రభసంతా చేసి, వారే బందుకు కూడా పిలుపివ్వడం చూస్తుంటే, తమిళ రచయిత పెరుమాళ్ మురుగున్‌పై దాడి ఉదంతం గుర్తుకు వస్తోంది. తెలంగాణ ముఖ్యమంత్రి దేవాలయాల్లో, చర్చీల్లో, మసీదుల్లో ప్రార్థనలు చేసినంత మాత్రాన మతసామరస్యాన్ని కాపాడినట్లు కాదు. సెక్యులరిజాన్ని చాటినట్లు అసలే కాదు. మతోన్మాద దాడుల్ని ప్రభుత్వం ఏ విధంగా అడ్డుకుంటుందో చెప్పాలి. తక్షణం పుస్తకావిష్కరణ సభపై దాడి చేసిన దుండగుల్ని అరెస్టు చేసి తగిన చర్య తీసుకోవాలి.

రోజురోజుకూ మతం పేరిట జరుగుతున్న దౌర్జన్యాలు, హింసాకాండను చూస్తే మన సమాజం ప్రమాదకర పరిస్థితులవైపు నెట్టబడుతోందని అర్థమవుతోంది. భిన్నసంస్కృతులపై, భిన్నాభిప్రాయాలపై, భావ ప్రకటనా స్వేచ్ఛపై, జరుగుతున్న దాడులకు వ్యతిరేకంగా ప్రజాస్వామిక వాదులందరూ ఏకమై నిరసన తెలపాల్సిందిగా రచయితలకు, ప్రజా సంఘాలకు, విద్యార్థులకు విరసం విజ్ఞప్తి చేస్తున్నది.

– పి. వరలక్ష్మి (విరసం కార్యదర్శి), పాణి, రాంకి (విరసం కార్యవర్గ సభ్యుడు)
రివేరా (హైదరాబాద్ సిటీ యూనిట్ కన్వీనర్)

తేది : 25-03-2015

# సాంస్కృతిక రంగంలో రాలిపోయిన రెండు ఎర్ర నక్షత్రాలు

- వి.వి.

1972లో ఏర్పడిన జననాట్యమండలి సంస్థాపక సభ్యుడు, ఖవాలీ బాలన్నగా, చాచాగా తెలిసిన వాళ్లందరూ పిలిచే బాలన్న ఒక కార్మిక వర్గ పుత్రుడుగా 84 సంవత్సరాల నిండు జీవితం గడిపి 24 ఫిబ్రవరి ఉదయం ఏడు గంటలకు అనారోగ్యంతో అమరుడయ్యాడు. సికిందరాబాదుకు ఎనిమిది కిలోమీటర్ల దూరంలో ఉన్న గొల్లగూడలో మడుపు బాలయ్య జన్మించాడు. ఎం.ఇ.ఎస్. మిలిటరీ హాస్పటల్ లాల్‌బజార్‌లో వంటగాడి(కుక్)గా పని చేసి పదవీ విరమణ చేసాడు. ఆయన సహచరి బాలమణి పదిహేను సంవత్సరాల క్రితమే చనిపోయింది. ఆయనకిద్దరు కుమారులు వెంకటేశ్, శ్రీనివాస్. కూతురు స్వరూప. కుమారులు ప్రైవేటు కంపెనీలో పని చేస్తున్నారు. భార్య చనిపోయిన దగ్గర్నించీ చిన్న కుమారుడు శ్రీనివాస్ దగ్గర ఉంటున్నాడు.

1964లో నెహ్రూ మరణంతో బుద్ధి జీవుల్లో ప్రగతిశీల భావాలు కలవాళ్లలో ఆయన ద్వారా సామ్యవాదం వస్తుందనుకున్న భ్రమలు తొలగడం ప్రారంభమైంది. ఆదర్శాలు, విలువలు మిగుల్చుకున్న వాళ్లు 1964లో కమ్యూనిస్టు పార్టీలో వచ్చిన చీలిక కూడ వర్గపోరాటం ఆశించే వాళ్లకు ఒక ఆలంబన అవుతుందని భ్రమపడ్డారు. ఆ సంధి కాలంలో సాహిత్య రంగంలో కాళీపట్నం రామారావు 'యజ్ఞం' కథ, కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు 'రాత్రి' కవితా సంకలనం చేసిన ప్రయత్నాల వంటివే సికిందరాబాదు అల్వాల్ నుంచి మొదట 'కికి' పత్రిక పెట్టిన బి. నర్సింగరావు 'ఆర్ట్ లవర్స్' కళాబృందం ద్వారా చేసాడు. దిగంబర కవులు (1965) యువతరాన్ని ఒక విలువల, ఆదర్శాల అన్వేషణలోకి సాహసికంగా వెళ్లవలసిందిగా పురికొల్పుతున్న రోజుల్లో చైనాలో శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవం 1966లో జరిగింది. దాని ప్రభావంలోనే నక్సల్బరీలో వసంత మేఘం 1967 మేలో గర్జించింది.

బి. నర్సింగరావు, ప్రజాగాయకుడు గద్దరు ఈ కొత్త గాలులకు ఆకర్షితులవుతున్న కాలంలోనే ఆర్ట్స్ లవర్స్‌కు కొండపల్లి సీతారామయ్యతో పరిచయమైంది. అప్పటికే వంతెన కింద నెత్తురు చాలా ప్రవహించింది. శ్రీకాకుళ రైతాంగ పోరాటం సెట్‌బ్యాక్‌కు గురవుతున్న దశ 1970లో విరసం ఏర్పడింది. ఖమ్మం సుబ్బారావు పాణిగ్రాహి నగర్‌లో విరసం ప్రథమ మహాసభలు జరిగాయి. రచయితలతో పాటు సాంస్కృతిక కళాకారుల, చిత్రకారుల సంఘటనలు కూడా ఏర్పాటు చేయాలనే ఒక ప్రయత్నాన్ని నరసింగరావు ప్రారంభించాడు. పాణిగ్రాహినగర్ మహాసభల్లో విప్లవ చిత్రకళా ప్రదర్శన, చంద్ర చిత్రాలు, ఆ తర్వాత కాలంలో విరసం లోగోగా మారిన ఆయన సుత్తికొడవలి, కలం చిత్రం ఇందుకు ప్రేరణ అయ్యాయి. 1971లో అల్వాల్‌లో రెండు రోజులు చిత్రకారుల వర్క్‌షాప్ కూడ నడిపి బి. నర్సింగరావు లక్ష్మాగౌడ్, ఎ. సూర్యప్రకాశ్, మనోహన్‌దత్ వంటి సుప్రసిద్ధ చిత్రకారులను కూడా పిలిచి ఒక ప్రయత్నం చేసాడు కానీ అది ముసు సాగలేదు. కాని సాంస్కృతిక రంగంలో, ప్రదర్శన కళాకారుల బృందంగా ఆర్ట్ లవర్స్ ఉండడం, కంటోన్మెంట్ ప్రాంతంలో జానపద కళలకు, పాటకు పుట్టినిల్లయిన దళిత కార్మిక వర్గ సమాజం ఉండడం, ఈ ముడిసరుకును, మట్టి మనుషుల్లో నుంచి వచ్చిన నేల పుత్రులయిన సృజన కళాకారులను పట్టుకోగల నైపుణ్యం 1940ల ప్రజా నాట్యమండలి అనుభవాల వల్ల కె.ఎస్.కు ఉండడం, 1972లో 'జన నాట్యమండలి' ఆవిర్భావం ద్వారా ఆ బ్రేక్‌త్రూ (విస్ఫోటనం) సాధ్యమైంది. అక్షరాలా 'జన నాట్యమండలి' జనం గుండెల చప్పుడయింది. ప్రపంచ వ్యాప్తంగా విప్లవకళల, సాంస్కృతిక రంగం చరిత్ర రాయబడినపుడు – అందులో సికిందరాబాదు కంటోన్మెంటు ప్రాంతం – అది సైనిక స్థావరమైనందుకు కాదు, దాని నీడన, దాని అణచివేతలో, ఆధిపత్య వాతావరణంలో, నిర్బంధంలో తలఎత్తే కళలు, సంస్కృతికి ఒక 'అంకుల్' సినిమా, ఒక జననాట్యమండలి 'బీదల పాట్లు' చిరస్థాయిగా నిలిచిపోతాయి.

ఆర్ట్ లవర్స్ నుంచి వచ్చి 'జన నాట్యమండలి'గా ట్రాన్స్‌ఫామ్ అయిన కళాకారులు ఒక ప్రత్యామ్నాయ ప్రజా సంస్కృతిని, జానపద సాంస్కృతిక జీవనాన్ని విప్లవ చైతన్యంతో నిర్మించారు. మట్టి పొరల్లోనూ, మట్టి చేతుల పనిముట్లలోనూ, మట్టి చేతులు కట్టిన పాటలు, ఉపయోగించిన వాయిద్యాలు విప్లవ సందేశానికి ఎంత వాహికలయ్యాయో, సృజనాత్మక నైపుణ్యాలకు, నవనవోన్మేష ప్రతిభకు అంత గుర్తింపు పొందాయి. సామూహిక పాట, డప్పు, దాన్సు, డప్పు దాన్సు, ప్రజా నాటక వేదిక – అన్నీ ఎంత సమిష్టి చైతన్యానికి ప్రతీకలయ్యాయో, అంత వ్యక్తిత్వ వికాసాలకు దోహదం చేసాయి. విప్లవ శ్రేణుల్లోనే కాదు, సాంస్కృతిక రంగంలో చిరకాలం నిలిచేపోయే లెజెండర్ పేర్లయ్యాయి. ఎంతో ఉగ్గబట్టుకొని అమరుల నుంచే ఉదాహరణలు ఇవ్వాలంటే అట్లా పుట్టుకొచ్చిన వాళ్లే డోలక్ దయానంద్, ఖవాలీ బాలన్న. ప్రతి ప్రదర్శనా కళా ప్రక్రియకు జన నాట్యమండలి తొలితరం నుంచి అందరి పెదవులపై ఆడే పేర్లు ఎన్నని! కొందరు స్మృతి పథంలోంచి జారిపోయారు. కొందరు విస్మృతికి గురయ్యారు. కొందరు సాధారణ జీవితాల్లోకి వెళ్లిపోయారు. కొందరు ఈనాటికీ గుండెల్లో కుంపటిలో నిప్పు వలె జననాట్య మండలిని పొదవుకొని ఉన్నారు. చివరిదాకా జన నాట్యమండలి కళాకారులనే గుర్తింపు తప్ప మరే బిరుదు, గుర్తింపు ఆశించకుండా అమరులైన కళాకారులు డోలక్ దయానంద్, ఖావాలీ బాలన్న. డోలక్ దయానంద్ అర్ధాయుష్కుడుగానే రాజ్యం చేతుల్లో అమరుడయ్యాడు. ఆఖరి నిమిషం దాకా తెలుగు నేల మీదనే కాదు పంజాబ్ దాకా జననాట్యమండలి వర్క్‌షాప్‌లలో శిక్షణ ఇస్తూ అటువంటి విప్లవ సాంస్కృతిక శిబిరంలో ఉండగానే శత్రువు చేతుల్లో పడి చిత్రహింసలకు గురయి అమరుడయ్యాడు. ఖవాలీ బాలన్న జననాట్య మండలి అప్రకటిత నిషేధానికి 1985లో గురయ్యే దాకా తన ఖవాలీలతో లక్షలాది మందిని ఉత్రూత లూగించాడు. మళ్లీ 1990 నుంచీ జననాట్య మండలి జ్ఞాతంగా పని చేసినంత కాలం పని చేసాడు. 2002 ఎఐఎల్ఆర్‌సి మహాసభల దాకా సాంస్కృతిక ప్రదర్శనల్లో పాల్గొన్నాడు. వృద్ధాప్యం, భార్యా వియోగం, అనారోగ్యంతో ప్రజా కార్యకలాపాల్లోకి రాలేక పోయినపుడు కూడ జననాట్యమండలి

సంస్కృతితోనే అవే జ్ఞాపకాలు, అవే కలలు, అదే జీవితంగా ఆఖరి క్షణం వరకు జీవించాడు. చాచా అంటే బేటా అనే నిండు కళాకారుని హృదయం ఎప్పుడూ కామ్రేడ్స్‌కి తెరచుకున్న తలుపులే, తలపులే.

'నీవు నిజం తెలుసుకోవరో కూలన్న

నువు నీతితో నడవాలిరో ఓరన్న

నువు నిజం తెలుసుకోవాలి – నీతితో నడవాలి'

అనే జననాట్య మండలి ఖవాలీని పాడడంతో బాలన్న ఖవాలీ బాలన్నగా గుర్తింపు పొందాడు. ఆజన్మాంతం ఆ పాటలోని ప్రతి మాటకు ఆచరణగా జీవించాడు.

నువు ఎర్రజెండ నీడలో కూలన్న, నిజం తెలుసుకోవాలి, నీతితో బతకాలి ఎర్ర జెండకే అంకితం కావాలన్నట్లుగా జీవించాడు.

గద్దర్ రాసిన సుప్రసిద్ధ ఖవాలీ 'రిక్షా తొక్కే రహీమన్న, రాళ్లు కొట్టే రామన్న' పాటను హార్మోనియమ్ వాయిస్తూ బాలన్న పాడుతూ ఉంటే ఉర్దూ ఖవాలీల అనుభవం లేని తెలుగు విప్లవాభిమానులు గానీ, పాత బస్తీతో ఆ పరిచయమున్న పేద ముస్లింలుగానీ ఆయనలో తమ లోగొంతుల వ్యక్తీకరణను అనుభవించి ఉత్తేజితులయ్యేవాళ్లు.

హిందీ, ఉర్దూల్లో కూడ అనువదించిన 'ఆయారే మేడే' పాటను ఆ తర్వాత కాలంలో నృత్యరూపకంగా ప్రదర్శించడానికన్నా ముందు ఆయన మేడే కార్మిక గీతాన్ని కూడా హార్మోనియంపై ఖవాలీగా ఆలపించేవాడు.

'పోదామురో జన సేనలో కలిసి' అని గద్దర్ రాసిన దప్పు డ్యాన్సు పాటకు భూపాల్ కొరియోగ్రాఫీ డ్యాన్సు ఫామ్ ఇవ్వగా, ఇద్దరు దప్పులు వాయిస్తుండగా మధ్యలో బాలయ్య పాడుతూ డ్యాన్సు చేసేవాడు. అంటే ఖవాలీ పాటను డ్యాన్సు రూపకంగా రూపొందించి విశేష జనాదరణకు పాత్రుడయ్యారు.

ఖవాలీ బాలన్న వృత్తి రీత్యా కుక్ బాలన్న కూడా కావడం వల్ల ఆయన తన పాకశాస్త్ర కళను కూడా విప్లవ శిబిరానికే అంకితం చేసాడు. జననాట్యమండలి, విరసం, ఆర్ఎస్‌యు, ఆర్‌వైఎల్, రైతు కూలీ సంఘం, ఎఐఎల్ఆర్‌సి వంటి విప్లవ ప్రజా సంఘాల సభల్లో వేదిక మీదనో, గ్రీన్ రూంలోనో లేనపుడు ఆయన కమ్యూన్ కిచెన్‌లోనో వడ్డనలోనో ఉన్నాడని అనుకోవాల్సిందే. ఆయన బాలుడు. బాలలకాయన చాచా. అటువంటి బాల హృదయంతోనే అందరినీ తన పిల్లలనుకున్న బాలన్న చిరస్మరణీయుడు. (ప్రజా సాంస్కృతికోద్యమ ప్రతిధ్వని 'శబ్దం' – జనవరి – మార్చి 2015కు కృతజ్ఞతలతో)

**సుందర్ మరాండీ :**

ఖవాలీ బాలన్న అమరుడైన మూడు రోజులకే 27 ఫిబ్రవరి రోజు మరో సాంస్కృతిక కళాకారుడు సుందర్ మరాండీ ఝార్ఖండ్‌లో అనారోగ్యంతో అమరుడయ్యాడు. అయితే ఆయన ఏభయ్యేళ్లే బతికాడు. ఝార్ఖండ్‌లో పీర్‌టాంగ్ అనే ప్రాంతంలో నిరుపేద సంథాలీ ఆదివాసీ సమాజంలో జన్మించి ఇరవై ఏడేళ్లు ఎడతెగకుండా ప్రజా సాంస్కృతిక రంగంలో పని చేసాడు. ఆయన కళ్లు తెరచేవరకే అప్పటికింకా బీహార్ రాష్ట్రంగా ఉన్న మైదాన ప్రాంతంలోనూ సంథాలీ ఆదివాసులున్న అరణ్యంలోనూ నక్సల్బరీ, విప్లవ భేరీలు మోగుతున్న చారుమజుందార్, కన్హయ్ ఛటర్జీలు రెండు పాయలుగా భారతీయ సమాజంలోకి ప్రవేశపెట్టిన నక్సల్బరీ ప్రవాహం సుందర్ మరాండీ బాల్యంలోనే నక్సల్బరీ, శ్రీకాకుళాల తర్వాత అంతకన్నా ముందడుగు వేసిన జవహర్ నాయకత్వంలోని భోజపూర్ విప్లవంగా ఎమర్జెన్సీ నాటికి రాజ్యానికి ఒక పెను సవాల్‌గా నిలిచింది. గయ, ఔరంగాబాదు, పాలం జిల్లాల్లో ఎనభైలలో మళ్లీ వికసించిన విప్లవోద్యమం బీహార్, బెంగాల్‌కు విస్తరించింది. కన్హయ్ ఛటర్జీ అమూల్యసేన్‌లు నిర్మాణం చేసిన 'చింత', దక్షిణ దేశ రాజకీయపరంగా బెంగాల్ బీహార్‌లలో కూడా బుద్ధిజీవుల్లోనూ సాంస్కృతిక కార్యకర్తల్లోనూ విప్లవ ప్రచార నిర్మాణాలు చేపట్టింది. బెంగాల్‌లో రెవల్యూషనరీ రైటర్స్, ఆర్టిస్ట్స్ అండ్ ఇంటలెక్చువల్స్ అసోసియేషన్, బీహార్‌లో క్రాంతికారీ బుద్ధిజీవీ మంచ్, క్రాంతికారీ సాంస్కృతిక మంచ్ ఏర్పడినవి. 1981లో బెంగాల్‌లోని సుందరబన్స్‌లో జరిగిన ఆర్.డబ్ల్యు.ఎ.ఐ.ఎ. ప్రథమ మహాసభల్లో ఈ సంస్థలకు విరసంకు ఏర్పడిన సాహిత్య, సాంస్కృతిక అనుబంధమే తిరుగు ప్రయాణంలో కలకత్తాలో అఖిల భారత స్థాయి విప్లవ సాంస్కృతిక నిర్మాణానికి ఒక తొలి ప్రయత్నమై ఆ తర్వాత మద్రాసులోను, మరికొన్ని చోట్ల కొనసాగి 1983 అక్టోబర్‌లో ఢిల్లీలో దేశ వ్యాప్తమైన విప్లవ సాహిత్య సాంస్కృతిక సంస్థల సమ్మేళనంగా ఆల్ ఇండియా లీడ్ ఫర్ రెవల్యూషనరీ లీగ్ ప్రథమ మహాసభలు జరిగాయి. అక్కడి నుంచీ ఎఐఎల్ఆర్‌సి మహాసభలు 2002లో హైదరాబాదులో జరిగిన దాకా సింద్రీ (బీహార్) కలకత్తా (87) త్రిసూల్ (90) హైదరాబాద్ (93) మద్రాసు (96) కలకత్తా (99)లలో సాంస్కృతిక ప్రదర్శనలు చూసిన వారందరికీ ఇద్దరు కళాకారులు తప్పకుండా గుర్తుండి ఉంటారు. సుందర్ మరాండీ మరొకరు రాంబలి యాదవ్. అప్పటి బీహార్‌లో భాగమైన ఝార్ఖండ్ నుంచి వచ్చిన సంథాలీ కళాకారుడు సుందర్ మరాండీ. పొట్టిగా నలుపుగా, ఉంగరాల జుట్టుతో రూపానికే కాదు స్వభావానికి కూడా జననాట్యమండలి దివాకర్ వలె ఉండేవాడు. క్రాంతికారీ సాంస్కృతిక మంచ్ ఎక్కడికి కార్యక్రమం ఇవ్వడానికి వచ్చినా ఇరవై ముప్పై మంది దాక ఎక్కువ మంది పధ్నాలుగు పదహారు ఏళ్లలోపు పిల్లలు వచ్చారు. అందరూ సంథాలీ ఆదివాసులు, కొందరు దళితులు. తలలకు ఎర్ర పట్టీలు కట్టుకొని విల్లంబులు పట్టుకొని సంథాలీ, హిందీ భాషల్లో పాటలు పాడుతూ ఉంటే బృందగానంగా, సామూహిక కృషిగా వాళ్ల కార్యక్రమానికి సాటి వచ్చేది ఏమీ ఉండేది కాదు. అరగంటకు పైగా ఇచ్చే, ఆశువుగా సాగే రూపకంలో ఎప్పుడూ విల్లంబులు ఎక్కుపెట్టి ఒకటే శ్రుతిలో, లయలో తగిన పదఘట్టనలో వృత్తాకారంగా, మళ్లీ సరళరేఖవలె, విడివిడిగా చిన్న చిన్న బృందాలుగా విడిపోతూ, కలుస్తూ వాళ్లు చేసే విన్యాసాలు కనులకు, చెవులకు ఒక గొప్ప దృశ్యంగా, శ్రావ్యంగానే కాకుండా హృదయాలను ఉత్తేజపరచేవిగా ఉండేవి. 'ఝార్ఖండ్‌కో లాల్‌ఖండ్ బనాయేంగే' అని వాళ్లు పాడే పాటల పల్లవి ఎనభైల ఆరంభం నుంచి ఇరవయొక్కటో శతాబ్దం తొలిరోజుల దాకా విన్న నేపథ్యంలో 2000 సంవత్సరంలో కేవలం లాలూ ప్రసాద్‌ను బలహీన పరచడానికి ఎన్డీయే ప్రభుత్వం ఝార్ఖండ్ ఏర్పాటు చేసినపుడు రూపభ్రమతో పాలకవర్గాలు సారాన్ని ఎట్లా హరించగలవో, ఎంత భ్రమలు కల్పించగలవోననిపించింది.

ఝార్ఖండ్ ఏర్పడిన తర్వాత మారిన పరిస్థితుల్లో ముఖ్యంగా అప్పటికే తీవ్రతరమైన సామ్రాజ్యవాద ప్రపంచీకరణ, ఝార్ఖండ్‌లో లక్ష్మీ మిట్టల్, జిందాల్, వేదాంత మొదలు ఖనిజాల కోసం, ఉక్కు కర్మాగారాల స్థాపన కోసం లక్షల సంఖ్యలో విస్థాపనకు గురవుతున్న ఆదివాసుల ప్రతిఘటనా పోరాటానికి అండగా ఝార్ఖండ్ అభేన్‌ను స్థాపించిన వారిలో కూడ సుందర్ మరాండీ ఒకడు. ఒక విధంగా ఎఐఎల్ఆర్‌సి కార్యకలాపాలు ఆగిపోయిన కాలంలో సుందర్ మరాండీ ఝార్ఖండ్‌కు పరిమితమై చేపట్టిన ఈ సాంస్కృతిక పోరాటం నుంచే జీతన్ మరాండీ వంటి కళాకారులు వచ్చి దళారీ రాజ్యానికి వెన్నులో చలి పుట్టిస్తున్నారు. సుందర్ మరాండీ సంస్మరణ విప్లవ సంప్రదాయంలో ఆయన ఊళ్లో ప్రజలు జరుపుకున్న సందర్భంగా విరసం ఆ సాంస్కృతిక యోధునికి జోహార్లు చెప్తున్నది. (అభేన్ ఝార్ఖండ్‌కు – జీతన్ మరాండీకి కృతజ్ఞతలతో)



# ఆదివాసీ సముదాయంలోని సంప్రదాయిక వ్యవస్థలో మార్పు

- జీతన్ మరాండి

అనువాదం: కె. పద్మ

ఝార్ఖండ్ ఏ భేన్ వ్యవస్థాపక నాయకులు, సాంస్కృతిక కార్యకర్త కామ్రేడ్ సుందర్ మరాండి అంతిమ కర్మకాండ 12 మార్చి నాడు ఆయన స్వంత వూరు పిర్టాండ్ మండలంలోని చతరో లో జరిగింది. రిమ్స్ హాస్పిటల్ లో చికిత్స పొందుతూ 27 ఫిబ్రవరి 2015న ఆయన మరణించారు. సుందర్జీ పార్థివ శరీరాన్ని పూడ్చడానికి తెసుకెళ్లినప్పుడు ఆ ఊరి మహిళలందరూ ఆదివాసీ సంప్రదాయాన్ని బద్దలు కొట్టి, పురుషులతో పాటు ఆ కామ్రేడ్ కు అంతిమ వీడ్కోలు చెప్పారు. ఆదివాసీ సమాజంలో శవాన్ని పూడ్చి పెట్టేటప్పుడు మహిళలు వెళ్ళకూడదు అనేది నియమం. కామ్రేడ్ సుందర్జీ వయస్సు యాభై సంవత్సరాలు. ఆయన తన జీవితంలో 27 సంవత్సరాల పాటు సమాజ మార్పు కోసం సాంస్కృతిక రంగంలో పోరాటం చేశారు. ఆయన వ్యక్తిత్వాన్ని, ఆలోచనా దృక్పథాన్ని దృష్టిలో పెట్టుకుని అంతిమ సంస్కారాల సమయంలో జరిగే రీతి రివాజుల్లో మార్పు తీసుకురావాలని చుట్టుపక్కల గ్రామాల ప్రజలు, ఆ ఊరి మాంఝి హడామ్‌తో సహా, సామాజిక కార్యకర్తలు భావించారు. మార్చ్ 7న సుందర్జీ ఊళ్ళో ఏర్పాటు చేసిన సంస్మరణ సమావేశానికి నన్ను కూడా పిలిచారు.

ఆదివాసీ సమాజంలో, ప్రతి వ్యక్తీ పుట్టినప్పటి నుంచి చనిపోయే దాకా అనేక సాంప్రదాయపరమైన రీతి రివాజుల్ని పాటించాల్సి ఉంటుంది. సంప్రదాయ వ్యవస్థ పై ఆధారపడి ఉన్న ఆదివాసీ సమాజం తన గుర్తింపును నిలబెట్టుకుంది, కానీ ఆ సముదాయాన్ని ముందుకు పోకుండా అడ్డుపడే అనేక నకారాత్మక కోణాలు ఆ సంప్రదాయాలలో ఉన్నాయి. ఈనాడు ఆదివాసీ సముదాయంలో శాస్త్రీయ చైతన్యం మెల్లమెల్లగా వస్తోంది. ఆ కారణంగానే పెళ్లిళ్లు లేదా వేర్వేరు పండగలు, పబ్బాలకు సంబంధించిన సంప్రదాయాల్ని ఉల్లంఘించే వార్తలు కూడా వినిపిస్తుంటాయి. ఆదివాసీలు తమ మౌలిక గుర్తింపును వదులుకోవడం అంటే తమను తాము నాశనం చేసుకొన్నట్లే. అయితే నకారాత్మక అంశాలను మార్చాల్సిన అవసరం ఉంది. ఈ ఆలోచన తోనే సుందర్ మారాంది కర్మకాండ కార్యక్రమాల్లో కొన్ని మార్పులు చేశాము.

సంప్రదాయం : సంతాల్ ఆదివాసిల్లో కర్మ కాండ 12వ రోజునే జరుగుతుంది. ఆ రోజున గ్రామంలోని స్త్రీ, పురుషులు, చుట్టపక్కాలందరు చెరువుకు వెళ్ళి స్నానం చేసి వస్తారు. విధవ అయిన మహిళకు, ప్రధాన కర్మకాండలను నిర్వహించే వ్యక్తికి కొత్త బట్టలు పెడ్తారు. ఆ కుటుంబ సభ్యులందరికి కూడా కొత్త బట్టలు పెట్టాలి. కర్మకాండకు వచ్చే చుట్టాలందరి తరపున వీటిని తీసుకురావాల్సి ఉంటుంది.

మార్పు : వారిద్దరికి తప్ప మిగిలినవారికెవరికీ చుట్టాల తరపున బట్టలు తీసుకు రాలేదు. ఈ విషయాన్ని ముందే అందరికి తెలియచేశాం. ఈ సంప్రదాయం ఏమాత్రం అవసరం లేనిదనీ, కేవలం పైనుంచి రుద్దబడిందనీ అని అక్కడికి వచ్చిన వారు అభిప్రాయ పడ్డారు. ఈ సంప్రదాయాల గురించి మాట్లాడు తున్నప్పుడు వాటిల్లో ఉండే అనేక నకారాత్మక అంశాలు చర్చకు వచ్చాయి కాబట్టి ఈ మార్పుని చాలా ముఖ్యమైనదిగా భావించాలి.

సంప్రదాయం: స్నానాలు చేసి వచ్చిన తరువాత చనిపోయినవారి పేరు మీద మేక, కోడి, పందిని బలి ఇవ్వాలి. చుట్టాలు, గ్రామస్తులు వీటిని తేవాల్సి ఉంటుంది. ఇంటివారి తరపున మేకని బలి ఇవ్వడమనేది కర్మకాండలో ప్రధాన కార్యక్రమంగా ఉంటుంది.

మార్పు : ఇంటివారు మాత్రం ఒక మేకను తెచ్చారు కానీ మిగిలినవారెవ్వరు ఏమి తీసుకురాలేదు. కోళ్ళు, మేకలు, పందుల్ని బలి ఇవ్వడం తప్పిపోయింది. ఈ రెండు విషయాల్లో మార్పు రావడం వల్ల కుటుంబానికి ఆర్థిక సమస్యలను ఎదుర్కోవాల్సిన ఇబ్బంది తప్పింది. ఈ కర్మ కాండల్లో అయిదు వందల కంటే ఎక్కువ మంది పాల్గొని సామాజిక మార్పుకు సాక్ష్యాలుగా నిలిచారు.

## విప్లవ సాహిత్యావిష్కరణ సభ

విరసం కర్నూలు యూనిట్ మార్చి 29వ తేదీ ఉదయం 11 గంటలకు స్థానిక గ్రంథాలయంలోని సమావేశమందిరంలో విప్లవ సాహిత్య ఆవిష్కరణ సభ నిర్వహించింది. విరసం సభ్యుడు కా. శ్రీనివాస్ అధ్యక్షతన జరిగిన ఈ సభలో పద్మకుమారి రాసిన పాల్గుణ నవలికను ప్రముఖ రచయిత్రి డా. సుభాషిణి ఆవిష్కరించి పరిచయం చేశారు. మహాశ్వేతాదేవి ఒక తల్లితో పాల్గుణ నవలికకు ఉన్న పోలికలు, తేడాలు విశ్లేషించారు. తర్వాత విరసం కథల వర్క్‌షాపుల కథల సంకలనం కథల పంట3ను ప్రముఖ కథ, నవలా రచయిత స్వామి ఆవిష్కరించి పరిచయం చేశారు. సాహిత్య రచనలకు జీవితానుభవం ముఖ్యమని, ఏదైనా కథ చదివితే మనకు అంత వరకు తెలియని అనుభవం పరిచయం కావాలని అన్నారు. అలాంటి అరుదైన అనుభవాలను కలిగించే కథలు ఇందులో చాలా ఉన్నాయని అన్నారు. తర్వాత సుజాత, నిత్య, మైనా రాసిన కథల సంకలనం 'సామాన్యుల సాహసం', షహీదా కథా సంకలనం 'జాజపూల పరిమళం' కామ్రేడ్ అల్లం రాజయ్య ఆవిష్కరించి పరిచయం చేశారు. ప్రగతి శీల సాహిత్య శిబిరం నుంచి వస్తున్న కథలు చాలా వరకు సంప్రదాయ ధోరణికి చెందినవని, ఆ ఛాయలు కొన్ని విప్లవ కథల్లో కూడా ఉండేదని, అయితే ఇటీవల దండకారణ్యం నుంచి వస్తున్న కథలు పూర్తిగా సంప్రదాయంతో తెగతెంపులు చేసుకున్న కొత్త కథలని అన్నారు. ఇవి పూర్తిగా కొత్త వాతావరణంలో, నిర్మాణాత్మక ప్రత్యామ్నాయ విప్లవోద్యమం నుంచి వస్తున్న కథలని అన్నారు. ముఖ్యంగా ఈ తరహా కథలు ఇవాళ లోపలి నుంచీ, బైటి నుంచీ మహిళలు రాయడం ప్రత్యేకత అన్నారు. సామాన్య జీవితంలోని మార్పు క్రమాలను చెప్పడం వల్ల ఇవి కొత్త కథలయ్యాయని అన్నారు.

కరపత్రం

# తెలంగాణలో వాక్, సభా స్వాతంత్ర్యాల కోసం పోరాడదాం! ఎన్‌కే 'లాల్ బనో', మంటో 'అనువాద కథల' ను ఆవిష్కరించుకుందాం.. రండి!!

ఈ రక్తపు మరకల ఉదయం
ఈ చీకటి వెంటాడిన ఉదయం
దీన్నెప్పుడూ మేమాశించలేదు
- ఫైజ్ అహ్మద్ ఫైజ్

'తెలంగాణ సమాజమంతా ఈనాడు రోడ్డు మీద ఉంది' అనే మాటని ప్రత్యేక తెలంగాణ ఉద్యమ కాలంలో తరచూ వినేవాళ్లం. సకల జనుల సమ్మె, సాగర హారం వంటి ఉద్యమ వెల్లువల్లో సామాన్యుని నుంచి మేధావుల దాకా... సకల శ్రేణులు, వర్గాలు కరిగిపోయిన తీరును ఈ మాట పట్టిస్తున్నది. నీళ్లు, వనరులు, అధికారాలు కావాలని, వాటిని కాపాడుకొనే స్వయం నిర్ణాయక యంత్రాంగం, వాటిని పంచుకొనే ప్రజాస్వామిక, లౌకిక వాతావరణం ఉండాలనే తెలంగాణ ప్రజల ఆకాంక్ష 'రాష్ట్రం' అనే ఆకారం తీసుకొని పది నెలలు గడిచిపోయింది. కానీ, ఇప్పటికీ తెలంగాణ సమాజం రోడ్డు మీదే ఉంది. సందర్భం వేరు కావచ్చు. కానీ ఆకాంక్ష అదే. నినాదాల స్వరం మారొచ్చు. కానీ కల అదే. అవిభాజ్య ఆంధ్రప్రదేశ్ పాలకవర్గం గుప్పిట ఆరు పదులకుపైగా అనుభవించిన అరాచకాలను ఈ పది నెలల కాలంలోనే తెలంగాణ చవి చూస్తున్నది. ఇంత స్వల్ప కాలంలోనే 500 మందికి పైగా రైతులు ఆత్మహత్య చేసుకొన్నారు. బీడీ కార్మిక నాయకులు, అరుణోదయ కళాకారిణి విమల, ఆమె సహచరుడు అమర్ సహా 17 మందిపై నూతన రాష్ట్రంలో తొలి కుట్ర కేసు నమోదయింది. కిరణ్‌కుమార్ అనే ఉపాధ్యాయుడు వనపర్తిలో పెట్టుకొన్న పుస్తకావిష్కరణ సభపై సంఘ్ పరివార్ గూండాలు దాడులు చేసి పక్షం రోజులు గడిచినా భావ ప్రకటన స్వేచ్ఛకు భరోసా ఇచ్చే ఒక్క చర్యనూ తెలంగాణ ప్రభుత్వం చేపట్టలేదు. నాడు చంద్రబాబు ప్రభుత్వం తొక్కిపెట్టిన ప్రజా గాయకుడు గద్దర్‌పై కాల్పుల కేసును రీ ఓపెన్ చేయాలన్న న్యాయమైన డిమాండ్ పట్ల సైతం చంద్రశేఖర్ రావు ప్రభుత్వం స్పందించడం లేదు. పైగా విప్లవోద్యమ పార్టీపై నిషేధాన్ని పొడిగించి, విప్లవోద్యమ ఐక్య ఉత్సవాలను భగ్నంచేసి, బూటకపు ఎన్‌కౌంటర్ల సంస్కృతిని పెంచడానికి తెలంగాణ పోలీసులు ఉత్సాహం చూపిస్తున్నారు. ఈ నేపథ్యంలో సీఎం కేసీఆర్ తెలంగాణకు ముందు తగిలించిన 'బంగారు' మకుటం ముందు, 'రాష్ట్రం' అనే ముఖం వెలవెలబోతున్నది.

బూర్జువా రాజ్యాంగ చట్రంలో తీరనివాటిని ఎలా తెచ్చుకోవాలో విస్తృత పోరాట అనుభవం కలిగిన తెలంగాణ ప్రజలకు తెలుసు. కానీ, రేషన్‌కార్డులు, ఆసరా, సామాజిక పింఛన్లు వంటి కనీస సంక్షేమాన్ని అందుకోవడమూ చావుబతుకుల సమస్యగా మారకూడదు కదా! కానీ వాస్తవంలో వెయ్యి రూపాయల గౌరవ భృతి మొదలు భావాలు పంచుకొనే హక్కు దాకా... ప్రతి సందర్భంలోనూ ప్రజలు రోడ్ల మీదకు వచ్చి సంఘర్షించాల్సి వస్తున్నది. దళితులకు మూడు ఎకరాల భూమి నుంచి, పేదలకు జాగా వరకూ.. ప్రతి ఎన్నికల హామీ అమలు కోసం అనుదినమూ ఆందోళనలు చేయాల్సి వస్తున్నది. దానికోసం రాజ్యహింసను, రాజద్రోహాలను తెలంగాణ సమాజం మోయాల్సి వస్తున్నది. ఒకవైపు రైతు బతుకును సమాధి చేస్తూ.. మరోవైపు యజ్ఞ గుండాల్లో సమిధలు వేస్తున్న దృశ్యం చూస్తున్నాం. ఒకవైపు న్యాయమైన సమస్యల కోసం బీడీ కార్మికులు పెట్టుకొనే సభను..కుట్రగా ప్రకటిస్తారు. మరోవైపు హనుమాన్ జయంతి పేరుతో సాగే 'హిందూ మతోన్మాద' బల ప్రదర్శనలకు హైదరాబాద్ మహానగర రహదారులనే ఖాళీ చేయిస్తారు. యాదగిరిగుట్టకు నిధులు, తిరుపతి హుండీకి మొక్కులు, చినజీయర్ స్వాములకు నైవేద్యాలు, మోడీ వంటి హిందూత్వ నరహంతక పాలకుడితోనూ, రామోజీరావు వంటి నిరంకుశ దళారులతోనూ తైతిక్కలు చూస్తే... 'గిట్లవుతుందని ఎవరనుకున్నారు' అన్న ప్రజాకవి కాళోజీ మాటలు గుర్తుకు రాకమానవు. ఆయన 'ఆంధ్రప్రదేశ్' సందర్భంలో ఆ మాట అని ఉండవచ్చుగానీ, మొత్తంగా భారతదేశ చరిత్రే దగా పడిన, ద్రోహాలకు గురయిన జాతుల చరిత్ర. బ్రాహ్మణీయ భూస్వామ్యం.. గుత్త పెట్టుబడికి కలిసివచ్చిన దళారిగా మారిన దరిమిలా కార్పొరేట్ దోపిడీని, కమండలాల రాపిడీని భారత సమాజం చవిచూస్తున్నది. కాకపోతే తెలంగాణలో ఈ క్రమం కాస్త తొందరగా మొదలయి, ఫాసిస్టు శక్తులు వేగంగా పుంజుకుంటున్నట్టు కనిపిస్తుందిగానీ అటు ఆంధ్రప్రదేశ్‌లోనూ పరిస్థితి దీనికి భిన్నంగా ఏమీ లేదు. అక్కడా పరకాల ప్రభాకర్ రూపంలో ప్రభుత్వాన్ని, వెంకయ్యనాయుడు రూపంలో రాష్ట్ర వ్యవహారాలను చక్కబెడుతూ రాష్ట్రాన్ని రియల్ ఎస్టేట్, కార్పొరేట్ విద్యా సంస్థల అధిపతులకు దోచిపెట్టేందుకు చంద్రబాబుకు సహకరిస్తున్నది హిందుత్వ శక్తులేననేది మరవరాదు.

కాబట్టి, ప్రత్యేక తెలంగాణ ఉద్యమ పర్యావసానాలనుగానీ,

| | | |
|---|---|---|
| తేదీ | : | ఏప్రిల్ 21, మంగళవారం సాయంత్రం ఆరు గంటలకు |
| స్థలం | : | బషీర్‌బాగ్ ప్రెస్ క్లబ్, హైదరాబాద్ |
| అధ్యక్షత | : | వరవరరావు, విరసం |
| వక్తలు | : | చిలకా చంద్రశేఖర్, సీఎల్‌సీ |
| | | గీతాంజలి, విరసం |
| | | కాశీం, విరసం |
| | | ఉషా ఎస్ డానీ, జర్నలిస్టు |
| | | చంద్రయ్య, విరసం |

మంటో 'టీత్వాల్ కుక్క, మరికొన్ని కథల'ను గీతాంజలి,
ఎన్‌కే 'లాల్ బనో..'ను ఉషా ఎస్ డానీ ఆవిష్కరించి మాట్లాడతారు

పోరాటాల, త్యాగాల తెలంగాణలో ఫాసిస్టు శక్తుల బరితెగింపు వెనక గల కారణాలనుగానీ స్థానిక, తక్షణ పరిణామాల్లోనే వెతుక్కోవడం వల్ల దారి దొరకదు. దానికోసం ప్రపంచాన్ని యుద్ధోన్మాదంలోకి నెడుతున్న ప్రపంచ సామ్రాజ్యవాద సంక్షోభాన్ని అర్థం చేసుకోవాలి. దాని నేపథ్యంగా..దళారీ పాలకులకు మావోయిస్టు ఉద్యమం, లౌకిక ప్రజాస్వామికవాదుల చొరవ వల్ల ఎదురవుతున్న ఇబ్బందులను, బహుళజాతి సంస్థలతో కుదుర్చుకున్న లక్షల కోట్ల విలువైన ఎంవోయూల అమల్లో తలెత్తుతున్న చిక్కులను గుర్తించాలి. ఈ చిక్కుముడులను విప్పేందుకు దోపిడీ పాలకవర్గాలకు దుర్మార్గంగానూ, దూకుడుగానూ, చివరకు సోకాల్డు పార్లమెంటరీ సంప్రదాయాలను సైతం తోసివేసి ముందుకుపోగలిగిన ఫాసిస్టు పాలకుడి అవసరం ఏర్పడటాన్ని గ్రహించాలి. ఈ క్రమమంతా అర్థమయితేనేగానీ తెలంగాణ సహా భారతదేశ సాంఘిక జీవనంలో పెరిగిపోయిన సంఘ్ పరివార్ గూండాగిరి, దాదాగిరిని అర్థం చేసుకోలేం. ఈ స్థితిని 1997 'ప్రజాస్వామిక తెలంగాణ' పిలుపులోనూ, 1980ల్లో 'లాల్ బనో గులామీ ఛోడో బోలో వందేమాతరం' అంటూ విప్లవ కవి ఎన్కే వినిపించిన నినాదంలోనూ, 1946-47లో 'ఇండియా, పాకిస్థాన్ సంగతి సరేనయ్యా...అసలు నీకు హిందూ ముస్లింల గురించి, వాళ్ల పేగుబంధం గురించి ఏం తెల్సు?' అన్న సాదత్ హసన్ మంటో సూటి ప్రశ్నలోనూ వెతుక్కోవాల్సిన అవసరం నేడు మరింతగా పెరిగిందని విప్లవ రచయితల సంఘం భావిస్తున్నది.

ఈ నేపథ్యంలో ప్రజా గాయకుడు గద్దర్పై కాల్పుల కేసులో దర్యాప్తుని తిరిగి ప్రారంభించి దోషులను కఠినంగా శిక్షించాలని, అరుణోదయ విమల, అమర్ సహా 17 మందిపై పెట్టిన కుట్ర, మారణాయుధాల కేసులను వెనక్కి తీసుకోవాలని, వనపర్తి పుస్తకావిష్కరణ సభపై దాడిచేసిన సంఘ్ పరివార్ గూండాలను అరెస్టు చేసి, నిర్వాహకులపై పెట్టిన అక్రమ కేసులను ఎత్తివేయాలని విరసం డిమాండ్ చేస్తున్నది. ఇలా భావ ప్రకటన స్వేచ్ఛను, పోరాడే హక్కును పరిరక్షించుకొంటూనే, పాలకవర్గాల అండతో పేట్రేగుతున్న ఫాసిస్టు శక్తులను ఎక్కడికక్కడ ఎదుర్కోవాల్సి ఉంది. ఈపనిని తమ కాలాల్లో సాహిత్య, కళా రంగాల్లో సమర్థమంతంగా చేసినవారు మంటో, ఎన్కే. బొబ్బిలి విరసం సాహిత్య పాఠశాల సందర్భంగా ఎన్కే దీర్ఘకవిత 'లాల్ బనో..' మూడో ముద్రణను, 'తీత్వాల్ కుక్క మరికొన్ని కథలు' పేరిట మంటో అనువాద కథలను విరసం ప్రచురించింది. ఈ రెండు పుస్తకాల ఆవిష్కరణ సభను విరసం హైదరాబాద్ సిటీ యూనిట్ నిర్వహిస్తున్నది. ఈ సభలో పాల్గొని, తెలంగాణపై అమలవుతున్న తీవ్ర నిర్బంధకాండను, హిందూ ఫాసిస్టు శక్తుల జులుంను నిరసించాల్సిందిగా కవులు, కళాకారులు, బుద్ధిజీవులకు విజ్ఞప్తి చేస్తున్నది.

- ప్రజా గాయకుడు గద్దర్పై కాల్పుల కేసులో దర్యాప్తును తిరిగి ప్రారంభించాలి. దోషులను కఠినంగా శిక్షించాలి.
- అరుణోదయ విమల, అమర్ సహా 17 మందిపై పెట్టిన కుట్ర, మారణాయుధాల కేసులను వెనక్కి తీసుకోవాలి.
- వనపర్తిలో పుస్తకావిష్కరణ సభపై దాడిచేసిన సంఘ్ పరివార్ గూండాలను అరెస్టు చేయాలి. నిర్వాహకులపై పెట్టిన అక్రమ కేసులను ఎత్తివేయాలి.

**విప్లవ రచయితల సంఘం**

హైదరాబాద్ సిటీ యూనిట్

**పత్రికా ప్రకటన :**

# ఇద్దరి చంద్రుల నెత్తుటి పాలన

తెలంగాణలో తీవ్రవాదుల పేరుతో, ఆంధ్రప్రదేశ్లో స్మగ్లర్ల పేరుతో ఒకే రోజు పోలీసులు 25 హత్యలు చేశారు. ఎన్కౌంటర్ల విషయంలో ఎప్పుడూ చెప్పే పాత కథే ఇప్పుడూ చెబుతున్నారు. ఈ క్రూర హత్యాకాండను తీవ్రంగా ఖండిస్తున్నాం. చిత్తూరు జిల్లాలో 20 మంది కూలీల్ని పట్టుకుని అతి సమీపం నుండి కాల్చివేసిన పోలీసులు వాళ్ల మృతదేహాల వద్ద తుప్పుపట్టిన కొడవళ్లు, ఎప్పుడో పట్టుకుని నంబర్లు కూడా వేసి ఉంచిన దుంగలు పడేశారంటే ప్రభుత్వ ఆదేశం వాళ్లకు ఎంత తెగింపునిచ్చిందో అర్థమవుతున్నది. రాయలసీమలో కింది స్థాయి అధికారుల నుండి బడా రాజకీయ నాయకుల దాకా ఎర్రచందనం స్మగ్లర్లతో సంబంధాలున్న విషయం బహిరంగ రహస్యమే. తీగ లాగితే అందరి డొంకలు కదులుతాయి. కానీ మొదటి నుండి నోరు తిరగని చట్టాల పేరుతో, బెయిలు పెటుకోడానికి కూడా స్థోమత లేక జైళ్లలో మగ్గిపోయేది, శిక్షలు అనుభవించేది, పొట్టచేత పట్టుకుని ప్రమాదకరమైన పనులు చేయడానికి వచ్చే కూలీలే. చంద్రబాబునాయుడు ఇంకాస్త ముందుకు పోయి హత్యలు చేయించడమే కాకుండా ఎర్రచందనం కోసం వచ్చే కూలీలకు ఇదే గతి పడుతుందని మంత్రులతో ప్రకటనలు కూడా చేయిస్తున్నాడు. అయనకు ఏ మాత్రం తీసిపోని చంద్రశేఖరరావు తెలంగాణను పోలీసు రాజ్యం చేశాడు. కేవలం తమ అహం చల్లారడం కోసం ఒక చోట జరిగిన ఎదురు కాల్పులకు మరోచోట ప్రతీకార హత్యలు చేశారు పోలీసులు. సంకెళ్లు వేసిన విచారణ ఖైదీలను కాల్చి చంపి చిన్న పిల్లలు కూడా నమ్మలేని ఎన్కౌంటర్ కథ మీడియాలో వినిపించారు. నక్సలైట్లు, తీవ్రవాదులు, దొంగలు, స్మగ్లర్లు - ఈ పేర్లు తగిలిస్తే పోలీసులు ఎవరినైనా చంపొచ్చన్నమాట. అలా చంపి శాంతి భద్రతలు కాపాడితే, నోరెత్తే సాహసం ఎవ్వరూ చేయలేని స్మశాన శాంతిని సాధిస్తే మన తెలుగు రాష్ట్రాలకు ఘనమైన పెట్టుబడులు వస్తాయని ఇద్దరు చంద్రులు చాటుతున్నారు. ఇక్కడ ఉద్యమాలు లేవు. అన్నీ ఇస్తాం పెట్టుబడులు పెట్టుకోండని చంద్రబాబు నాయుడు సూటిగా, బహిరంగంగా మాట్లాడాడు కూడా. ఇదీ తెలుగు రాష్ట్రాల పరిస్థితి. ఈ ఫాసిస్టు ప్రభుత్వాలకు వ్యతిరేకంగా ప్రజాస్వామికవాదులందరూ గొంతు విప్పాలని విరసం కోరుకుంటున్నది.

- పి. వరలక్ష్మి (విరసం కార్యదర్శి), పాణి (విరసం కార్యవర్గ సభ్యుడు)

తేది : 08-04-2015

**వరవరరావు, కళ్యాణరావు** (విరసం సీనియర్ సభ్యులు)

కరపత్రం

# రాష్ట్ర రోడ్డు రవాణాసంస్థ కార్మికుల సమ్మె న్యాయమైనది ప్రభుత్వ కుట్ర పూరిత వైఖరిని నిరసించండి

ఆర్టీసీ కార్మికులు రోడ్డు మీదికి వచ్చారు. గత ఆరు రోజులుగా బస్సులు ఆగిపోయాయి. ప్రజలు ఇబ్బందిపడుతున్నారు. సంపన్నులకు ఏ కష్టమూ లేదు. వారికి కార్లుంటాయి. అసంఖ్యాక పేద, మధ్యతరగతి ప్రజలు ఇబ్బందిపడుతున్నా ప్రభుత్వం సమస్యను పరిష్కరించడానికి చిత్తశుద్ధితో వ్యవహరించడం లేదు. పైగా ప్రజల కష్టాలను గుర్తించి సమ్మె విరమించమని కార్మికులకు సుభాషితాలు చెబుతోంది. ఇంతకూ కార్మికులు ఏం అడుగుతున్నారు? అందులో ఏమైనా అన్యాయం ఉందా? అసమంజసం ఉందా? ప్రజలందరూ ఆలోచించాల్సిన విషయమిది.

ప్రభుత్వ వైఖరి : ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర బడ్జెట్ లోటులో ఉందట. అయినా ముఖ్యమంత్రి వందల కోట్లు ఖర్చు పెట్టి పెట్టుబళ్ల కోసం సింగపూర్, జపాన్లకు తిరుగుతూ ఉన్నాడు. అదేమంటే ప్రజల కోసం అంటాడు. రాజధాని నిర్మించడానికి అంటాడు. అప్పులు తేకపోతే అభివృద్ధి ఎలా అంటాడు. రైతాంగ సమస్యల పరిష్కారానికి నీటి పారుదల సమస్యలను తెలుసుకోడానికి కాలువగట్లపైన నిద్రపోతానంటాడు. దానికి కూడా 60 లక్షల రూపాయలు ఖర్చు పెడతాడు. ఇంతకూ ఏ కాలువలో కూడా నీరు పారవు. తాత్కాలిక రాజధానిలో తాత్కాలిక భవనాలకే కోట్లు ఖర్చు పెడుతూ, హైదరాబాదులో తన పేషీకి కోట్ల రూపాయలు ఖర్చు పెడుతున్నాడు. తమ న్యాయమైన డిమాండ్లు పరిష్కరించాలని కార్మికులు కోరితే ఆర్టీసీ నష్టాల్లో ఉందని బూటకపు ప్రచారం చేస్తున్నాడు. సమ్మె విరమించుకోవాలని బెదిరింపులకు పాల్పడుతున్నాడు. ఉద్యోగవర్గాలు తమ హక్కుల కోసం ఆందోళనలు చేసినప్పుడల్లా ప్రభుత్వానికి ప్రజల కష్టాలు గుర్తుకు వస్తాయి. అసలు ప్రజల కష్టాలకు కారణం ఉద్యోగులు, కార్మికులు ఎంత మాత్రం కాదు. పాలక విధానాల వల్లే ప్రజలకు కష్టాలు, నష్టాలు.

ఆర్టీసీ కార్మికులు కోరుతున్నదేమిటి?: ప్రభుత్వోద్యోగులతో సమానంగా 43% ఫిట్మెంట్ యివ్వమని ఆర్టీసీ కార్మికులు డిమాండ్ చేస్తున్నారు.ఇప్పటికే చాలా పెద్ద మొత్తంలో జీతాలు తీసుకుంటున్న ప్రభుత్వోద్యోగులకు 43% ఫిట్మెంట్ యిచ్చినపుడు ఆర్టీసీ కార్మికులకు ఎందుకు ఇవ్వకూడదు? ప్రభుత్వ ఉద్యోగులకు ఇవ్వడం కూడా న్యాయమే. ఆ న్యాయాన్ని ఆర్టీసీ కార్మికులకూ వర్తించాలి. ఈ సమస్యను పరిష్కరించకపోగా సమ్మెను విచ్ఛిన్నం చేసేందుకు, దెబ్బతీసేందుకు బయటి నుంచి రూ? 1000 దిన వేతనంతో డ్రైవర్ను, రూ? 700తో కండెక్టర్ను నియమించి బస్సులు నడుపుతున్నారు. అదే వేతనాన్ని రెగ్యులర్ కార్మికులకు ఇవ్వవచ్చు. కానీ యాజమాన్యం పట్టించుకోదు. ప్రతి డిపోకు అధికారి కోసం ఒక కొత్తకారు కొంటున్నారు. కార్మికులకు 43% ఫిట్మెంట్ యివ్వడమే ఇబ్బంది.

ఆర్టీసీ నష్టాల్లో ఉందా? : సంస్థ నష్టాల్లో ఉందనే ప్రచారంలో నిజానిజాలేమిటో చూద్దాం. 1958లో కేవలం 211 కోట్ల రూపాయల పెట్టుబడితో ప్రారంభమైన ఆర్టీసీ ఆస్తుల విలువ నేడు 50 వేల కోట్లు. మరి, నష్టాల్లో వుందంటే పలా నమ్మాలి? వస్తున్న ఆదాయాన్నంతా స్థిరాస్తులుగా మార్చేసుకొని నష్టాలు వస్తున్నాయంటేనమ్మాలా? సంస్థ లాభాల్లో కార్మికుల శ్రమలేదా? ఉన్నతాధికారులు మాత్రమే లాభాలు సమకూర్చారా?

దీనికి సమాధానం రవాణా మంత్రి గాని, సంస్థ ఉన్నతాధికారులు చెప్పగలరా?

. నష్టాలకు కారకులెవరు? : మాటవరసకు నష్టాల్లో వుందను కుందాం? దానికి కార్మికులెలా కారణమవుతారు? ఆర్టీసీ కార్మికులు ఒళ్లొంచి, ప్రమాదపు అంచుల మీద నిత్యం పని చేస్తున్నారు. లేకపోతే బస్సులు నడిచేవే కాదు. ఆర్టీసీ పాత కాలపు ఫ్యూడల్ నియంతృత్వం చెలామణిలో ఉన్న సంస్థ. పని చేసినా కార్మికులను దారుణంగా అణచివేసే ధోరణి మొదటి నుంచీ ఉంది. సర్వీస్ కాలంలో యింక్రిమెంట్ నష్టపోని కార్మికులు ఉండనే ఉండరు. కాబట్టి నష్టాలకు కార్మికులను బాధ్యులను చేయడం దారుణం. ఆర్టీసీ లాభాలన్నీ కార్మికుల శ్రమ నుంచి వస్తున్నవే. నష్టాలుగా చూపుతున్నవన్నీ కాకి లెక్కలే. తమ అవినీతి, దుబారా, బాధ్యతారహిత నిర్ణయాలను దాచిపెట్టడానికి, కార్మిక వ్యతిరేకంగా వ్యవహరించడానికి సంస్థ నష్టాల్లో ఉందనే సాకు చెబుతున్నారు.

దాచేస్తే దాగని సత్యం : ప్రభుత్వాలు అన్ని కార్పొరేషన్లను పాడి ఆవులుగా భావిస్తున్నాయి. పాలతోపాటు రక్తాన్నీ పిండుకుంటున్నాయి. ఇది ఎప్పటి నుంచో నడుస్తున్న దుర్మార్గం. ఆర్టీసీ నుంచి ప్రభుత్వం పొందుతున్న లబ్ధి నేరుగా కన్పించదు. డీజిల్పై పన్నును 22.5% నుండి 30%కు పెంచి తద్వారా ఆర్థిక లబ్ధి తాను పొందుతూ ఆ భారాన్ని ప్రత్యక్షంగా, పరోక్షంగా ప్రజలపై వేస్తోంది. మరోవైపు విమాన ఇందనంపై పన్నును 18% నుండి 1%కు తగ్గించారు. ఇది ఏ వర్గ ప్రయోజనాల కోసం? విమానాల్లో ఎవరు తిరుగుతారో తెలిసిందే. ప్రజలపై అంత ప్రేమవున్న వాళ్ళు 1995లో సవరించిన మోటారు వాహనాల చట్టాన్ని కేవలం బస్సులకే వర్తింపచేయడం పందుకు? దానివల్ల నష్టం వస్తుందని తెలియదా ? ప్రజలపై భారం పడుతుందని తెలియదా? రాష్ట్రంలోని వివిధ వర్గాలకు ఓట్ల కోసం, సీట్లకోసం (వారిపై ప్రేమతో మాత్రం కాదు) యిచ్చిన రాయితీలు ఏడాదికి 950 కోట్లు. డీజిల్ మొదలైన విడిభాగాలపై వ్యాట్ ద్వారా సంవత్సరానికి 691 కోట్ల రూపాయల రాబడి. ఇవన్నీ ప్రభుత్వ ఖజానా చేరుతున్నాయి కదా. కార్మికుల సంక్షేమం కోసం, జీతాల కోసం ఎందుకు వినియోగించకూడదు?

గ్రామాలకు బస్సులు నడపడం ద్వారా రూ॥ 5000 కోట్ల నష్టమొచ్చిందని అంటున్నారు. దానికి కారణం కార్మికులా? ప్రజలకు చేసే సేవలో లాభ నష్టాలను బేరీజు వేయకూడదనే ఇంగితం కూడా ప్రభుత్వానికి, ఆర్టీసీ యాజమాన్యానికి లేదు. పైగా సంక్షేమ రాజ్యమని పెద్ద ఫోజు. విద్యార్థులకు, వికలాంగులకు రాయితీలివ్వడాన్ని ఇంకో సాకుగా చెబుతున్నారు.గ్రామాలకు బస్సులు నడపవద్దని, రాయితీలు ఇవ్వవద్దని కార్మికులు చెప్పడం లేదు. అయితే ఆ లోటుకు కార్మికులను బలి చేస్తామని అనడం అన్యాయం. రకరకాల పన్నుల ద్వారా కోట్లాది

రూపాయల లబ్ధి పొందుతున్న ప్రభుత్వం, ఆ లాభాలు తెచ్చిపెడుతున్న కార్మికుల ఆర్థిక డిమాండ్లను నెరవేర్చకపోతే ఎలా? పైగా ఆగ్రహించడం, బెదిరించడం..!

తెలంగాణ ప్రాంతంలో లాభాలు వస్తుండగా, ఆంధ్ర, రాయలసీమ ప్రాంతాల్లో ఆర్టీసీ నష్టాలతో ఉండనడానికి కారణం వప్పుడైనా యాజమాన్యం విశ్లేషించినదా ? యీ ప్రాంతంలో ప్రైవేటు బస్సులు, ప్రభుత్వ అనుమతితో, అనుమతి లేకుండా నడుస్తున్నాయి. గతంలో కొన్ని రోజులపాటు ప్రైవేట్ బస్సులు నిలిపివేస్తే రోజుకు 3 కోట్ల అదనపు ఆదాయం వచ్చింది. మరెందుకు ఆ విధానాన్ని కొనసాగించలేదు? ఆ ప్రైవేట్ బస్సుల యజమానులు అధికారపార్టీ నాయకులు, ప్రజా ప్రతినిధులు. అందువల్లే ప్రైవేట్ బస్సుల వ్యవహారం జోరుగా సాగుతోంది. ఒక నాయకుడు బాహాటంగా తనకు 80 బస్సులు వున్నాయని, వాటిని నిరోధించే సత్తా వవరికీ లేదని ప్రకటించాడు. ఆయన తమ్ముడు రవాణా అధికారిని ప్రభుత్వ కార్యాలయంలోనే బండబూతులు తిడుతూ, చేయి చేసుకున్నాడు. అదీ ప్రైవేట్ బస్సుల యజమానుల దాష్టీకం. అయినా ప్రభుత్వం ప్రైవేట్ బస్సుల విధానాన్ని కొనసాగిస్తూనే ఉంది. పైగా ఆర్టీసీ నష్టాల్లో ఉందని చెబుతూ సమ్మె సాకుతో మళ్లీ చార్జీలు పెంచవచ్చు. సమ్మె కాలంలో ప్రైవేట్ ఆపరేటర్ల దోపిడీకి చట్టబద్ధంగా మరింత అవకాశం యివ్వవచ్చు. సమయం చూసి బంగారు బాతైన రూ॥ 50,000 కోట్ల ఆస్తి గల సంస్థను అమ్మేసుకోవచ్చు.

ప్రభుత్వోద్యోగులు – కార్మికులు : సంఖ్యా రీత్యా తక్కువగా ఉన్న తమకు, అందులోను బేసిక్ వేతనం తక్కువ ఉన్న తమకు ప్రభుత్వోద్యోగులతో సమానంగా 43% ఫిట్మెంట్ ఎందుకు ఇవ్వరు అని ఆర్టీసీ కార్మికులు న్యాయంగా అడుగుతున్నారు.దాదాపు 25 ఏళ్ల సర్వీసు ఉన్న డ్రైవర్ జీతం రూ? 21 వేలు మించదు. అలన్నిటిని ఓట్ల రాజకీయాలతో ముఇపెట్టి అల్పసంఖ్యాకులను గుర్తించకపోవడం రాజకీయపార్టీలకు సహజమే. ఉద్యోగవర్గం సంఖ్య రీత్యా పెద్దది. ప్రభుత్వ యంత్రాంగంలో కీలకం. అందువల్ల ప్రభుత్వ ఉద్యోగులను ఆ మాత్రం సంతృప్తిపరచక తప్పదు. మన ప్రజాప్రతినిధులకు బస్సుల అవసరం లేదు. ఆర్టీసీ కార్మికులతో అంతకంటే పని లేదు.

సమైక్యాంధ్ర అంటూ తెల్లచొక్కాల వాళ్ళు, నీలిచొక్కాల వాళ్ళు రెండు నెలలకు పైగా సమ్మె చేసినపుడు ప్రభుత్వాలకు ప్రజల యిబ్బందులు గుర్తుకు రాలేదు. జరిగిన ఆర్థికనష్టం జ్ఞాపకం రాలేదు. పందుకంటే, ఆ ఉద్యమాల మీద ఆధారపడే ఇప్పటి అధికార పార్టీ గద్దెనెక్కింది. తమ విధానాల వల్ల ఆర్టీసీ నష్టపోగా దీనికి ఏవేవో సాకులు చెప్పి ఆ భారం కార్మికుల మీద వేయగలనని, ప్రజలందరినీ నమ్మించగలనని ఏపీ ప్రభుత్వం అనుకుంటోంది.తెలంగాణ ప్రభుత్వం ఏపీ ప్రభుత్వానికి ఏమాత్రం తీసిపోదు. తెలంగాణ సాధనలో ఎంతో శక్తివంతంగా పోరాడిన ఆర్టీసీ కార్మికుల న్యాయమైన డిమాండ్లను ప్రభుత్వం పట్టించుకోవడం లేదు. ప్రభుత్వాలు వేరైనా కార్మికుల విషయంలో అంతా ఒక్కటే. సమస్యను పరిష్కరిస్తానని కేసీఆర్ వాగ్దానాలు ఇవ్వడమే గాని సమ్మె ఇంత ఉధృతంగా నడుస్తున్నా సమస్య పరిష్కారానికి ఏమీ చేయలేదు. రెండు రాష్ట్ర ప్రభుత్వాల ఈ కుట్రను తిప్పికొడుతూ ప్రజలకు వాస్తవాలను వివరించడంలో కార్మిక నాయకత్వం ఘోరంగా విఫలమైంది. సొంతంగా టైర్ల కర్మాగారాన్ని నెలకొల్పుకొని అవసరమైన టైర్లను తామే తయారు చేసుకుంటామంటే, యాజమాన్యం నిరాకరించిందని ఇప్పుడైనా ప్రజలకు తెలియచేయాల్సిన బాధ్యత కార్మిక నాయత్వానికి ఉంది.

ఉద్యోగస్తులు – ప్రజలు : నూతన ఆర్థిక విధానాల ఫలితంగా వ్యక్తివాదం ముదిరి, సమిష్టితత్వం కనుమరుగైంది. యిది పాలకులకు తమ సామ్రాజ్యవాద అనుకూల విధానాలను అమలుచేసేందుకు అనుకూల పరిస్థితులను కల్పించింది. దాంతో పరిస్థితులను విశ్లేషించి, ప్రజలకు వాస్తవాలను వివరించే మధ్యతరగతికి అనేక సౌకర్యాలు కల్గిస్తూ బుజ్జగించడంలో పాలకులు విజయం సాధించారు. యిక సామాన్యులు రోజువారి అవసరాలలో పాలకుల కుట్రలను అర్థం చేసుకొనే పరిస్థితిలో లేరు. కార్మిక నాయకత్వం తమ సభ్యులను కేవలం ఆర్థిక డిమాండ్లకే పరిమితం చేస్తూ, వారికి వర్గ స్పృహ కల్పించడం లేదు. కార్మికులకు ప్రభుత్వ విధానాలపట్ల సరైన అవగాహన అందివ్వడం లేదు. యిక తెల్లచొక్కాల ఉద్యోగుల సంగతి చెప్పాల్సిన అవసరం లేదు. వాళ్ళు కేవలం వేతనశర్మలు. తమకు జీతాలు పెంచితే చాలు, ప్రభుత్వ విధానాలు పంత ప్రజావ్యతిరేకంగాఉన్నా ప్రశ్నించరు. అవి దీర్ఘకాలంలో తమ సర్వీసుకు ముప్పు తెచ్చేవైనా పట్టించుకునే స్థితిలో లేరు. ఇవాళ ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మిక శ్రేణులు ప్రభుత్వ విధానాలపై పోరాడాల్సిన అవసరం ఉంది. సమైక్య ఉద్యమంలో వీరంగం చేసిన ఉద్యోగ నాయకత్వం కన్నీటి తుడుపుగా, డిపోల దగ్గర ఆందోళన చేస్తున్న కార్మికులను పరామర్శించింది. తక్షణ అవసరాలకై, ప్రభుత్వ ప్రాపకం కోసం దేబిరించే నాయకత్వాన్ని ఉద్యోగులు, ఉపాధ్యాయులు, కార్మికులు పంత త్వరగా వదిలించుకుంటే అంత మంచిది. నయా ఉదారవాద విధానాలు అమలుపరుస్తున్న పాలకులు ఈ రోజు ఆర్టీసీని దెబ్బతీసి ప్రైవేటీకరిస్తారు. మనం మిన్నకుంటే రేపు మిగతా సంస్థలకు అదేగతి తప్పదు. (మేధో, శారీరక) శ్రమజీవుల ఐక్యపోరాటాలే అంతిమంగా న్యాయమైన వ్యవస్థను నిర్మించగలవు. ఇవాళ న్యాయమైన జీతాల కోసం పోరాడుతున్న కార్మికులు సంస్థను దక్కించుకోవాలంటే ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా ఉద్యమించాలి. అంతిమంగా దోపిడీ రాజకీయార్థిక విధానాలకు వ్యతిరేకంగా పోరాడాలి.

మరి న్యాయస్థానాల సంగతి ఎలా ఉంది? : మనకేదైనా అన్యాయం జరిగితే న్యాయస్థానాలకు వెళతాం. కానీ అక్కడ గద్దె మీద కూర్చున్న న్యాయమూర్తులకు నిజాలు ఎన్నటికీ తెలియదు. పైగా వ్యవస్థలోని అన్ని సమస్యలనూ తామే పరిష్కరించగలమనే నమ్మకం వారికి ఉంటుంది. దానికి ఆర్టీసీ కార్మికుల సమ్మె విషయంలో న్యాయస్థానపు స్పందనే ఉదాహరణ. సమ్మెవల్ల ప్రజలు యిబ్బంది పడుతున్నారని, కాబట్టి సమ్మె మానుకోవాలని ఆదేశించింది. సమైక్య ఉద్యమంలో నెలల తరబడి సామాన్యులు యిబ్బంది పడినప్పుడు న్యాయస్థానాలకు ప్రజలపాట్లు ఎందుకు కనిపించలేదు. ప్రపంచ చరిత్రలో కార్మికవర్గం పోరాడకుండా, పని నిలిపివేయకుండా యెన్నడూ తమ హక్కులను సాధించుకోలేదు. మెరుగైన జీవన ప్రమాణాలను పొందలేదు. ఆందోళనలు చేయకుండా పవ్వరూ తమ న్యాయమైన డిమాండ్లను సాధించుకోలేరు. సమ్మె కార్మికుల హక్కు. కాబట్టి ఆర్టీసీ కార్మికులు తమ పోరాటాన్ని కొనసాగించి డిమాండ్లు సాధించుకోవాలని ఆకాంక్షిస్తున్నాం. వాళ్ల న్యాయమైన పోరాటానికి పూర్తి సంఘీభావం ప్రకటిస్తున్నాం.

విప్లవ రచయితల సంఘం
పౌరహక్కుల సంఘం
రాయలసీమ విద్యావంతుల వేదిక
ఉద్యోగక్రాంతి
కర్నూలు
(ఆర్టీసీ కార్మికుల సమ్మె సందర్భంగా ప్రచురించిన కరపత్రం)

కరపత్రం

# డా. జి.ఎన్. సాయిబాబాను వెంటనే విడుదల చేయాలి
# యుఎపిఎ అప్రజాస్వామిక చట్టాన్ని రద్దు చేయాలి
# ప్రజాస్వామిక స్వరాలపై నిర్బంధం వద్దు

ప్రియమైన ప్రజాలారా!

ప్రజాస్వామ్యబద్ధంగా వ్యవహరించమని ప్రభుత్వాలకే పదే పదే గుర్తు చేయవలసిరావడమే ఈ ప్రభుత్వాల ఫాసిస్టు స్వభావానికి నిదర్శనం. ప్రజల పక్షాన, పీడిత వర్గాల తరపున, దళిత, ఆదివాసీ, ముస్లిం, మైనారిటీ హక్కులకై నినదిస్తున్న గొంతులను నులిపివేసే ప్రభుత్వ నిర్బంధ ప్రయోగం సిగ్గుచేటు. సమాజంలో ఉపాంత వర్గ ప్రజలపై ప్రభుత్వాలు కొనసాగిస్తున్న వివక్షత, దమనకాండను భావ ప్రకటనా స్వాతంత్ర్య హక్కులో భాగంగా ప్రశ్నిస్తున్న అసమ్మతి స్వరాలు ధిక్కార గొంతుల ఆలోచలను, అభివ్యక్తీకరణను హరించివేయాలని పాలకవర్గాలు ప్రయత్నిస్తున్నాయి. గొంతు లేని వారి గొంతుకగా మారుతున్న ప్రజా ఆరోగ్య, హక్కుల నాయకుడు డా. వినాయక్ సేన్‌ను ముప్పై ఏళ్ళ పాటు ఆదివాసులకు ఆరోగ్య సేవ చేసినందుకే అరెస్టు చేసి హైకోర్టు కూడా బెయిల్ నిరాకరిస్తూ 3 ఏళ్ళ పాటు జైల్లో పెట్టి సెషన్స్‌కోర్టు జీవితఖైదు విధించింది. చివరకు సుప్రీంకోర్టు బెయిల్ వల్ల బయటికి వచ్చినా జీవితఖైదుపై హైకోర్టులో విచారణ కత్తి నెత్తిన వేలాడుతూనే ఉంది. ఆదివాసుల విస్థాపన గురించి పాడిన సంథాలీ కవి జీతన్‌మరాండీ, అతని ముగ్గురు సహచరులకు ఉరిశిక్ష విధించిన విషయం మనకు తెలిసిందే, ప్రజాఉద్యమం వల్లే అతడు విడుదల అయ్యాడు.

ఒరిస్సాలో నాలుగు దశాబ్దాలుగా ఆదివాసుల, ప్రజాస్వామిక హక్కుల ఒకే ఒక స్వరంగా ఉన్న దండపాణిని మూడు సంవత్సరాల క్రితం అరెస్ట్ చేసి 13 కేసులు పెట్టి అన్నింట్లో నిర్దోషి అని కోర్టు కొట్టివేసిన తరువాత మరో 5 కేసులు పెట్టి బయటకు రాకుండా చూస్తున్నారు. కలెక్టర్ వినిల్ కృష్ణను మావోయిస్టు పార్టీ బందీగా తీసుకొన్నప్పుడు ప్రొ. ఆర్‌ఎస్ రావు, ప్రొ. హరగోపాల్‌తో పాటు, తరువాత ఇటాలియన్ ఫోటోగ్రాఫర్‌ను కందమాల్‌లో బందీగా తీసుకున్నప్పుడు డా. బిడి శర్మతో పాటు ప్రభుత్వ విజ్ఞప్తిపై మధ్యవర్తిగా వ్యవహరించిన, దేశానికంతా తెలిసిన ప్రజాస్వామిక హక్కుల కార్యకర్త అతను. ఆ డెబ్భై ఏళ్ళ పైబడిన వృద్ధుడు ఏప్రిల్ 24 నుంచి తనపై ఈ నిర్బంధానికి నిరసనగా బరంపురం జైలులో నిరాహార దీక్ష చేస్తున్నాడు. అతని ఆరోగ్యం క్షీణించడంతో ప్రభుత్వ ఆసుపత్రిలో చేర్చారు. కేరళలో బహుళజాతి కంపెనీల, బడా కంపెనీల దోపిడిని వ్యతిరేకించినందుకు అజయన్ అనే ఆర్‌డిఎఫ్ కార్యకర్తను, మరో ముగ్గురు ఆర్‌డిఎఫ్ సభ్యులను రాజద్రోహ నేరం కింద అరెస్ట్ చేశారు. డా. జి.ఎన్. సాయిబాబా అరెస్టుకు ఏడాది ముందే జవహర్‌లాల్ విశ్వవిద్యాలయం విద్యార్థి, సాంస్కృతిక కార్యకర్త, అంగవికలుడు కూడా అయిన హేమ్ మిశ్రాను అరెస్ట్ చేసి ఇప్పటికి కూడా బెయిల్ ఇవ్వలేదు. మరో జర్నలిస్ట్ ప్రశాంత్ రాహి, మారుతి మరో ఆదివాసీ కార్యకర్తతో కలిసి సాయిబాబాపై యుఎపిఎ చట్టం కింద కేసు పెట్టారు.

హేమ్‌మిశ్రా, ప్రశాంత్ రాహి అరెస్ట్ తరువాత మహారాష్ట్ర గడ్చిరోలి జిల్లా అహిరిలో జరిగిన ఒక దొంగతనానికి చెందిన సొమ్ము ఢిల్లీ విశ్వవిద్యాలయం చీఫ్ వార్డెన్ క్వార్టర్ అయిన గ్వైర్ హాలులో ఉంటున్న సాయిబాబా ఇంట్లో జప్తు చేయవలసి ఉందనే తప్పుడు వారెంట్‌తో ఒకసారి సెర్చ్ వారెంట్‌తో వచ్చారు. అది ఎంత తప్పుడు ఆరోపణ అయినా, ఎటువంటి విచారణకైనా అంగవైకల్యం వలన, ఉద్యోగరీత్యా తాను సహకరిస్తానని సాయిబాబా చెప్పాడు. 2014 జనవరిలో మళ్ళీ ఇంటిలిజెన్స్ వారు దినమంత ప్రశ్నించినా కూడా, ఇది ఎంత తప్పుడు కేసు అయినప్పటికీ, తాను కోర్టుకు, విచారణాధికారులకు సహకరిస్తానని చెప్పాడు. కాలకృత్యాలకు, ఆహార పానీయాలకు, శారీరక మౌలిక అవసరాలకు, కదలికలకు ఒకరిద్దరి సహాయంపై ఆధారపడే జి.ఎన్. సాయిబాబా పారిపోతాడనో, లభ్యంకాడనో భావించే టెర్రరిస్టుగా ప్రభుత్వానికి కనిపించే దుర్మార్గమైన విషయం మరొకటి లేదు. ఇది సాయిబాబా పట్ల సానుభూతి, మానవతా దృష్టి కోసం చెబుతున్న విషయం కాదు. ఆయన వంటి వారికి అంతర్జాతీయ సూత్రాల ప్రకారం, నైసర్గిక సూత్రాల ప్రకారం లభించవలసిన హక్కు.

ఢిల్లీ విశ్వవిద్యాలయంలో ఆచార్యుడుగా పనిచేస్తున్న డా. జి.ఎన్. సాయిబాబాను మహారాష్ట్ర పోలీసులు ఢిల్లీ విశ్వవిద్యాలయ ప్రాంగణం నుండి 2014 మే 9 నాడు అపహరించుకుపోయి నాగపూర్ కేంద్ర కారాగారంలో నిర్బంధించి సంవత్సరం పూర్తి కావస్తోంది. దైనందిన కార్యక్రమాలను కూడా 'చక్రాల కుర్చీ' సహాయంతో ఇద్దరి సహాయం లేకుండా కాలకృత్యాలు కూడా తీర్చుకోలేని డా. జి.ఎన్. సాయిబాబాను 'అండాసెల్'లో ఒంటరి ఖైదీగా నిర్బంధించిన ప్రభుత్వంకు తన దోపిడీ విధానాలను ప్రశ్నించే మేధావుల, ప్రజాస్వామికవాదుల, పురోగామి శక్తుల ధిక్కార స్వరాలు, 'దేశభద్రతకు ముప్పు'గా కనిపించడం సహజమే. ఇటువంటి గొంతులను చెరసాలలో సంకెళ్ళు వేసి, నొక్కి వేసి విజయం సాధించాలనుకోవడం తాత్కాలికమేనని ప్రభుత్వాలు గమనించాలి.

తొంభై శాతం శారీరక వైకల్యం గల డా. జి.ఎన్. సాయిబాబాను చట్ట వ్యతిరేక కార్యకలాపాల నిరోధక చట్టం (యుఎపిఎ)లో 13, 18, 20, 38, 39 సెక్షన్ల (ఎఫ్ఐఆర్ నెం. 3017/2013) కింద నిర్బంధించారు. ఈ సెక్షన్లు రాజకీయ విశ్వాసాలను, అసమ్మతిని 'నేరం'గా ప్రకటించడానికే పనికి వస్తాయి. దేశాన్నే జైలుగా మార్చి బహుళజాతి సంస్థల, కార్పోరేటు సంస్థల ప్రయోజనాలకు పట్టం కట్టడానికి పాలకవర్గాలు ముందు వరసలో నిలబడి ఉంటున్నాయి. ఈ క్రమంలోనే క్రియాశీల హక్కుల కార్యకర్తలపైనా, ఆదివాసీ ప్రజలపైన సాగుతున్న నెత్తుటి దమనకాండకు వ్యతిరేకంగా గొంతునెత్తుతూ ప్రజల పక్షాన ప్రభుత్వ దుర్మార్గాలను ప్రశ్నిస్తున్న ప్రగతిశీల శక్తులపై అణిచివేతను ప్రయోగించి దోపిడి విధానాల కొనసాగింపులో భాగంగా అక్రమ అరెస్ట్‌లు, నిర్బంధం అమలౌతున్నాయి. ధిక్కార స్వరాలపై ప్రభుత్వం న్యాయ, పోలీసు, పారా మిలటరీ బలగాల ద్వారా దాడులు చేసి అణచివేతకు ప్రయత్నిస్తుంది.

డా. జి.ఎన్. సాయిబాబాకు ఇప్పటికే హైకోర్టు, కింది కోర్టు ప్రభుత్వ, పోలీసు వత్తిడి వలన బెయిల్ నిరాకరించాయి. బెయిల్ దరఖాస్తుపై కోర్టులో వాదనల సమయంలో డా. సాయిబాబాకు పోలీసు అధికారుల ఆదేశాలకు అనుగుణంగా జైలు అధికారులు ప్రత్యేక ఆహారం అందించడం, వైద్య పరీక్షలకు పంపడం చేస్తున్నారు. బెయిల్ తిరస్కరించగానే వెంటనే వీటిని తొలగిస్తున్నారు. దీనికి నిరసనగా డా. సాయిబాబా మే 11వ తేదీ నుండి జైలులో నిరాహార దీక్ష ప్రారంభించాడు. అనారోగ్యంకు అవసరమైన మందులు ఇవ్వాలి, కోర్టు ఆదేశాల ప్రకారం వైద్యులు సూచించిన ఆహారం అందించాలి. రక్త సంబంధీకులు, న్యాయవాదులు తీసుకొచ్చే పండ్లు, ఇతర ఆహార పదార్థాలను జైలులోనికి ఇచ్చే అనుమతిని తిరిగి పునరుద్ధరించాలి, జైలులో చక్రాల కుర్చీ కదలికలకు కావలసిన సౌకర్యాన్ని శారీరక వైకల్య సమాన అవకాశాల చట్టం ప్రకారం కల్పించాలి. న్యాయమూర్తులకు, న్యాయవాదులకు, కుటుంబ సభ్యులకు, స్నేహితులకు రాసే, వారిని నుంచి వచ్చే లేఖలను మాయం చేయకుండా అందించాలి, చట్ట ప్రకారం జైలుకు వచ్చి కలిసే కుటుంబ సభ్యులకు, న్యాయవాదులకు, జైలు అధికారులు అనుమతించే వ్యక్తులను 'జాలీ ములాఖత్' కాకుండా అధికారుల సమక్షంలో నేరుగా కలిసే ఏర్పాటు కావాలనే డిమాండ్లతో నిరాహార దీక్ష ప్రారంభించాడు. మే 14 నాడు రెండు సార్లు స్పృహ కోల్పోయాడు. మే 16, రాత్రి పదకొండు గంటలకు మరోసారి స్పృహ కోల్పోతే, జైలు డాక్టరు బలవంతంగా సెలైన్ ఎక్కించి భారీ బందోబస్త్ మధ్య అర్ధరాత్రి నాగ్‌పూర్ వైద్య కళాశాల ఆసుపత్రికి తరలించారు. అప్పటికే సాయిబాబాకు అవసరమైన మందులు, ఆహారం అందించాలని కింది కోర్టు ఆదేశాలు జారీ చేసినా, జైలు అధికారులు న్యాయవాదులను కలవడానికి, కోర్టు ఆదేశాలు స్వీకరించడానికి నిరాకరించారు. కోర్టు ఆదేశాలు, కుటుంబ సభ్యుల, ప్రజా సంఘాల కోరిక మేరకు డా. సాయిబాబా నిరాహార దీక్షను ఆసుపత్రిలో మే 17న విరమించాడు.

డా. జి.ఎన్. సాయిబాబాకు శారీరక వైకల్యం వల్ల వచ్చే అనారోగ్య సమస్యలతో పాటు రక్తపోటు, గుండెజబ్బు, భుజాల నరాల క్షీణత, వెన్నెముక నొప్పితో బాధపడుతూ రోజూ అనేక రకాల మందులు మింగవలసి ఉంది. వీటికోసం సరైన ఆహారం తినాలి. క్రమం తప్పకుండా వైద్య పరీక్షలు అవసరం. జైలులో మందులు, ఆహారం, ఇతర సౌకర్యాలు నామమాత్రంగా కూడా లేవు. డా. జి.ఎన్. సాయిబాబాను అతని శారీరక వైకల్యం, అనారోగ్య సమస్యలు దృష్ట్యా వెంటనే విడుదల చేయాలి. చట్టబద్ధమైన ప్రజా పోరాటాలను అణచివేయాలనే లక్ష్యంతో సాగుతున్న అక్రమ అరెస్టులకు వ్యతిరేకంగా పోరాడుదాం.

అతనికి గుండె జబ్బు కారణంగా యాంజియోగ్రాం చేయవలసి ఉంది. పోలీసు అధికారుల ఒత్తిడి చేసి ఈ వేసవిలోనే యాంజియోగ్రాం చేయాలని డాక్టర్లచే బలవంతపెడుతున్నారు. అయితే సాయిబాబా వ్యక్తిగత వైద్యులు ఇటువంటి అనారోగ్య, సౌకర్యలేమిలో చేయడం మంచిది కాదని పేర్కొంటున్నారు. ఆసుపత్రిలో తప్పుడు వైద్య పరీక్షలు, మందులతో సాయిబాబాకి ప్రాణహాని ఉంటుందని వైద్య నిపుణులు పేర్కొంటున్నారు. కేవలం జైలు డాక్టర్ల నిర్ధారణ మేరకే కాకుండా ఈ విషయంలో వైద్య నిపుణులచే రెండో అభిప్రాయం తీసుకోవలసిన అవసరం ఉంది. కాబట్టి వ్యక్తిగత వైద్యులు, గతంలో వైద్యం అందించిన డాక్టర్ల బృందం సాయిబాబాను పరీక్షించే అవకాశం కల్పించాలి. యాంజియోగ్రాం అవసరమయ్యే పక్షంలో వైద్య బృందం సూచించిన సమయంలో, ఆసుపత్రిలో చేయించాలి. జైలులోనే సాయిబాబాను చంపి వేసే ప్రయత్నం జరుగుతోంది. ఇది బుద్ధిజీవులకు ఒక హెచ్చరిక. ఇటువంటి దుర్మార్గ ప్రభుత్వ నిర్బంధ విధానాలను ఖండించడం మన కనీస ప్రజాస్వామిక కర్తవ్యం. విశ్వవిద్యాలయాలలో ఆచార్యులు, బుద్ధిజీవులు, మేధావులు, ప్రజాస్వామికవాదులు, హక్కుల కార్యకర్తలు ఐక్యంగా కదిలి డా. సాయిబాబా విడుదలకు ప్రయత్నిద్దాం.

## డిమాండ్లు

1. *డా. జి.ఎన్. సాయిబాబాను బేషరతుగా వెంటనే విడుదల చేయాలి. ఆయనపై అక్రమ కేసులను ఎత్తివేయాలి.*
2. *హక్కుల కార్యకర్తలపైనా, రాజకీయ విశ్వాసాల పట్ల నిర్బంధం ఎత్తివేయాలి.*
3. *వనరుల వెలికితీత పేరుతో సాగుతున్న విధ్వంసాన్ని ఆపి వేయాలి.*
4. *గతంలో వైద్యం అందించిన వైద్య బృందం సాయిబాబాకు వైద్య పరీక్షలు నిర్వహించేందుకు అనుమతివ్వాలి.*
5. *డా. జి.ఎన్. సాయిబాబాను జైలులోనే హత్య చేసే ప్రభుత్వ కుట్రను ఖండిద్దాం.*

## భాగస్వామ్య సంఘాలు

1. CLC : Civil Liberties Committee
2. OPDR : Organization for Peoples Democratic Rights
3. HRF : Human Rights Forum
4. CLMC : Civil Liberties Monitoring Committee
5. Virasam : Viplava Rachyithala Sangam
6. CRPP : Committee for Release of Political Prisoners
7. PKM : Praja Kala Mandali
8. ASS : Arunodaya Sanskruthika Samakya
9. CMS : Chaithanya Mahila Sangam
10. POW : Progressive Organization of Women
11. TSA : Telangana Students Association
12. SSF : Scientific Students Federation
13. Udyoga Kranthi (Employees Co-ordination Committee)
14. PKS : Pragathisheela Karmika Samakhya
15. IFTU : Indian Federation of Trade Unions
16. PYL : Progressive Youth League
17. KNPS : Kula Nirmulana Porata Samithi
18. AIKMS : All India Kisan Mazdoor Sangh
19. TVV : Telangana Vidyavanthula Vedika
20. TPF : Telangana Praja Front
21. TFAD : Telangana Forum Against Displacement
22. PDM : Patriotic Democratic Movement
23. ABMS : Amarula Bandhu Mithrula Sangam
24. FSC : Forum of Social Change
25. DTN : Democratic Teachers Network
26. AYS : Ambedkar Yuvajana Sangam
27. PDSU (Thirugubatu) : Progressive Democratic Student Union
28. PYL : Progressive Youth League

**డా. జి.ఎన్. సాయిబాబా విడుదల పోరాట కమిటీ**

# విప్లవ సాహిత్యంతో రెండు సాయంత్రాలు...

ఫిబ్రవరి 7-8 తేదీలలో బొబ్బిలిలో విప్లవ రచయితల సంఘం నిర్వహించిన సాహిత్య పాఠశాలలో 20 విరసం ప్రచురణలు, 10 సోదర సంస్థల ప్రచురణలలో కలిపి మొత్తం 30 పుస్తకాల ఆవిష్కరణ జరిగింది. ఈ పుస్తకాలలో 22 పుస్తకాలను వరంగల్‌లో ఏప్రిల్ 27-28 తేదీలలో మధ్యాహ్నం 3 గంటల నుండి 7 గంటల వరకు ఆర్ట్స్ కళాశాల సెమినార్ హాల్ వేదికగా, విరసం వరంగల్ యూనిట్ పరిచయ వేదిక ఏర్పాటు చేసి 12 మంది యూనిట్ సభ్యులతో పాటు 10 మంది స్థానిక విరస యేతర సాహితీ మిత్రులను భాగస్వామ్యం చేసింది.

మొదటి రోజు 'భారత దేశంలో కుల సమస్య' అనురాధాగాంధీ రచించిన పుస్తకాన్ని యూనిట్ సభ్యుడు బాజా సైదులు పరిచయం చేస్తూ, సమానత్వం న్యాయం ప్రాతిపదిక మీద కులనిర్మూలనకు అనుసరించివలసిన సూత్రాలు విధి విధానాలు ఈ పుస్తకంలో ఉన్నయనీ, పునాది ఉపరితలం ప్రాతిపదికగా ఉన్న విశ్లేషణ సరియైనదనీ, రచన గతి తార్కిక పద్ధతిలోనూ ఉన్నదని అందుకు రుజువుగా చర్చ ఆదిమ సమాజంతో మొదలై ఆర్యులు మొగలులు ఆంగ్లేయులు భారతదేశానికి వచ్చిన కాలాలలో క్రమంగా కులం పుట్టుక స్థిరీకరణ కొనసాగింపుల పరిశీలనలున్నాయని అన్నారు. యుద్ధంలో గిరిజనులను లోబర్చుకునే క్రమంలో కులాలు ఏర్పడడం - అనే పరిశీలన సరియైనదనీ అయితే పుట్టుక విధానంకు సంబంధించి మూలాల్లోనికి వెళ్ళలేదనీ, నాస్తికత్వాన్ని ప్రోత్సహించాలనడం సరియైంది కాదనీ అది భావవాదుల ఉచ్చులో పడిపోవడమనీ అన్నరు. ప్రత్యామ్నాయంగా జీవం పుట్టుకకు పదార్థం కారణం అని అర్థం చేయించాలనీ అన్నారు.

యన్. వెంకటేశ్వర్లు యూనిట్ సభ్యుడు 'నల్లమల' నవలను పరిచయం చేస్తూ నవలలో పీడిత వర్గాల ప్రాతినిధ్య పాత్రలు ఆధిపత్యాన్నెదిరించే క్రమాన్ని చక్కగా మలిచారనీ నాగరిక సమాజానికి దూరంగా చదువు లేకున్నా నల్లమలలోని చెంచులు దున్నేవాడికి భూమి కావాలనే నినాదపు ఉద్యమంలో భాగస్వాములైన క్రమం, అందుకు పార్టీ చేసిన కృషి సహనం పట్టుదల ఎంత గొప్పవో సూటిగా చెప్పకనే రచయిత కథనంగా మలిచారన్నరు.

అంతిమంగా పరిమాణాత్మక మార్పు గుణాత్మక మార్పుగా పరిణమించిన విధం నవలతో అత్యంత నైపుణ్యంగా మలిచారన్నరు.

మూడవ పుస్తకంగా 'సామాన్యుల సాహసం' కథా సంకలనాన్ని గోదావరీ సాహితీ మిత్రులు సంస్థ సభ్యులు వంగాల సంపత్ రెడ్డి పరిచయం చేస్తూ భారత దేశంలో నాగరికుల మనుకుంటున్న మనం ఉద్యోగ ఉపాధ్యాయులు వ్యాపార వర్గాలు మౌనంగా ఉండగా మల్టీ నేషనల్ కంపెనీల వలసాధిపత్యానికి వ్యతిరేకంగా ఆదివాసీలు పోరాటానికి దిగడం వినూత్న విషయమనీ, సాధారణంగా యుద్ధంలో ఉంటే ఉత్పత్తిలో, ఉత్పత్తిలో ఉంటే యుద్ధంలో ఉండజాలని పరిస్థితి బయటి మైదాన ప్రాంతంలో ఉందని, అయితే మధ్య భారతంలోని ఆదివాసీలు ఏకకాలంలో యుద్ధం ఉత్పత్తుల్లో భాగస్వాములవుతున్న దృశ్యం ఈ కథల ద్వారా చూసినపుడు ఆశ్చర్యం కల్గిస్తుందని అన్నారు. ఆదివాసులు సామ్రాజ్యవాదాన్ని ఎదుర్కొంటూ దీన్నెట్లా సాధ్యం చేస్తున్నదీ ఈ కథల ద్వారా చూడవచ్చు అన్నారు.

తర్వాత 'వేక్ అఫ్ తెలంగాణ' బాసిత్ రాసిన నాటకాన్ని న్యాయవాది, తెలంగాణ ఉద్యమ సందర్భంలో 'మన తెలంగాణ' పత్రికా నిర్వహకులు కల్ర ఎల్లారెడ్డి పరిచయం చేస్తూ అదే రోజున ఆంధ్రజ్యోతి దినపత్రికలో అందెశ్రీ సభ్య సమాజానికి వేసిన ప్రశ్ననే అంతకు ముందే బాసిత్ తన నాటికలోని పాత్రల ద్వారా వేశారన్నారు. భౌగోళిక తెలంగాణ మాత్రమే వచ్చిందనీ ప్రజలు కోరుకున్న ప్రజాస్వామిక తెలంగాణ రాలేదన్న విషయాన్ని రచయిత నాటికలోని పాత్రల చేత అదీ పాఠశాల విద్యార్థులచే ఆంగ్లంలో చెప్పించడం అభినందనీయమన్నారు.

ఐదవ పుస్తకంగా 'కాలిబాట' ఉదయమిత్ర కవితా సంకలనాన్ని కా॥ సుదర్శన్ పరిచయం చేస్తూ హైటెక్ జాతీయ రహదార్లకు మరిగి నడిచి వచ్చిన కాలిబాటను మరిచిపోతున్న ఈ సమయంలో ఉదయమిత్ర కవిత్వం వచ్చిందని అన్నారు. కవి తన కవిత్వం ద్వారా తన భావాలను పసివాడిలాగా మన ముందుంచాడనీ, ఇతని ప్రాపంచిక దృక్పథం ఆదివాసీ నిర్మల నిరాడంబర జీవితం అనీ అతని చూపు కరువు ఆకలి గల స్వంత పాలమూరు జిల్లా దాటి పాలస్తీనా వరకు విస్తరించి కవిత్వీకరించిందనీ పుస్తకంలోని కొన్ని కవితలను ప్రస్తావించారు.

'సముద్రంలో కెరటాలయితే విరిగిపోవచ్చుగానీ వాటి జననం మున్ముందుకు వేగమైన చలనం ఎన్నడూ ఆగిపోదని, సముద్రం ఎన్నడూ ఇంకిపోదనీ; ఆదివాసీ సామాన్యులకు నిలువ నీడలేకుండా చేస్తే వాళ్లదెప్పుడూ అడివి మార్గమేనన్న 'అడవి మార్గం' కవితనూ, 'పాలస్తీనా' 'స్వేచ్ఛ ఎంత చిన్నదయినా మాకది సముద్రమే' అన్న వాక్యాల్నుటంకిస్తూ చివరగా 'బాసగూడ' నాటక రచయిత ఇతనేనని సభకు పరిచయం చేసి పుస్తకంలోని చివరి రెండు పాటలను పేర్కొన్నారు.

తర్వాత ప్రొఫెసర్ జ్యోతిరాణి పద్మకుమారి రాసిన పాల్గుణ నవలికను పరిచయం చేస్తూ దోపిడీ సమాజపు ఆఖరి దశ చిహ్నంగా తెలుగు సంవత్సరాలలోని ఆఖరి మాసం ఫల్గుణం పేరున ఈ నవలిక వచ్చిందన్నారు. ఇందులోని స్థలకాల పాత్రలు సింగరేణి ప్రాంతానికి చెందినవని అన్నారు. ప్రజా ఉద్యమకాలంలో మిస్సింగ్ కేసుకు సంబంధించిన కథ ఇదని వివరించారు. హత్య కంటే మిస్సింగ్ సంఘటనల్లో కుటుంబ సభ్యుల ఆవేదన ఎంత భయంకరంగా ఉంటుందో ఈ నవలికలో చిత్రించారని అన్నారు. మనిషి పునరాగమనపు ఆశ నిరాశల ఊగిసలాటలోని దుర్భరమైన పరిస్థితికి దర్పణమే ఈ నవలికన్నారు.

చివరగా తామొక టీమ్‌గా 80వ దశకంలో ఉద్యమం బలంగా

ఉన్న కాలంలో చూసిన పల్లెలను ఇవాళ మళ్లీ సందర్శిస్తే అక్కడ ఉద్యమం ఆధిపత్య ఫ్యూడల్ వ్యవస్థలను కూల్చగలిగిందే గాని సోషలిస్టు మానవుడిని సమాంతరంగా తయారు చేయలేదనిపించిందని అన్నారు. ఇలాంటి సమస్య ఈ నవలికలో కూడా ఉందని అన్నారు. పాల్గుణ కమిటెడ్ ఉద్యమకారుడు... అయితే ఉద్యమంతో సంబంధంలేని 15 ఏళ్ళ పిల్లనెట్లా పెళ్ళి చేసుకొని 16 ఏళ్ళకే తల్లిని చేయడం ఉద్యమ భావజాల చైతన్యరాహిత్యానికి గుర్తని అన్నారు. దీనికి ఆనాటి రాజకీయ పార్టీ బాధ్యత వహించాలన్నారు.

ఏడవ పుస్తకంగా 'అడివి పుత్రుడు మంగన్న' వివి రచనను పరిచయం చేస్తూ వికలాంగ ఉద్యోగ సంఘ బాధ్యుడు భిల్లా మహేందర్ విప్లవోద్యమంలో అమరుడైన కామ్రేడ్ జీవితమే ఈ పుస్తకం అన్నారు. ఇందులో మంగన్న సాధారణ జీవితం నుంచి అడివి పుత్రుడు మంగన్నగా ఎదిగిన క్రమాన్ని రచయిత వివరించాడన్నరు. మంగన్న మొదట రివిజనిస్టు పార్టీలలో ఉండి 1991లో పీపుల్స్‌వార్ పార్టీలో చేరాడని అన్నారు. బాల్య వివాహం చేసుకున్న ఆదివాసీ మంగన్న విప్లవం తప్ప వేరే ధ్యాస లేకుండా అడివి పుత్రుడిగా ఎదగడం ఆశ్చర్యం కల్గిస్తుందన్నరు.

తర్వాత 'దండకారణ్యం ఒక ఆకుపచ్చని కల' కెనరీ దీర్ఘ కవితను యూనిట్ సభ్యుడు నాగేశ్వర్ పరిచయం చేస్తూ ఆదివాసీల జీవన ఆరాట పోరాటాలే ఈ కల అనబడే వాస్తవమన్నారు. తెలంగాణలోని నల్గొండకు చెందిన ఈ కవికి మధ్య భారతంలోని దండకారణ్యానికి చూపు సారించవలసిన అవసరం ఆదివాసీ పోరాటాల వల్లే కలిగిందని అన్నారు. అన్నలకు అన్నమియ్యబోతున్న భారతీ బాయి మీద ఆర్పీఎఫ్ తోడేల్లు చేసిన అరాచకం గుజరాత్‌లో సంఘ పరివార్ శక్తులు గర్భస్త పిండాన్ని శూలంతో బైటకు తీసిన సంఘటనకు ఒక నమూనా అన్నారు. రణీత శత్రువుతో చేసిన 10 గంటల వీరోచిత పోరాటం, బాసగూడ సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో భూమి సాగు విత్తనాల పంపిణీ కోనం నమావేశమైనవుడు పోలీనుల బలగాలు జరిపిన మారణకాండను కవిత్వీకరించాడన్నారు.

తర్వాత ముఖ్య అతిథిగా వచ్చిన విరసం రాష్ట్ర కార్యదర్శి వరలక్ష్మి 'తూర్పు మధ్య భారతంలో విస్థాపన' పుస్తకాన్ని పరిచయం చేస్తూ, మూడు వ్యాసాల నివేదిక ఈ చిన్న పుస్తకమనీ, 32 పేజీల ఈ పుస్తకాన్ని పరిచయం చేయడానికి 600 కి.మీ. ప్రయాణించవలసి వచ్చినా వరంగల్‌కు రావడమే ఒక థ్రిల్ అనీ ఎక్సైట్‌మెంట్ అనీ అన్నారు. ఏడు మండలాలను బలిపెట్టి తెలంగాణ రాష్ట్రం ఏర్పడిందనీ ఈ పోలవరం ముంపు మండలాల ప్రజలు తెలంగాణ రాష్ట్రం కోసం జరిగిన అన్ని రకాల పోరాటాలలోనూ భాగస్వామ్యం అయినా వాళ్లు తెలంగాణకు కానివారమయ్యారన్నరు. విరసం ఈ తెలంగాణను నొప్పుకోదని అన్నారు. నేపాల్ విధ్వంసం పూర్తిగా ప్రకృతి భీభత్సమే కాదనీ, తెలుగు సీమలోని కొవ్వాడ వంటి అణువిద్యుత్ ప్లాంట్‌లను విచక్షణ లేకుండా నిర్మించడం వల్ల ప్రకృతి సంక్షోభాలు తలెత్తుతున్నాయని అన్నారు. దీనికి పాలక ప్రభుత్వాల అభివృద్ధి విధానాలే కారణమని అన్నారు. పోలవరం, సోంపేట, ఉత్తరాంధ్రలో బాక్సైట్ గనుల తవ్వకాలకు వ్యతిరేకంగా ప్రజాస్వామ్య పద్ధతుల్లో రాజ్యాంగ హక్కుల ప్రాతిపదిక మీద ఉద్యమిస్తున్నా అవి ఆగడం లేదని అన్నారు. ఇలాంటి విస్థాపనలకు వ్యతిరేకంగా మధ్య భారతంలోని దండకారణ్యంలో ప్రజలు తమ సాయుధ పోరాటాల ద్వారా నిలువరించగలుగుతున్నారని అన్నారు. విస్థాపనాలకు వ్యతిరేకంగా అన్ని ప్రాంతాల్లో ఉద్యమాలు విస్తరించాలని అన్నారు.

పదో పుస్తకం బాసిత్ కవిత్వం 'తెహెల్కా అద్దంలో సర్కార్ ప్రతిబింబం'ను పరిచయం చేస్తూ యూనిట్ సభ్యుడు జోదా కోబల్ మాట్లాడుతూ ఈ కవితా సంకలనంలో ఇరాక్ సద్దాం, గుజరాత్, శ్రీలంక ఎల్‌టీటీఈల నుండి నిన్నటి తెలంగాణ ఉద్యమం దాకా 40 కవితల్లో 20 కవితలు తెలంగాణ ఉద్యమం గురించి రాసినవేనని అన్నారు. జీతన్ మరాండి, గంటి ప్రసాదంల మీద రాసిన కవితలు ఉన్నాయని, తెహల్కా అద్దంలో సర్కార్ స్వరూపంలోని కొన్ని పాదాలను చదివి విన్పించి భారత పాలకులు సామ్రాజ్యవాదుల కమీషన్‌ల కోసం దేశాన్ని తాకట్టుపెడుతున్న వైనాన్ని వ్యంగంగా కవిత్వీకరించారన్నారు.

చివరగా పదకొండో పుస్తకం వివి కవిత్వం 'బీజభూమి' కవితా సంకలనాన్ని వడ్డెబోయిన శ్రీనివాస్ పరిచయం చేశారు. ఉద్యమ కవితలంటే నరుకు, చంపు, నెత్తురు, సూర్యుడు వంటివి మాత్రమే ఉంటాయనే తప్పుడు విమర్శ ఇప్పటికీ ఉందని, విప్లవ కవిత్వం ఎంత వైవిధ్యభరితంగా ఉంటుందో బీజభూమి ఉదాహరణ అని అన్నారు. ఈ సంకలనంలో హైదరాబాద్‌లోని మధ్య తరగతి బుద్ధిజీవుల నిత్య జీవిత మానవ సంబంధాల తడి, పని మనిషి, నర్స్, నైట్ వాచ్‌మెన్, హైదరాబాద్ టాంక్‌బండ్ బుద్ధుడు, పాతబస్తీ మొదలైన వన్నీ ఇందులో కవిత్వమయ్యాయని అన్నారు. వాచ్‌మెన్ ఒక రోజు ఉదయమే డ్యూటీలో కన్పించకపోతే 'ఇంత దీర్ఘ నిద్ర నీకెలా సాధ్యమైందో'ని ప్రశ్నిస్తూ అతడు మన కోసం నిద్రపోని సంకట దయనీయ స్థితిని వివి గుర్తు చేశారని అన్నారు. బుద్ధుని గురించిన కవితలో చుట్టూరా కంపు కొడుతున్నప్పుడు కళ్ళు తెరిపించాడని అన్నారు.

మొదటి రోజు జరిగిన ఈ పుస్తక పరిచయ సభకు కార్యవర్గ సభ్యుడు బాసిత్ అధ్యక్షత వహించాడు.

విప్లవ సాహిత్యంలో రెండవ సాయంత్రం తేది 28-04-2015 "మొదటి పుస్తకం 'స్టోలిపిన్ అభివృద్ధి నిరోధక కాలంలో' శ్యాంరావు ప్రారంభించాడు. 1900లో ఐక్య సంఘటనతో మొదలయిన రష్యన్ విప్లవం మీద నాటి జార్ ప్రభువు ఉక్కు నిర్బంధాన్ని అమలు చేశాడని, బోల్షివిక్ పార్టీ కార్యకర్తలు వందలాది మందిని ఉరితాళ్ళకు వేలాడదీసి ఆ ఉరితాళ్ళకు నెక్‌టైస్ అనే పేరు పెట్టారని గుర్తు చేశారు. ఆ పరిస్థితుల్లో విప్లవం అణిగిపోయిందని ప్రచారమైనా తిరిగి రష్యన్ ప్రజలు బోల్షివిక్ పార్టీ నాయకత్వంలో ఉద్యమాన్ని ఉధృతం చేసి విజయం సాధించారని అన్నారు. ఆనాటి రష్యన్ విప్లవోద్యమ స్థితిగతులను తెలుసుకోడానికి ఈ పుస్తకం ఎంతో ఉపయోగపడుతుందని అన్నారు.

తర్వాత రివేరా కవిత్వం 'ఏప్రిల్ పందు' కవితా సంకలనాన్ని నగరంలోని మిత్ర మండలికి చెందిన కవి వీఆర్ విద్యార్థి పరిచయం చేశారు. పుట్టుకరీత్యా సీమాంధ్రకు చెందిన కవి హైద్రాబాద్‌లో ఉంటూ తెలంగాణ గురించి నిబద్ధంగా రాశారని అన్నారు. ఉన్నత

వర్గాలెప్పుడూ సాంప్రదాయవాదులేనన్న కవి అవగాహన నిజమే అంటూ రివేరా కవిత్వంలో సింబాలిజం ఎక్కువగా ఉందని అన్నారు. అందువల్ల చదవడం కష్టంగా ఉన్నప్పటికీ పీడిత వర్గ పక్షపాత దృక్కోణంతో ఈ కవిత్వం రాశారని అన్నారు.

మూడో పుస్తకంగా 'తెలుగు భాష కొన్ని సంగతులు' చెంచయ్య రచనను పరిచయం చేస్తూ యూనిట్ సభ్యుడు గిన్నెరాజు, 'భాష మనుషుల కోసం కాని మనుషులు భాష కోసం కాదు', 'భాష సరిగ్గా లేకుంటే నాగరికతా క్రమంలో మనం మళ్ళీ వందేళ్ళు వెనుకకు వెళ్ళవలసి వస్తుంది' వంటి మరికొన్ని మాటలను పుస్తకంలో నుండి ఎత్తిపట్టి సభికులకు పరిచయం చేశాడు.

యూనిట్ సభ్యుడు శాఖమూరి రవి, 'అకాస ఉద్యమంలో - అమరులు' పుస్తక పరిచయంలో అమరుల గురించి వివరించారు. సికాస విప్లవ నాయకత్వం ఆర్టీసీ కార్మికుల కడగండ్ల బతుకుల్లోనికి తొంగి చూసి అమానుష నిబంధనలనలకు వ్యతిరేకంగా గొప్ప పోరాటాలు చేసిందని అన్నారు. అకాస కార్మికులను సమీకరించి చిన్న చిన్న పొరపాట్లకు, సస్పెన్షన్ వేధింపులకు, టెర్మినేషన్‌లకు, లంచాలకు వ్యతిరేకంగా ఎన్నిన్ని పోరాటాలు చేసిందీ ఈ రచనలో ఉందని తెలిపారు.

విరసం కథా సంకలనాలు ముడిమనిషి, చేపలను వ్యంగ గేయ రచయిత, వ్యాస రచయిత గుండెబోయిన శ్రీనివాస్ పరిచయం చేస్తూ ఈ సంకలనాల్లోని కథాంశాలు అతి సామాన్యమైనవని పులుసు, అంబలి, చేపలు, ఊరూరి కథ, చావు, పుట్టుక కథలను క్లుప్తంగా పరిచయం చేశారు. చింత పులుసు కోసం పోతే ఒళ్ళు పులుసుపోయింది', చింతపండుకే కర్ర అందుకోవలసి వస్తే అన్నం కోసం ఏ పట్టుకోవాలో' కథల్లోని మాటలు ఉదహరిస్తూ అంతకంటే బలమైన ఆయుధాన్నే పట్టుకోక తప్పదన్న రచయిత పరోక్షంగా చెప్పే శిల్పాన్ని అభినందించారు. చివరగా చావు పుట్టుక శ్రీశ్రీ కథను పేర్కొంటూ పుట్టుకకు దవాఖాన, చావుకు పోలీసు స్టేషన్‌లు ప్రతీకలుగా చెప్పిన రచయిత నైపుణ్యాన్ని సభ దృష్టికి తెచ్చారు.

తర్వాత ప్రముఖ నవలా రచయిత అంపశయ్య నవీన్ 'తీత్వాల్ కుక్క మరికొన్ని కథలు' కథా సంకలనాన్ని పరిచయం చేశారు. మంటో రాసిన ఈ కథలు దేశ విభజన కాలానికి సంబంధించిన వన్నారు. శుద్ధ అహింసా మార్గం ద్వారా స్వాతంత్ర్యం వచ్చిందని చెబుతున్న వాళ్ళకు దేశ విభజన సందర్భంగా జరుగబోయే హింసను నెహ్రూ, జిన్నాలు పసిగట్టలేక పోయి అనేక మంది సామాన్యుల హత్యలు దోపిడీలకు పరోక్షకారకులయ్యారనీ అంటూ ప్రతి కథను క్లుప్తంగా తడుముతూ ఆ కాలపు నాయకుల అవగాహనా రాహిత్యాన్ని వ్యాఖ్యానించారు. 'కుక్కకు కూడా తను పాకిస్థానీయో ఇండియనో తేల్చుకోవలసిన అగత్యం వచ్చిందన్న విషయాన్ని మంటో చమత్కారంగా మలిచాడని అన్నారు.

ఏడవ పుస్తక పరిచయంగా యూనిట్ సభ్యుడు బాలసాని రాజయ్య 'కార్మిక వర్గ పుత్రిక గజ్జెల సరోజ' ను పరిచయం చేశారు. 'అమ్మ' నవలలోని అమ్మ పాత్ర వలె గజ్జెల సరోజ తల్లి ఉన్నతమైనదని అన్నారు. సరోజ తల్లి తన ఆరుగురు సంతానంలో నల్గురిని ఉద్యమానికి స్వయంగా అందించిందని తెలిపారు. సరోజ విప్లవ ప్రయాణాన్ని పుస్తకం నుంచి పరిచయం చేశారు.

'ఆఖరి బిడ్డ' బాసిత్ నాటికను టీపీఎఫ్ జిల్లా కమిటీ సభ్యులు, వరంగల్ రచయితల సంఘం వ్యవస్థాపక బాధ్యుడు నల్లెల రాజయ్య పరిచయం చేశారు. ఈ నాటికలోని పాత్రలు పితృస్వామ్య వ్యవస్థపై తిరుగుబాటుకు సంకేతంగా రచయిత మలిచాడని అన్నారు. ఆడా మగ లింగ నిర్ధాయకత పురుష క్రోమోజోమేనని సూరయ్య పాత్రకు రజిత పాత్ర వివరించడం ద్వారా సామాన్య జనానికి వైజ్ఞానిక దృక్పథాన్ని పరిచయం చేశాడని అన్నారు.

'ఒక మాట ఒక సంభాషణ' షహీదా కవిత్వాన్ని కవి, రచయిత్రి అనిసెట్టి రజిత పరిచయం చేస్తూ, సాధారణంగా వరంగల్ సాహిత్య వేదికల మీద ఎప్పుడూ తల నెరిసిన వాళ్ళే ఎక్కువగా కనిపిస్తారని, నేటి ఈ విరసం సభలో చాలా మంది కొత్త వక్తలు కనిపించారని అన్నారు. వీరంతా మామూలు విశ్లేషకులేనని, అయినా పుస్తకాలను బాగా పరిచయం చేస్తున్నారని అన్నారు. ఇది విరసంకే సాధ్యమని అన్నారు. ఎందుకంటే సామాన్యుల జీవిత వస్తువులే విరసం సాహిత్యమని అన్నారు. షహీదా సంకలనం నుంచి 'లాల్ సలామ్' కవితను పరిచయం చేశారు.అనేక భావాల మానవ స్పర్శల సమాహారమని విశ్లేషించారు.

'తాజా పూల పరిమళం' షహీదా కథల సంపుటిని ప్రొఫెసర్ కాత్యాయనీ విద్మహే పరిచయం చేశారు. ఏ సాహిత్యమైనా ఒక రాజకీయ సాంస్కృతిక సంభాషణనీ, 'నీనెందుకు మగపిల్లాడిగా పుట్టాను' అనుకునే సాహిత్యం కావాలి ఇప్పుడు అన్నారు. ఈ కథల్లోని ముఖ్యాంశాలను పేర్కొంటూ, కళాశాలల్లోలాగ సర్కారు బళ్ళల్లో పిల్లలకు కుర్చీలు బెంచీలు ఉండాలె, 'చెరువులను పాడు చేసిన వాళ్ళే ఇప్పుడు చెరువుల పునరుద్ధరణ చేపడుతున్నరు', 'పని మనిషి వద్ద మన వ్యక్తిత్వాలు బైట పడ్తవి', 'ప్రేమ ఏర్పడడానికి ఒక ఆశయం కావాలి', 'ఇంట్లో వాళ్లకు విప్లవ చైతన్యాన్నివ్వలేక పోయినందుకు తన్ను తాను క్షమించుకోలేక పోయానని' అనే మాటలు ఈ కథల్లో ఉన్నాయని అన్నారు. వివిధ పాత్రల ద్వారా రచయిత్ర కథలను నడిపిన తీరును విశ్లేషించారు. విప్లవ సాంస్కృతిక చైతన్యాన్ని కుటుంబపరంగా ప్రోది చేసుకోవలసిన అవసరాన్ని తెలిపారు.

చివరగా 'కథల పంట 3'ను ఐక్యవేదిక కన్వీనర్ విమర్శకుడు ఎమ్ రవీందర్ పరిచయం చేస్తూ ఈ సంకలనం విరసం సమిష్టి కృషిలో ఒక గుణాత్మక మార్పు అన్నారు. ఒక సాధారణ రచయిత తన సృజనను తన సొంతమే అనుకుంటారు కాని విరసం రచయితలు సాహితీ సృజనను, తమ వ్యక్తిగత, సామాజికాంశాలను కలుపుకొని వా సృజన చేస్తారని అన్నారు. అందుకే ఈ కథలు ఇంత చిక్కగా బలంగా ఉన్నాయని అన్నారు. అయితే ఒక కథలో అన్నట్లు కుందేళ్ళు తిరగబడి సింహం అధికాన్నంతం చేస్తాయనే స్ఫూర్తితో ఈ వస్తువులన్నీ రూపుదిద్దుకున్నాయని అన్నారు. ఇప్పుడు ఆంధ్ర వలసాధిపత్యాన్ని కూలదోసి తెలంగాణ సింహాసనం మీద కూచున్నవి కుందేళ్ళు కావనే విషయాన్ని గుర్తించాలన్నారు.

కన్వీనర్ వీరబ్రహ్మాచారి అధ్యక్షతన ఈ రెండవ సాయంత్రం సభ జరిగింది.. ఈ రెండు రోజుల సాహిత్య సభలో మధ్య మధ్య పాటలు కవితాగానం సాగాయి.






# ARUNATARA BOOKS

*Printed and published by Viplava Rachayitala Sangam (Virasam)*

## ప్రస్తుతం అందుబాటులో ఉన్న విరసం ప్రచురణలు, వాటి ధరలు

### కథ, నవల, కవిత్వం, సాహిత్య విమర్శ

| | | |
|---|---|---|
| 1. | కొడవటిగంటి కుటుంబరావు సమగ్ర సాహిత్యం (19 సంపుటాలు) | రూ.4525-00 |
| 2. | సాహిత్య సమాలోచన (కృష్ణాబాయి) | 300-00 |
| 3. | భావవిప్లవకారుడు కొకు | 80-00 |
| 4. | కొకు సమకాలీనత - విశ్లేషణా వ్యాసాలు | 75-00 |
| 5. | అక్షరతుణీరం (కె.వి.ఆర్. సాహిత్య విమర్శ వ్యాసాలు) | 20-00 |
| 6. | సుబ్బారావు పాణిగ్రాహి కవిత్వం, పాటలు | 25-00 |
| 7. | అంతస్సూత్రం (వరవరరావు కవిత్వం) | 40-00 |
| 8. | బీజభూమి (వరవరరావు కవిత్వం) | 100-00 |
| 9. | గుమ్మెటమోత (పాణి నవల) | 100-00 |
| 10. | కలిసి పాడాల్సిన గీతమొక్కటే (పాణి కవిత్వం) | 10-00 |
| 11. | తరాల పల్లె (కౌముది రచనలు) | 50-00 |
| 12. | చలసాని ప్రసాద్ రచనలు | 60-00 |
| 13. | దండకారణ్య కథలు | 100-00 |
| 14. | తెలుగు భాష - కొన్ని సంగతులు (వి.చెంచయ్య) | 15-00 |
| 15. | సాహిత్యధోరణులు - విప్లవ దృక్పథం | 30-00 |
| 16. | విరసం సాహిత్య విమర్శ | 150-00 |
| 17. | కథల పంట-3 | 120-00 |
| 18. | తీత్వాల్ కుక్క మరికొన్ని కథలు (సాదత్ హసన్ మంటో) | 60-00 |
| 19. | జాజిపూల పరిమళం (షహీదా కథలు) | 150-00 |
| 20. | ఒక మాట, ఒక సంభాషణ (షహీదా కవిత్వం) | 75-00 |
| 21. | సామాన్యుల సాహసం (నిత్య, మైనా, సుజాత కథలు) | 60-00 |
| 22. | ఫాల్గుణ (పద్మకుమారి నవలిక) | 30-00 |
| 23. | నల్లమల (పి. చంద్ నవల) | 225-00 |
| 24. | లాల్‌బనో గులామీ ఛోడో బోలో వందేమాతరం (ఎన్‌కె దీర్ఘ కవిత) | 25-00 |
| 25. | ముడిమనిషి (అరుణతార కథలు 1) | 30-00 |
| 26. | చేపలు (అరుణతార కథలు 2) | 30-00 |
| 27. | తెహెల్కా అద్దంలో సర్కారు బింబం మరికొంత కవిత్వం (బాసిత్) | 100-00 |
| 28. | ఆఖరి బిడ్డ (బాసిత్ నాటిక) | 10-00 |
| 29. | కాంత, పున్నం, వెన్నెల (పద్మకుమారి కథ) | 20-00 |
| 30. | రేపు (వెర్నన్ గొంజాల్వెజ్ కథ) | 20-00 |
| 31. | మిగిలెటోళ్లు (బాసిత్ కథలు) | 50-00 |
| 32. | రెండు పోరాట గాథలు (భారతి కథలు) | 50-00 |
| 33. | కటికీ పిట్ట (పి. మోహన్ కవిత్వం) | 10-00 |
| 34. | పిల్లనగ్రోవి తుఫాను (ఉదయభాను కవిత్వం) | 10-00 |
| 35. | మంజీరా మూడ్స్ (మంజీరా కవిత్వం) | 25-00 |
| 36. | కవితా ఝంకార్ (విరసం కవితా సంకలనం) | 75-00 |
| 37. | ఎర్రనక్షత్రం (చైనా నవల) | 50-00 |
| 38. | సముద్రంతో సంభాషణ (పి. వరలక్ష్మి) | 20-00 |
| 39. | నెగడు (కథలు) | 90-00 |
| 40. | ఒండ్రుమట్టి (నవల) | 170-00 |
| 41. | Wake of Telangana? - A docu-drama by basith | 10-00 |

### సంస్కృతి, చరిత్ర, రాజకీయార్థిక, సైద్ధాంతిక రచనలు

| | | |
|---|---|---|
| 1. | సామ్రాజ్యవాద సంస్కృతి (జేమ్స్ పెట్రాస్ వ్యాసాలు) | 125-00 |
| 2. | మావో రచనలు - 1 | 220-00 |
| 3. | మావో రచనలు - 2 | 220-00 |
| 4. | రివిజనిజం (మావో) | 75-00 |
| 5. | మార్క్సిజం, లెనినిజం, మావోయిజం | 125-00 |
| 6. | చారుమజుందార్ 8 డాక్యుమెంట్లు | 50-00 |
| 7. | మంద్రస్థాయి యుద్ధం | 100-00 |
| 8. | విద్యార్థి యువజనోద్యమాలు (లెనిన్) | 30-00 |
| 9. | రాజకీయ కృషి - మన కృషి అంతటికీ జీవనాడి (చైనా విప్లవోద్యమన పత్రిక హాంకీ వ్యాసాలు) | 35-00 |
| 10. | నక్సల్బరీ వెలుగులో (భారతదేశ నక్సలైట్ ఉద్యమ చరిత్ర) | 125-00 |
| 11. | జగిత్యాల జంగల్‌మహల్ (1) | 75-00 |
| 12. | జగిత్యాల జంగల్‌మహల్ (2) | 100-00 |
| 13. | స్టోలిపిన్ అభివృద్ధి నిరోధక కాలంలో | 15-00 |
| 14. | అంతర్జాతీయ విప్లవోద్యమాల్లోని ఆటుపోట్లు | 60-00 |
| 15. | భారతదేశంలో ఉత్పత్తి విధానం - ఉత్పత్తి సంబంధాలు | 20-00 |
| 16. | ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయోత్పత్తి సంబంధాలు | 30-00 |

### వర్తమాన సమాజం, ప్రజా ఉద్యమాలు

| | | |
|---|---|---|
| 1. | ముజఫర్‌నగర్ మరో మానని గాయం | 20-00 |
| 2. | నేటి రాయలసీమ | 100-00 |
| 3. | అంతర్యుద్ధంలో ఆదివాసులు | 30-00 |
| 4. | దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | 60-00 |
| 5. | ఉద్యమ ఆకాశంలో సగం | 15-00 |
| 6. | తూర్పు మధ్య భారతంలో విస్థాపన-ప్రజా ప్రతిఘటన | 20-00 |
| 7. | జనతన జైత్రయాత్ర | 20-00 |
| 8. | ఫిలిప్పినో ఉద్యమం | 15-00 |
| 9. | ఖైదీల సైరన్ | 60-00 |
| 10. | విముక్తిబాటలో నారాయణపట్నా | 20-00 |
| 11. | జ్ఞానం అందరిది | 30-00 |

### స్మృతి సాహిత్యం

| | | |
|---|---|---|
| 1. | ఖాన్‌దాదా (ఎం.టి.ఖాన్ స్మృతి) | 10-00 |
| 2. | ఆదర్శజీవులు అమరులు | 30-00 |
| 3. | నేనున్నాను కామ్రేడ్ (గంటి ప్రసాదం స్మృతిలో) | 30-00 |
| 4. | గంటి ప్రసాద్ రచనలు | 25-00 |
| 5. | సూర్యుడు మరణించడు | 60-00 |
| 6. | చిరునవ్వు సితార | 80-00 |
| 7. | గెరిల్లా డైరీ | 10-00 |
| 8. | మన్యం వెలుగులు | 15-00 |
| 9. | అక్షర కిరణం | 20-00 |

### డివిడిలు

| | |
|---|---|
| అరుణతార సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక (1977-2013) | 125-00 |

మరిన్ని వివరాలకు సంప్రదించండి : డి.వి. రామకృష్ణారావు, అరుణతార వర్కింగ్ ఎడిటర్,
ఫోన్ : 99891 89250 (ఉదయం 9 లోపు సాయంత్రం 8 తరువాత మాత్రమే) ఈమెయిల్ : arunatara1977@gmail.com
పుస్తకాల ధరకు సరిపడా డబ్బులతో పాటు, పోస్టింగ్ ఖర్చులను జతచేసి ఎం.ఓ. లేక డిడి ద్వారా పంపి పుస్తకాలను పొందవచ్చు.
ఆన్‌లైన్‌లో డి.వి.రామకృష్ణారావు, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, లాలాగూడ బ్రాంచ్, హైదరాబాద్, ఎకౌంట్ నెం. 10243583773,
ఐఎఫ్ఎస్‌సి కోడ్ : ఎస్.బి.ఐ.ఎన్.0007112కి చెల్లించి పుస్తకాలను పొందవచ్చు.
పి. వరలక్ష్మి, విరసం కార్యదర్శి, 5-1820, గీతాశ్రమం వీధి, ప్రొద్దుటూరు. ఫోన్ : 81799 13123, ఈమెయిల్ : varalurwa@gmail.com
**మా ప్రచురణలు నవోదయ బుక్ హౌస్, ఆర్యసమాజ్ ఎదురుగా, కాచిగూడ చౌరస్తా, హైదరాబాద్‌లోనూ లభిస్తాయి. ఫోన్ నెం: 040-24652387**



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M178 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Bhanu |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | Afsar |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |